# ఆంధ్ర సచిత్ర వారపత్రిక



.25
నయాపైసలు

8-4-59

సంవత్సరాది సంచిక

ANDHRA PATRIKA
ILLUSTRATED WEEK




వరధ్యానం

చిత్రకారుడు: "చెల్ల"—మద్రాసు.

సంవత్సర చందా
రు. 13-0-0
విడిప్రతిక 25న.పై

# ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

సంపుటము 53
సంచిక 28
8 4-59

**Founder : K. NAGESWARA RAO**

విలంబి ఫాల్గుణ బహుళ అమావాస్య బుధవారం

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
"వసంతయోద్ధా
సముపాగతః ప్రియే!"

# రాజధాని కబుర్లు



'ప్రవీణ్'

## "అభినవాభినవ" అప్పారావు

లోకంలో కొందరు మంచివాళ్ళుంటారు చాలామంది మంచి వాళ్ళలా కనబడే వాళ్ళుంటారు మంచివాళ్ళలా కనబడే మంచి వాళ్ళు బహు కొద్దిమంది ఈ బహు కొద్దిమందిలో శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు ఒకరు.

సాధారణంగా లోకం ఉద్దేశ్యంలో మంచివాడంటే 'అసమర్థుడు' అని అర్థం. నోట్లో వేలుపెడితే కొరికలేనివాడు అనీ అర్థం. మంచివాళ్లంతా అమాయకులంటే సులభంగా అంగీకరించవచ్చునేమోగాని, వాళ్లంతా అజ్ఞానులు, అసమర్థులు అంటే అంగీకరించడం కష్టం. నోట్లో వేలుపెడితే కొరకడం ఇష్టం లేనివారు వీరు; చేతకానివారు కారు. మంచివారుగా కనపడే మంచివారు బహు కొద్ది మందిలో, లోకం సమర్థులుగా గుర్తించిన వారు ఇంకాకొద్ది మంది. ఆ 'ఇంకా కొద్ది మంది'లో ఒకరు శ్రీ అప్పారావు.



శ్రీ పి. ఎస్. ఆర్. అప్పారావు

శ్రీ అప్పారావును చూస్తే ఎందుకో అందరికీ సహాయంచేయాలనే బుద్ధి పుడుతుంది. భారత ప్రభుత్వ యోగ్యతా వేతనంపై, తెలుగు నాటకరంగంపై పరిశోధన జరుపుతూన్న వీరు నాలుగుసంవత్సరాలు నిర్విరామంగా కృషిచేసి, భరతముని రచించిన నాట్యశాస్త్రాన్ని తెలుగు చేశారు. భరతముని శ్లోకాలను తెలుగు చేసినవారు లేకపోలేదు. కాని, డా॥ దివాకర్ల అన్నట్లు, శ్లోకాలను,శ్లోకాలపై వ్యాఖ్యలను అనువదించటమే కాక, ప్రాచ్య పాశ్చాత్యవిమర్శకులు ఈ విషయంపైచేసిన కృషిని తడవిచూపినవారు లేరు–ఇదివరలో!

నాలుగు సంవత్సరాల కృషి ఊరికేపోలేదు. 36 అధ్యాయాలు గల ఈ బృహత్ గ్రంథంలో 1026 పుటలున్నాయి. ప్రచురణకు పదహారు వేల రూపాయలు ఖర్చయింది. పదహారు వేలలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నాలుగు వేల రూపాయలిచ్చి, విద్యారంగంలో ఇదివరలో చేసిన తప్పులకు ప్రాయశ్చిత్తం చేసుకొంది.

అవసరం, యోగ్యత రెండూ ఉన్నచోట ఈ విధంగా ప్రభుత్వం సహాయం చేయడం అరుదు. ఈ సహాయానికి కారణ ులుగా ఇరువురు వ్యక్తులను ప్రత్యేకంగా పేర్కొనాలి. ఒకరు డా॥ బెజవాడ గోపాలరెడ్డి. వారు రాష్ట్రీక మంత్రిత్వ పదవిని విడిచి వెళుతూ, పైకం అనువాదకర్తకు చేరేలా ప్రయత్నించి వెళ్లారు. రెండవవారు శ్రీ కల్లూరు సుబ్బారావు. ప్రభుత్వ విరాళం అనువాదకర్తకు చేరడం విషయంలో వీరి కృషి మెచ్చుకో తగినది.

వీరిరువురూ గ్రంథావిష్కరణ సభలో ఒకరు ఆవిష్కరణ కర్తగా, మరొకరు కృతిభర్తగాపాల్గొన్నారు. సమావేశం ఏర్పాటు చేసిన సాంస్కృతిక సంస్థలు శ్రీ అప్పారావును అభినవాభినవగుప్తసిగా అభివర్ణించాయి.

### కల్లూరివారికి "ఏడో వివాహం"

షష్టిపూర్తి జనతర్వాత శాసనసభ్యులు శ్రీ కల్లూరి సుబ్బారావు ఏడుగురు కన్యలను వివాహమాడేరు కన్యలందరూ కావ్యకన్యలే కావడంవల్ల 'బహుభార్యా నిషేధ చట్టం' ఆయన్నేమీ చేయలేదు

ఆయన ఈమధ్యవివాహమాడినది ప్రౌఢాంగన. కొన్ని శతాబ్దాలుగా నాట్యశాస్త్రంగా, ప్రధాన వ్యాఖ్యాన గ్రంథంగా పరిగణింపబడిన భరతమునికన్య. శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు పెంచుకొన్నది. రసికులు డా. గోపాలరెడ్డి అధ్వర్యం వహించారు ఈ వివాహానికి.

కనపడకపోయినా శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి వయస్సు 68 సంవత్సరాలట. కల్లూరివారికంటె వయస్సులో పెద్ద వారు. వివాహ మహోత్సవానికి వచ్చి ఆశీర్వదించారు: వధువుని,



"నాట్యశాస్త్రం" కృతిస్వీకరిస్తున్న శ్రీ కల్లూరి సుబ్బారావు

గ్రంథం ఆవిష్కరిస్తున్న శ్రీ గోపాలరెడ్డి

# ★ రాజధాని కబుర్లు ★

వరుణ్ణి, వధువు తండ్రిని ఆశీర్వదిస్తూనే ఇంత వయస్సులో మళ్ళీ పెళ్ళేమిటన్నారు. అన్నట్టుగా అన్నారు. నాకు తెలిసినంతవరకు పెళ్లి కుదిర్చింది వారే. వెంటనే సుబ్బారావుగారు సమాధానం చెప్పారు : 'ధర్మసాధనకోసం భార్య కావాలి' అని. అన్నట్టుగా అన్నారు :

## రాకపోకలు-రాకపోడాలు

ఎక్స్‌ప్రెస్ రైళ్ళ రాకపోకలను గురించి గత వారం రాజధాని కబుర్లలో ప్రస్తావించాను. మన తంతితపాలాశాఖ ఈ విషయంలో రైల్వేశాఖతో పోటీ పడుతూన్నట్టు కనిపిస్తోంది. ప్రజలకు పొదుపు ఉద్యమంయొక్క నీతిపాఠాలను బోధించేందుకు ప్రయత్నిస్తోంది.

టెలిగ్రామ్ పంపిస్తే, ఉత్తరంకంటె ఆలస్యంగా చేరుతోంది-చేరితే! ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం పంపిస్తే, ఆర్డినరీకంటె వెనుకపడుతోంది. ఎక్స్‌ప్రెస్ డెలివరీబిళ్ళ అతికిస్తే, మామూలు ఉత్తరాల బట్వాడా ఐపోయినతర్వాత తీరిగ్గా చేరవలసిందే అది.

ఈ క్రింది విషయాలు అవధరించండి :

(1) జబల్‌పూరులో జనవరి తొమ్మిదిన పడేసిన ఒక 'ఇన్‌లాండు కవర్' ఫిబ్రవరి నాల్గవ తేదీన హైదరాబాదు చేరింది. జబల్‌పూర్ ముద్ర కవర్‌పై లేదు.

(2) ఫిబ్రవరి 19 న హైదరాబాదులో మదరాసు చిరునామాకి పంపిన ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరం, ఫిబ్రవరి 23 న మదరాసు చేరింది. ఉత్తరంపై 20 వ తేదీ ముద్ర ఉంది. ఉత్తరాలన్నీ విమానంపై పంపుతామని పోస్టల్ అధికారులంటారు.

(3) మార్చి 5 వ తేదీన హైదరాబాదులో పడేసిన ఎక్స్‌ప్రెస్ డెలివరీ ఉత్తరం అదే చిరునామాకి తొమ్మిదిరోజులతర్వాత 14 వ తేదీన మదరాసులో అందచేయబడింది.

(4) హైదరాబాదునుంచి కొత్తఢిల్లీలో ఒక చిరునామాకి రాసిన ఉత్తరం-మామూలు ఉత్తరం-సకాలంలో చేరింది. అదే చిరునామాతో 'ఎక్స్‌ప్రెస్ డెలివరీ' స్టాంపు అతికించిన మరో ఉత్తరం 'ఆ చిరునామా ఉన్న ఇల్లు లేదు' అంటూ తిరిగివచ్చింది.

తంతి తపాలాశాఖ ఉద్యోగులు సమ్మె విరమించుకున్నారని భావించాం. ఇంకా సమ్మె చేస్తూన్నట్టే భావించాలా ?

*   *   *   *

మధురాతి మధురమైన కంఠం—హృదయానందకరమైన సంగీతం- ఈ రెంటిని వర్ణించడం ఎలా? ఏ పదాలు వాడితే, ఏ సమాసాలు ఉపయోగిస్తే, పాఠకులకు అర్థం ఔతాయి ఇవి? ఇదీ ప్రస్తుతం నన్ను వేధిస్తున్న సమస్య.

దూరంగా ఎక్కడనుంచో వినబడ్డట్టు వినపడుతుంది కంఠం.

[63-వ పేజీ చూడండి]

# రాజనీతిజ్ఞుడు శ్రీ కళా వెంకటరావు



రాజకీయధురంధరుడు, దేశభక్తుడు, ఆంధ్రప్రదేశ్ రివిన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు మార్చి 27 వ తేదీన రాత్రి 2-30 గంటలకు హైదరాబాదులో ఆకస్మికంగా స్వర్గస్థులయ్యారనే దుర్వార్త ఆంధ్రప్రజానీకానికి విద్యుత్తాడనంలా తగిలింది.

1921 లో గాంధీమహాత్ముడు సత్యాగ్రహోద్యమం సాగించిన నాటికి శ్రీ వెంకటరావు వయస్సు 21 ఏళ్ళు. చదువుతూ చదువుతూ ఉన్న బి. ఏ. మాని వేసి, అంత చిన్నతనంలోనే స్వరాజ్య మంత్రంతో ఉత్తేజితులై, రాజకీయోద్యమంలోకి ఉరికారు. ఆనాటినుంచీ ఎన్నో పోరాటాలలో పాల్గొని, ఎన్నో సార్లు కారాగృహక్లేశం అనుభవించారు. 1937 లోను, 1946 లోనూ మద్రాసు శాసనసభకు ఎన్నికయ్యారు. 1939 నుంచి 1946 వరకూ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేశారు. 1949 నుంచి 1951 వరకూ అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేశారు. 1947 నుంచి 1949 వరకూ మద్రాసు మంత్రివర్గంలో రివిన్యూమంత్రిగాను, 1951 నుంచి 1952 ఫిబ్రవరి వరకూ ఆరోగ్యమంత్రిగాను పనిచేశారు. 1955 నుంచి విశాలాంధ్ర ఏర్పడేదాకా గోపాలరెడ్డిగారి మంత్రివర్గంలో ప్రణాళికలు, పరిశ్రమల మంత్రిగానూ, 1956 నవంబరు నుంచి ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గంలో మూడుమాసాలు ఆర్థిక మంత్రిగాను, తరవాత రివిన్యూ మంత్రిగాను పనిచేశారు. 1961 జూన్‌లో తన షష్టిపూర్తి అయ్యేనాటికి రాజకీయాలనుంచి విరమించి విశ్రాంతి తీసుకుంటామని కొంతకాలంగా ఆయన చెబుతూవచ్చారు. జమీందారీల రద్దు శాసనాన్ని అమలుచేసినది శ్రీ వెంకటరావే. రాజకీయాలనుంచి వైదొలగేలోగా భూసంస్కరణల శాసనాన్ని కూడా తన చేతులమీదుగానే అమలుచేయాలని ఆయన కలలుకనేవారు. ఈ కడపటి కోరిక తీరకుండానే ఆయన వెళ్ళిపోయారు.

ఆంధ్రప్రదేశ్ శాసనసభ, లోక్‌సభ శ్రీ వెంకటరావు మృతికి సంతాపం వెల్లడించాయి. "నిశిరాత్రి ప్రశాంతతలో నిశ్శబ్దయానంలో భూమాతకు వీడ్కోలు చెప్పి దేవతల స్వాగతాన్ని అందుకున్నారు. ఆయన నిశ్చలత్వానికి మూర్తి. మృత్యువు పిలుపుకు కూడా అదే నిశ్చలత. అదే ప్రసన్నవదనం. ప్రకాశం తర్వాత ప్రకాశం అంతటి వ్యక్తి" అనీ ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి జోహార్లు అర్పించారు.

"ఆంధ్రదేశాకాశంనుంచి ఒక తేజస్వంతమైన నక్షత్రం రాలిపోయింది," అని సభాపతి శ్రీ కాళేశ్వరరావు తమ దుఃఖం వెల్లడించారు. "శ్రీ వెంకటరావు మరణం కాంగ్రెసు ప్రభుత్వానికి, కాంగ్రెసు వ్యవస్థకు పెద్ద దెబ్బ" అని శ్రీ బెజవాడ గోపాలరెడ్డి సంతాపం ప్రకటించారు. ఆంధ్రశాసన సభలోని అన్ని పక్షాలవారూ రాజకీయ విభేదాలన్నీ విస్మరించి శ్రీ వెంకటరావు అకుంఠిత దేశభక్తిని, కార్యదీక్షను, నిస్వార్థాన్ని, సునిశిత మేధాశక్తిని, పరిపాలనా చాకచక్యాన్ని ప్రశంసించారు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక స్వర్ణోత్సవ సంచికలో శ్రీ వెంకటరావు 1920 నుంచి 1942 వరకూ స్వాతంత్ర్యోద్యమంలో తాము నిర్వహించిన పాత్రను, తమ రాజకీయస్మృతులను వివరిస్తూ చక్కని వ్యాసం వ్రాశారు. "కొలది సంవత్సరములలోనే ఆంధ్రపత్రిక వజ్రోత్సవ సంచిక రాగలదు. ఆసందర్భములో మిగిలిన 20 సంవత్సరాల ఆంధ్ర రాజకీయముల సంగ్రహచరిత్రమును తిరిగి నివేదించగలను" అని ఆ వ్యాసంలో వ్రాశారు. ఈ కోరిక కూడా తీరకుండానే ఆయన కీర్తిశేషులైనారు.

మంత్రిగా, నాయకుడుగా శ్రీ వెంకటరావు ఎంత ప్రతిభావంతులో, వ్యక్తిగా అంత స్నేహపాత్రులు. సరదామనిషి. ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ అందర్నీ నవ్విస్తూ జీవితమంతా ఒకే విధంగా గడిపిన మహావ్యక్తి. ఆయన మరణంతో ఆంధ్రదేశం ఒక గొప్ప నాయకుని కోల్పోయింది. ఆంధ్ర రాజకీయాలలో వీరి మృతి ఫలితంగా ఏర్పడిన శూన్యం భర్తీకానిది.

దుఃఖంలో మునిగివున్న శ్రీ వెంకటరావు కుటుంబానికి మా సానుభూతి తెలియజేస్తున్నాము. ★

# ఉత్సాహం వెల్లార్చే పండుగ

కాలగర్భంలో యెన్నో సంవత్సరాలు కలిసిపోయాయి. ఈనాడు విళంబి సంవత్సరం కూడా తన పని ముగించుకుని ధర్మాన్ని అతిక్రమించకుండా తెర మరుగైంది. వికారి సంవత్సరం ప్రవేశించింది.

కోయిల కుహూ కుహూ రావాలతో గొంతెత్తిన నవోదయం.

ఎల్లెడల విరజిమ్ముతున్న పుష్పసౌరభంతో మిళితమై, అందాలుచిందుతూ, వాడవాడలా తన రాకను తెలియజేస్తూ, చిరునవ్వు లొలకబోస్తూ, దరిద్రుని పూరికొంప మొదలుకొని ధనవంతుని సౌధాగ్రమువరకు ఒకే అహ్లాదాన్ని సమకూరుస్తుంది ఈ సంవత్సరాది.

పల్లెసీమల్లో యీనాడు ప్రజలు అలుకు ముగ్గులతోను, మామిడి తోరణములతోను, తమతమ గృహములను తీర్చిదిద్ది, అభ్యంగన స్నానములు చేసి, నూతన వస్త్రాలంకరణలతో కులాసాగా కాలక్షేపము చేయుట చూడగా, యీ సంవత్సరాది పండుగ కలకలలాడుతూ పల్లె ప్రజలకు నూతన సంవత్సరానికి కావలసిన జవసత్త్వాలను, ఆలోచనా సంపదను యివ్వడానికి అరుదెంచిందా అనిపిస్తుంది.

ఈరోజు సంవత్సరాది పండుగయని ఆనాడు యేవార్తాపత్రికలోనో చూచేవరకు గుర్తెరుంగని పట్టణపు బాలునకును, పండుగకై క్రొత్త బట్టల కొఱకు వారము రోజులనుండి మారాము చేయుచు, పండుగనాడు కూడ తానే ముందని అభ్యంగన స్నానమునకు కూడ అన్నదమ్ములతోను అక్కచెల్లెండ్రతోను పేచీ పెట్టుకొను పల్లెటూరి బాలునకునుగల వ్యత్యాసమును గమనించిన పాశ్చాత్య నాగరికత మన నెత్తిపై యెట్లు నాట్యము చేస్తున్నది వెల్లడి అవుతుంది.

తిథి వార నక్షత్రములనేమీ తెలియక యింగ్లీషు తేదీతోనే కాలమును గడుపు పట్టణపు తెలుగు వానిని జూచి తెలుగు జాతి నీరసించిపోయినదని మనస్సు బాధపడినా యీ పండుగనాడు పల్లెటూళ్లలో ఆలయమునందో లేక పురోహితుని యింటివద్దనో ఆ గ్రామమునందలి ఆబాలగోపాలమును జేరి తిథివార, నక్షత్రములతో కూడిన పంచాంగ శ్రవణము జరుపుతున్న ఘట్టమును జూచిన ముచ్చటయి తెలుగుజాతి యింకను జీవించి ఉన్నదనియే తలపునకు వస్తుంది,

అట్టి యీ సంవత్సరాది పండుగ, దాని రాక, చేయవలసిన విధానమును గూర్చి

## ఎం. ఎస్. సుందరమ్మ

కొంచెము ముచ్చటించుకుందాము. దీనికి ముందు కాల పరిణామమును గూర్చి తెలిసి కొనవలెను.

శ్రీమన్నారాయణుడే హిరణ్మయ స్వరూపియై సూర్యమండల మధ్యమున వసించుచు కాలచక్రాన్ని నడుపుతున్నాడని మన జ్యోతిష్కుల సిద్ధాంతం. ఆదిలో మహత్తర తేజోసంపన్నులైన ఋషీంద్రులు చాల కాలం తపస్సుచేసి నవగ్రహములను వాని భ్రమణములను గమనించి అనంతమైన కాల స్వరూపాన్ని నిరూపించారని, ఆ కాలాన్ని కొలవడానికి మానాలనుకూడా యేర్పరిచారని, ఆ మానాలే ఘడియలు, విఘడియలు, రాత్రింబగళ్ళు, రోజులు, నెలలు, సంవత్సరములుగా పరిగణింప బడుతున్నాయని ఆ జ్యోతిష్కులే చెబుతున్నారు.

ఇక భూగోళశాస్త్రజ్ఞులు చంద్రగ్రహము భూమికి 2,39,000 మైళ్ళ దూరమున గంటకు 2160 మైళ్ళ వేగమున ఆకాశమార్గమున సంచరించుతూ భూగోళము చుట్టును తిరుగుతున్నదనీ, అట్లు ఒకసారి భూమిని చుట్టివచ్చుటకు 29 దినముల 12 గంటల 44 నిమిషముల 3 సెకనులు పట్టుతున్నదనీ, అమావాస్య వెళ్ళిన పాడ్యమినుండి మరల అమావాస్యవఱకును చంద్రుడు ఒక భూప్రదక్షిణము చేస్తూ ఒక రాశినుండి మరొక రాశికి భూమితోపాటు చేరుతుంటాడనీ, భూమి తనచుట్టు తాను ఒక్కసారి తిరుగుటకు 23 గంటల 54 నిమిషముల కాలము పట్టుతున్నదనీ, భూమి సూర్యుని ఒక్కసారి చుట్టివచ్చిన కాలమునకే సౌరమాన సంవత్సరమని పేరుపెట్టారనీ చెబుతున్నారు.

చంద్రుడు భూమిచుట్టూ తిరిగి రావడానికి పట్టే కాలం ఒక నెల అనీ, అట్టివి పన్నెండు నెలలు ఒక సంవత్సరమనీ, అది చాంద్రమాన సంవత్సరమని, మన జ్యోతిష్కులు నామకరణం చేశారు. అయితే యీ రెంటింటికి కొద్దిరోజులు తేడా వస్తుంది. మన జ్యోతిష్కులు ఋతువులతో స్పష్టంగా కనిపిస్తున్న సౌరమాన సంవత్సరాన్ని, శుక్ల, కృష్ణపక్షాలతో కనిపిస్తున్న చాంద్రమాన సంవత్సరాన్ని వరుసలో లేక ఆ తేడా వచ్చే రోజులను సరిపెట్టే నిమిత్తం



ఉగాదినాటి ఉదయం

చిత్రకారుడు: వెల్లటూరి పూర్ణానందశర్మ

# ★ ఉగాది పండుగ ★

అధికమాసాన్ని సృష్టించారని యీ ఆచారం ఋగ్వేదకాలంనుంచి వస్తోందని పురాణాల వల్ల తెలుస్తోంది.

అయితే యీ సంవత్సరాది పండుగ జరుపుకొను ఆచారము వేదకాలమునుండి ఉన్నట్లు తెలియవస్తోంది.

రాత్రింబగళ్ళ కాలము సమానమయ్యే ఈ వసంతమే వేదయుగంలోకూడా ఉగాదిగా పరిగణించబడింది. ఆనాడే సంవత్సరాది నాడే యజ్ఞముచేయుట ప్రారంభమై సంవత్సరం పొడూగునా జరుగుతూండేదని తెలుస్తోంది.

పురాణాలను బట్టిచూస్తే అనాదినుంచి యీ సంవత్సరాది ఒకే నియమితమైన ఋతువులో గాని మాసంలో గాని, పక్షంలో గాని, [illegible] జరగలేదని అనేక రీతులుగా ఋజువూ వచ్చిందని తెలుస్తోంది.

ఆ నియమాన్ననుసరించే యీ ఉగాదిని దేశంలో ఒక్కొక్కరు ఒక్కొక్కప్పుడు జరుపుకుంటున్నారు.

ఉత్తరాయణారంభం—అనగా డిశంబరు జనవరి నెలలలో కొందరికి ఉగాది. వసంత ఋతు ప్రారంభంలోనే కొందరికి ఉగాది.

కర్ణాట మహారాష్ట్రులు ఆంధ్రులవలె వసంతంలోనే ఉగాది జరుపుకుంటారు.

తమిళులు, బెంగాలీలు తరువాతిమాసంలో ఉగాది జరుపుకుంటారు.

అనేక జాతుల్లో యీ ఉగాది జరుపుకోవడం ఆచారం అయినప్పటికి ఆంగ్లేయులకు మొదట యీ ఆచారం లేనేలేదు. వారు నార్మనులను చూచి నేర్చుకొని జనవరిలో ఉగాదిపండుగ చేసుకుంటున్నారు.

వగరు, పులుపుతో మిళితమైన మామిడి పిందెలతోను, పులుపు, తీపులతో మిళితమైన క్రొత్త చింతపండుతోను, తాజైన వేప పువ్వుతోను, క్రొత్త బెల్లముతోను తయారైన వేపపువ్వు పచ్చడిని యీ సంవత్సరాది పండుగ నాటి ఉదయమునకే పల్లెలలోని ప్రతివాడు ముందుగా సేవించుట, కొన్ని పల్లెలలో గ్రామ పురోహితుడు యింటింటికి ఆ పచ్చడిని తెచ్చి ప్రతివారికి యిచ్చుట చూడగా జీవితం అంతా సుఖాలమయమే కాకుండా కష్టాలతో కలిసి ఉందని, అట్టి కష్టంద్వారా సుఖాన్ని సాధించ గలమని, సుఖంతోపాటు కష్టాన్ని కూడా ఆనందంతో స్వీకరించవలెనని, గుణపాఠం నేర్చుకొనడమూ అనిపిస్తుంది.

ఇప్పటికీ సంవత్సరాది పండుగనాడు మారు మూలలనున్న పల్లె ప్రజలు, ముఖ్యముగా రైతులు ఉదయమునుండీ క్రొత్తగోగు నారతో పగ్గములను తయారు చేసుకొని సాయంత్రము నాగలి పూజలుచేసి సకుటుంబముగా తమతమ పొలములకుపోయి యేరువాక

(16-వ పేజీ చూడండి)



# ద్రవికాణ్యు

'శండిల'

"కాని ఆర్నెల్లు తిరగలేదు—అప్పుడే ఆగి పోయింది" పట్నంవెళ్ళే భర్తతో గొణిగింది శాంతమ్మ. ఆయన అసలే విసుపువల మనిషి. "ఏం జెయ్యమంటావ్? ఒక్కొక్క వస్తువు గొన్న వేళావిశేషం. నూట ఇరవై రూపాయలు దాని మొహాన వెలగబెట్టి బెస్టెండు కంపెనీది గదా, ఇల్లాలు లేడీవాచ్ గావాలని ముచ్చట పడుతూంది గదా అని కొన్నాను. నీ దశ బావుండకపోతే ఎవ రేంచేస్తారు? ఇలాగిచ్చేయ్! బాగు చేయించు కొస్తాను" ప్రత్యుత్తర మిచ్చాడు బయలుదేర డానికి చెప్పుల్లో కాళ్లుపెడుతూ సాంబశివ రావు. ఆయన కడపెట్టు దిగుతూండగా శాంతమ్మ వెనక్కు పిలిచి, "పోనీ! బాగు చేయించి కొన్నసొమ్ము కొంచె మించు మించు వస్తుందని తోస్తే అమ్మెయ్యండి. తులం బంగారమిస్తే పుస్తెలత్రాడైనా చేయించుకుంటాను" అన్నది. ప్రయాణమై వెడుతూంటే ఎవరేనా ఎందుకేనా సరే వెనక్కుదీస్తే దాన్ని అపశకునంగా తలపోసే ఛాందసులలో అగ్రేసరుల జాబితాలోవుండే సాంబశివరావు భార్య అలా పిలిచినందుకు లోపల్లోపలే ఏవగించుకుని "అలాగే" అని ముడిగా ముంచేసి చరచర నడక సాగించాడు. ముందు ఏమి రానున్నదో అని సందేహం అతన్ని రోడ్డువైపు నెమ్మదిగానే నడిపించింది.

కాని జరిగిందింకొకలాగుస. అనుకోనట్లుగా అతడు రోడ్డుమీదకు అడుగుబెట్టేడో లేదో అల్లంతదూరాన ఎదురయ్యింది పట్నం పోయే బస్సు. ఖాళీగా వుంది. సాయంత్రం అయిదు దాటకుండా పట్నం చేరవేసింది అయన్ను.

ఆ వేళ తాను లేచినవేళ మంచిదనుకోవ డానికి సాంబశివరావు కింకొక మహాదవ కాశం లభించింది. బస్సుస్టాండులో దిగీ దిగడంతోనే పూర్వమిత్రు డొకడు ఎదు రయ్యాడు. వాళ్ళింట్లో ఏదో శుభం జరిగిం దట-పట్టుబట్టి అతన్ని తీసుకెళ్ళి ఏడుగంటలు దాటకుండా షడ్రసోపేతంగా భోజనంపెట్టి పంపించాడు బజారుకు. ఆయన వాచీల రిపేరింగు షాపువైపు వస్తున్నాడు.

మెయిన్‌రోడ్డు బహురద్దీగా వుంది జనంతో. సాయంత్రం బజారు చేసుకునే జనం ముందుకు పోయేవాళ్లకు ఎడమియ్యడం లేదు. ఆ సమయంలో ఆ త్రొక్కిడిలో అనుకోకండా, తన కాలిక్రింద నలిగిపోయిన ఒక కాగితపు మడతను ఎందుకో పైకితీసి చూడాలనిపించి, సాంబశివరావు చూడడం సంభవించింది. సాంబశివరావు మునిసిపల్ ఎలక్ట్రికుదీపపు కాంతిలో దాన్ని చూస్తూ తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. 'ఇవాళ నిజంగా తాను లేచిన వేళావిశేషం బహుదొడ్డది; నిజంగా నక్కనడుం త్రొక్కివచ్చాను' అని పదే పదే అనుకున్నాడు. అది పదిరూపాయల నోటు-మాసినది-జనుల కాళ్ల త్రొక్కిడినబడి నలిగినది. అనూహ్యంగా అతన్ని ఆవహించిన లక్ష్మి పలువిధాల భావాలతో అతన్ని ముంచెత్తింది. "ఇదెవరిదో-పాపం! పారేసుకున్నారేమో! ఇదొక్కటే తమసర్వసంపదే-లేదా-దీన్ని తమ ఏఅక్కర లేక ఆపదను తొలగించుకోవడానికై ఏ పేద వారో అప్పటెట్టుకున్నదో-అప్పె దెచ్చుకున్నదో కాదుగదా! కావచ్చు—అయితే తానెవరికని దాన్ని ఎక్కడికి తీసుకెళ్ళి యిస్తాడు? కాకున్నా పదిరూపాయల కాగితానికి ఆనమాలేమిటి? తాను వెర్రిగా అడగబోతే ఎవరైనా మాదే అనెయ్యొచ్చు-ఆ సందర్భంలో అట్టి ప్రతి ఇతర వ్యక్తికంటే తానే ఆ అయాచితద్రవ్యానికి యోగ్యుడై వుంటాడే! కాగా తానలాగ ఒరుల నడగడం

# ★ దైవికాలు ★

వారు తన్ను లేకిగా తీసిపారేస్తారే" ఇదీ ఒక తరంగం.

"సిరి తనకు తా కాళ్లకు సాగిలపడి వచ్చినపుడు నాకీ ఆలోచనలేల? ఇది నాకైయే అర్పిత మయ్యింది. కాకున్నా పేదవాడిదే అని ఎందుకనుకోవాలి? తెగబలిసిన మోతుబరి సొమ్ములోనిది, లేదా నిర్దాక్షిణ్యంగా లంచంగుంజిన అవినీతిపరుడైన అధికారిది— ఎందుకు కాకూడదు? ఇది కేవలం నా రేఖవల్ల లభించింది." పాపం! సాంబశివరావు మనందరిలాగునే రెండో వూహవల్లనే కైవసం చేసుకోబడ్డాడు. ఐతే తాను రాత్రి నడిచినంతమేరకు ఎవరైనాఎదురై "బాబూ! ఒక పది రూపాయల కాగితం దొరికిందా రోడ్డుమీద మీకుగానీ?" అని అడిగితే, తనను అమితానందంలో ముంచెత్తుతున్న, దైవికంగా తటస్థపడిన, పెన్నిధిరూపంలో గోచరించిన, పెద్ద బెడదను విరగడ చేసుకుందాం, అనే ఊహాపేచిక అతనిలో పొడచూపక పోలేదు. కాని మంచిదే అయినా అట్టి మోచనకు యీ యుగంలో ఎక్కడో గాని వత్తాసు దొరకదు. పరిస్థితులు అట్టిది లభించినా దాన్ని త్రోసిరాజనమని మనస్సును వత్తిడిపెట్టి తప్పుదారి కీడ్చేస్తాయి. సాంబశివరావు కొంచెమైనా చింతించ నక్కరలేకపోయింది, అట్టి యాచనావాక్యం ఆ రాత్రి ఏ మూలనుంచి ఎదురుపడక పోవడంతో.

వాచీ రిపేరరుముందు నిలబడేసరికి ఎనిమిదయ్యింది. అతడు రోజుపని అంతా ముగించుకొని కొట్టు కట్టేస్తున్నాడు. అట్టివాడు సాంబశివరావుమాట తీసెయ్యలేకపోయాడు. తొమ్మిదిగంటలదాకా కూర్చొని వాచీ పూర్తిగా బాగుచేసేశాడు. కిరాయి యివ్వబోతే "ఎంతమాట! వద్దులెండి. ఇది మా షాపులో కొన్నదేగా! కాకున్నా ఏడాదిదాటేవరకు మేం మరమ్మతు ఉరికేచేసి ఇవ్వడం మా నియమం. ఇవేళ మీ వద్ద అయిదు రూపాయలు తీసుకుంటే మా కలకాలం వుండవలసిన పరపతి మాట!" అన్నాడు. ఆహా! ఏమిటీ వైచిత్రి! ఒక్కొక్కరోజు ఒక్కొక్క వ్యక్తి జీవితంలో ఎంత కమనీయంగా గడుస్తుందీ! అని విస్తుపోయాడు సాంబశివరావు.

"ఇవాళంతా లాభమే". స్నేహితునింటి వద్ద రాత్రి పన్నెండు గంటలకు పాన్పుపై పవ్వళిస్తూ, ఎలెక్ట్రిక్ పంకా గాలిక్రింద హాయి ననుభవిస్తూ గుణించుకుంటున్నాడు సాంబశివరావు: "లేదంటే పదిహేను రూపాయలు అనుకోకుండా కలిసివచ్చింది. "కలిసొచ్చే కాలానికి, నడిచొచ్చే బిడ్డ పుడతాడం"టూ రిందుకే. వాచీ రిపేరరు గారు నే ననుకున్నట్లు ఆఖరికి కొన్న ఖరీదు కేనా—పోనీ-ఆర్నెల్లు వాడుకున్నందుకో పది రూపాయలు మినహాయించుకునైనా నూటపదికి అడిగితే బావుండును. "అరే— మీరు అమ్ముతారని తెలియదుసుమండీ. మధ్యాహ్నమే ఒక వకీలుగారు వెస్టెండ్ లేడీ రిస్టువాచ్ గావాలన్నారు. సరే. రేపు ఇచ్చేస్తానులెండి," అని రిపేరరు అన్నపుడు జనించిన కొండంత ఆశా "నూరు రూపాయలనడం"తో కొంత మందగించింది. నేను తెగించి నూటపదిహేను కిచ్చెయ్యండి అన్నా. పోనీ ఆయనైనా ఇంకో పదిఅంటాడేమో అనుకున్నా. అనలేదు. మనకింతే ప్రాప్తి వున్నప్పుడు ఎలా గంటాడు? "ఎక్కడి కక్కడే వెనకటిలక్ష్మి" అనుకోవాలి. సాంబశివరావుకు సుఖంగా నిద్ర పట్టింది.

మరునాడు ప్రొద్దున్నే బస్సుస్టాండుకు వచ్చాడు. అయితే అతనికి రెండుబస్సులూ ఖాళీలేవు. మూడవబస్సులో ఇంటికొచ్చేసరికి పదిన్నరయ్యింది. జరిగిన కథంతా చెబుతూ నవ్వుకుంటూ, కేరింతాలతో పెనిమిటి తనజాతకాన్ని పొగడుకుంటూంటే శాంతమ్మ ఆనందానికి అంతులేదు. "దైవికంగా ఒక్కొక్కప్పుడు కష్టాలెలా కట్టగట్టుకు వస్తూంటాయో సుఖాలు, సంపదలూ అలాగే వస్తూంటాయి" అని శ్రుతికలుపుతూ "పోనీ! ఆ అమ్మకపోవడమూ మనమంచికే జరిగిందనుకోరాదూ! చూడండి- నేనంటున్నా. వారంరోజు లాగి మళ్ళీ పట్టుకెళ్ళండి వాచీ- రక్కున నూటఇరవై వస్తాయి. అసలు లేడీ వాచీలు ఈమధ్య రావడంలేదుట. ఇంకా లాభమే రావచ్చు మీరు కొంచెం బెట్టుసరి చేస్తే. దానితో నాను పేటా మజూరీలుపోను ఇంకా లేదంటే పాతికరూపాయలు మిగులుతాయి" గడుసుదనానికి పిడిపెట్టుకుంది శాంతమ్మ.

భోజనం పూర్తిచేసుకుని తాంబూలం సేవించి పందిరి పట్టెమంచంపై మేనువాల్చే సాంబశివరావును "ఏదివాచీ—చూద్దాం" అని అడిగింది భార్య. "ఆచేతి సంచీలో వుంది కేస్‌లో" అని నిర్లక్ష్యంగానే జవాబిచ్చాడు సాంబశివరావు. వాచీకై వెళ్ళిన శాంతమ్మ అరగంట సేపటి దాకా తిరిగి రాలేదు—కారణం ఏమిటో కనుక్కుందాం అని లేవబోతుంటే శాంతమ్మ అతనికెదురైన స్థితి, అప్పట్లో ఆమె ముఖంతీరూ "ఏమండీ సంచీలో వాచీకేస్ లేదే" అని బొంగురుపోయినరుద్ధకంఠంతో అనే ఆమె పలుకు పోలిక సాంబశివరావును నిశ్చేష్టుణ్ణిచేశాయి. పదిరూపాయల కాగితం దొరికిన నిమేషంలో దాని కథనం విన్న ముహూర్తంలో ఆ దంపతులలో మెదిలిన భావాలకువలె—మరి ఆవాచీపోవడంగూడా దైవికంగానే సంభవించింది గనుక—ఇప్పుడసలు ఏ వూహాలు కదలడంలేదు. ఎంతసేపో చెప్పలేనుగాని వాళ్ల మెదళ్లు మొద్దుబారి స్థాణువులుగా నిలిచిపోయాయి—రెండు సంఘటనలూ దైవికాలేగదా—మరి మానవునిపై ఆరెంటి ప్రభావమూ ఒకేరీతిగా ఏలవుండదు-ఇదేనా ఆ పరాత్పరుని లీలలోని (అందరికీ తెలిసివున్నా ఎవ్వరూ గ్రహించలేని) చిదంబర రహస్యం?? ★

# న్యాసాలాండ్‌లో

# శ్వేతజాతి దమననీతి

గత దశాబ్దంనుంచీ ఆసియా స్వాతంత్ర్యోద్యమాల విజయ ప్రతిధ్వనులు ఆఫ్రికా ఖండంలో అంతటా వినిపిస్తున్నాయి. ఘనా స్వాతంత్ర్యం ఆఫ్రికా నివాసుల స్వారాజ్యాభివేశానికొక తార్కాణం. దక్షిణాఫ్రికాలో తెల్లవారి సంఖ్య చాలా స్వల్పం. అత్యధిక సంఖ్యాకులు ఆఫ్రికా జాతీయులే. కాని వారందరు ఈనాడెంతో హైన్యం అనుభవిస్తున్నారు. ఆఫ్రికనులు శ్వేత జాతులు నివసించే ప్రదేశాల పరిసరాలలోకూడా నివసించకూడదు. ఇష్టం వచ్చినచోట భూములు, ఇళ్లు మొదలైన సిరాస్తులేవీ సంపాదించుకోకూడదు. దక్షిణాఫ్రికాలో రాజకీయాధికారం చేజిక్కించుకొన్న శ్వేత నాయకులు ఆఫ్రికనుల నన్ని రంగాలలోను వేరుచేసి దూర దూరంగా తరిమివేశారు. అనుమతి పత్రం (Pass) లేకుండా ఆఫ్రికా దేశీయులు తమ జన్మభూమిలో ఎక్కడా అడుగు పెట్టడానికి కూడా వీలులేదంటే—వారి దురవస్థ కొంతవరకు ఊహించుకోవచ్చును. నేనాటికీ ఆఫ్రికనులలో రాజకీయ చైతన్యం బాగా అభివృద్ధి పొందడం సహజం. ఎప్పటికయినా స్వాతంత్ర్యం సంపాదించుకోవలన్న తహతహ వారిలో విజృంభించడంలో కూడా ఆశ్చర్యమేమీ లేదు.

## న్యాసాలాండ్

1953 లో బ్రిటన్ ఉత్తర దక్షిణ రొడీషియాలు, న్యాసాలాండ్ కలిపి ఒక మధ్యాఫ్రికా సమాఖ్య ఏర్పరిచింది. న్యాసాలాండ్‌లో ఉన్న తెల్లవారి సంఖ్య ఎనిమిది వేలు. అక్కడ పుట్టి పెరిగిన నల్లవారు సుమారిరవై ఏడు లక్షలు. దక్షిణ రొడీషియా దక్షిణాఫ్రికా వర్ణ విచక్షణా విధానం మక్కీకి మక్కీగా కాపీ చేసింది. అనుమతి పత్రాల ఇనుప సంకెళ్ళలో దక్షిణ రొడీషియా దేశీయులెన్నో యమయాతన లనుభవించారు. న్యాసావాసుల నాయకుడు డాక్టర్ హేస్టింగ్స్ బండా. ఇతడు మధ్యాఫ్రికా సమాఖ్యకు ప్రబల విరోధి. దీనివల్ల వర్ణ విచక్షణ సిద్ధాంతం తు. చ. తప్పకుండా అనుసరించే తెల్లవారి దురన్యాయాలు న్యాసా దేశీయులనగా కొక్క చెయ్యగలవని డాక్టరు బండా భయం. ఉత్తర రొడీషియాలో కొన్ని భాగాలు, టాంగన్యీకా, న్యాసాలాండ్‌తో కలపాలనీ అదే ఆ దేశానికి శ్రేయస్కరమనీ ఇతనివాదం.

## కల్లోలాలు

ఇతని నాయకత్వంలో న్యాసా దేశీయులేకమై అక్కడక్కడ కొన్ని చిన్న చిన్న తిరుగుబాట్లు లేవదీశారు. గత జనవరిలోనే




వీటికి సంబంధించిన సూచనలు కనిపించాయి. న్యాసాలాండ్ జాతీయవాదులు కొందరు బ్లాన్‌టైర్ దగ్గర అరణ్యాలలో రహస్యసమావేశాలు జరిపి ఆపైన ప్రదర్శనలు, సమ్మెలు, ఊరేగింపులు ప్రారంభించారు. కోటకోటాలో ఆఫ్రికా దేశీయులు జరిపిన బ్రహ్మాండమైన ప్రదర్శనం బాష్పవాయు ప్రయోగంతో కొంతవరకు అదుపులోకి వచ్చింది. ఆ సమయంలో ప్రదర్శకులు కొందరు తెల్లవారి కార్ల మీద రాళ్లువిసిరారు. క్రమక్రమంగా ఈ ఉద్యమం బాగా విజృంభించింది. న్యాసాలాండ్ ఉత్తరభాగంలో ఉన్న ప్రభుత్వ విమానాశ్రయాలపై ఆఫ్రికా జాతీయవాదులు కొందరు పెద్దపెద్ద దాడులు జరిపారు.

మరికొందరు కత్తులతోను కటారులతోను కరోంగా విమానాశ్రయంమీద దాడిజరిపి ఒక పెద్ద భవంతికి నిప్పంటించారు. ఆ ప్రాంతంలో ఉన్న జైలులో ప్రవేశించి 13 గురు ఖైదీలను విడుదలచేశారు. క్రమంగా న్యాసాలాండ్‌లో లివింగ్‌స్టోనియా మొదలైనచోట్ల ఇలాంటిదాడులెన్నో ప్రారంభమయ్యాయి.

ఆపైన మధ్యాఫ్రికా సమాఖ్య ప్రధాన మంత్రి సర్ రాయ్ వెలిన్‌స్కీ నల్లజాతివారి స్వాతంత్ర్యావేశం పెచ్చుపెరిగిపోకుండా అణిచివెయ్యాలని నిశ్చయించాడు. ప్రదర్శకులపై బాంబులు కురిపించడానికి సైనికులతో సహా నాలుగువిమానాలు పంపించాడు. ఇంకా కొన్ని పటాలాలుకూడా బయలుదేరాయి. వీరందరు కరోంగా సమీపంలో ఫోర్ట్ హిల్ దగ్గర దిగి తిరుగుబాటుదారులతో తలపడారు. కాని జాతీయవాదులంతకు పూర్వమే విమానాశ్రయంలో పెద్ద పెద్ద రాళ్లు దొర్లించి ఆపైన సైనికులెవరు దిగడానికి వీలులేకుండా అడ్డుకొన్నారు. బ్లాంటైర్‌లో పోలీసులు, విప్లవవాదులు వీధులలోనే పోరాటం సాగించారు. రహస్య ప్రదేశాలలో దాగిన ఆఫ్రికనులు కొందరు కార్లమీద రాళ్లువిసిరి పోలీసుల నెదుర్కొన్నారు. సైనికులాపైన గుంపులమీద తుపాకులు కాల్చారు.

జాంబేసీనది ఉత్తర దక్షిణ రొడీషియాల సరిహద్దులలో ప్రవహిస్తున్నది. ఆ నదిపై నిర్మించే కరీబా డామ్ ప్రాంతంలో పని చేస్తున్న 6 వేల 6 వందలమంది ఆఫ్రికా కార్మికులలోకూడా ఈ అలజడి వ్యాపిం

# న్యాసాలాండ్

-చింది. గుమిగూడి వారందరు సమ్మెచేసి ప్రదర్శనలు ప్రారంభించారు.

దక్షిణరొడీషియా ఆఫ్రికనులు సహజంగా చాలా సౌమ్యులు. ఇంతకుపూర్వం వారెన్నడు ప్రదర్శనలు మొదలయిన ఆందోళనలేవీ సాగించలేదు. కాని ఈ ఆవేశంలో వారుకూడా బాగా పెచ్చుపెరిగిపోయారు. చిట్టచివరికి తిరుగుబాటుదారులలో మొట్టమొదటివారన్న ప్రఖ్యాతి వారికేదక్కింది.

అయితే సమాఖ్య ప్రభుత్వం మాట్లాడకూరుకోలేదు. పత్రికలలో వార్తానిషేధంకఠినంగా అమలు జరిపింది. తెల్లవారినందరినీ సమీకరించింది. దక్షిణ రొడీషియాలో అంతటా అత్యవసరపరిస్థితి ఏర్పడినదని ప్రకటించింది. పోలీసులు రాత్రి రెండుగంటలవేళ హఠాత్తుగా దాడులుజరిపి మొత్తం 250 మంది ఆఫ్రికాజాతీయ కాంగ్రెసునాయకులను నిర్బంధించి జైళ్ళలో పడవేశారు.

అయితే ఈదమనవిధానంవల్ల న్యాసాజాతీయతావేశంతగ్గుముఖంపట్టే సూచనలేవీకనిపించడంలేదు. కాని న్యాసాలాండ్‌లో శ్వేతజాతిదౌర్జన్యకాండనానాటికిమితిమీరిపోతున్నది.

ప్రభుత్వ దౌర్జన్యం స్థానికశ్వేతజాతీయులందరు ఆమోదించి బలపరుస్తున్నారు. కాని లండన్‌లో వలసరాజ్యశాఖకిది అంతగారుచిస్తున్నట్లు కనబడడంలేదు. మొట్టమొదట ఈవిధమైన మధ్యాఫ్రికాసమాఖ్య ఏర్పరచాలని నిర్ణయించినవారీ శాఖాధికారులే. ఇప్పుడు వారీసమాఖ్యను గురించి కొంచెం కించపడుతున్నారు.

న్యాసాలాండ్‌ను ఉత్తర దక్షిణ రొడీషియాలతో కలిపి సమాఖ్య ఏర్పరచడం చాలా పొరపాటని స్పెక్టేటర్ పత్రిక బ్రిటిషు ప్రభుత్వంపై దుమ్మెత్తిపోసింది. స్థానిక శ్వేతజాతీయులకు న్యాసాదేశీయులను బలిపెట్టదలచుకోలేదని వెంటనే ప్రకటించాలని స్పెక్టేటరుపత్రిక తీవ్రంగా హెచ్చరించింది.

ఇది బ్రిటిష్ ప్రభుత్వం తక్షణం సాధించవలసిన ప్రధానసమస్య. ఆఫ్రికా దేశీయులెన్నో శతాబ్దాలనుంచి శ్వేతజాతుల అధికారపాదఘట్టనలోపడి నలిగిపోయారు. చిరకాలం నిద్రాణమైవున్న ఆఫ్రికా క్రమక్రమంగా మేలుకుంటున్నది. ఎంత అణచివేసినా తెల్లవారు ఆఫ్రికాలో నల్లవారి స్వాతంత్ర్యావేశం మొదలంటా రూపుమాపలేరు. అత్యధిక సంఖ్యాకులయిన ఆఫ్రికావాసు లెప్పటికయినా తమ జన్మహక్కు సాధించుకుని స్వదేశంలో స్వరాజ్యం స్థాపించుకోగలరని విజ్ఞులెవరయినా అంగీకరిస్తారు. న్యాసాలాండ్‌లో యీనాడు బయలుదేరిన ఉద్యమమూ, అలజడి వారి స్వాతంత్ర్యానికొక నాందీప్రస్తావన మాత్రమే. ★



# న్యూఢిల్లీ లేఖ

—శ్రీక్ష్మావర—

# టిబెట్ కల్లోలంపై భారత వైఖరి

టిబెట్‌లో చెలరేగిన తిరుగుబాటు ఇతర వార్తలన్నిటినీ మాటుపరచింది. తిరుగుబాటునుగూర్చిన గుసగుసలు కొద్దికాలంగా వినపడుతూఉన్నా, స్పష్టమైన వార్తలు మాత్రం ఈమధ్యనే బయటకి పొక్కాయి. అందుచేత ఎవరూ అంతగా ఆశ్చర్యపోలేదు.

చైనా స్వతంత్రరాజ్యం: భారతదేశానికీ, చైనాకీ స్నేహసంబంధాలున్నాయి. అందుచేత ఆ దేశపు ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోరాదని భారతప్రభుత్వం నిశ్చయించింది. ఈ నిశ్చయం సమంజసమైనదే. కాని ఈమాదిరి నిర్ణయాన్ని అన్ని సందర్భాల్లోనూ ఎందుకనుసరించరాదూ అని ప్రశ్న. "పంచశీల" ఒప్పందం చేసుకొన్న దేశాలపట్ల ఒకరకం విదేశాంగనీతిని, అలాంటి ఒప్పందం లేని దేశాలపట్ల మరోరకం విదేశాంగనీతిని భారతదేశం అనుసరిస్తున్నట్లు చాలాసార్లు వ్యక్తమైంది. ఉదాహరణకి ఫ్రాన్సుతో మనదేశానికి పంచశీల ఒప్పందంలేదు. అందుచేత మనప్రభుత్వం అల్జీరియా సంఘటనల గూర్చి తన అభిప్రాయాలను వెల్లడించటానికి వీలుంది; వెల్లడించిందికూడాను. వలసవిధానం నాగరికతకు శత్రువు. అందుచేత దాన్ని ఏమాత్రం సహించకూడదు. కనుక అల్జీరియాలో స్వాతంత్ర్యోద్యమాన్ని భారతదేశం సమర్థిస్తుంది. న్యూగినీపై ఇండోనీషియా హక్కును కూడా సమర్థిస్తుంది. ఎందుకంటే న్యూగినీ డచ్‌సామ్రాజ్యంలో ఒకభాగం. అందుకని అది డచ్చివారి వలస.

పండిట్ నెహ్రూ తన "గ్లింప్సెస్ ఆఫ్ హిస్టరీ" పుస్తకంలో ఇలా రాశారు: "చైనా ప్రస్తుతానికి మంచూరియాను కోల్పోయింది. మంగోలియా సోవియెట్ యూనియన్‌కు సన్నిహితంగా చేరి సోవియెట్ ప్రాంతమైంది. టిబెట్ ఇప్పుడు స్వతంత్రంగా ఉంది."

ఈ పుస్తకం 1935 లో ప్రచురితమైంది.

ప్రధానమంత్రి ఏర్పాటుచేసిన మొట్టమొదటి అంతర్జాతీయ సమావేశం 1946 శీతకాలంలో జరిగింది. అది పురానాఖిల్లాలో జరిగిన ఆసియాదేశాల ప్రతినిధుల సమావేశం. కీ॥ శే॥ సరోజినీనాయుడు ఆ సమావేశానికి అధ్యక్షత వహించారు. మహాత్మాగాంధీకూడా ఆ సమావేశంలో ప్రసంగించారు. అప్పుడు టిబెట్‌ను సర్వస్వతంత్ర రాజ్యంగానే ఆ సమావేశంలో పాల్గొనటానికి రమ్మని ఆహ్వానించారు. స్వతంత్రరాజ్య ప్రతినిధులుగానే టిబెటన్ ప్రతినిధులను గుర్తించారు. ప్రారంభసభలో ఒక పెద్ద ఆసియాపటాన్ని ప్రదర్శించారు. అందులో టిబెట్‌ను చైనా పరిహద్దుల కవతలే వేశారు.

1948 శరదృతువులో ఇలాంటిదే మరొక సంఘటన జరిగింది. అప్పట్లో కాశ్మీర్ వివాదం భద్రతామండలిదాకా వెళ్ళింది. "కాశ్మీర్" అనే చలనచిత్రాన్ని చూటానికి రావలసిందిగా న్యూఢిల్లీలోని విదేశీ రాయబారవర్గాధికారులను ఆహ్వానించారు. దానికి హాజరైన చైనీస్ రాయబారి డా॥ లో చియా లున్ ఆ సినిమాలో చూపించిన కాశ్మీర్ పటంలో—టిబెట్ చైనా సరిహద్దుకివతలగా ఉన్నట్లు గీయబడటం—చూశారు. ఆఫీసుకు వెళ్ళిన వెంటనే లిఖితపూర్వకంగా అసమ్మతి తెలియజేశా రాయన. కొంతకాలందాకా భారత ప్రభుత్వం జవాబు రాయలేదు. చాలసార్లు గుర్తుచేయగా, చేయగా, చివరికి ఆ చిత్రం తయారుచేసింది భారతప్రభుత్వం కాదనీ, అయినా వెంటనే ఆ విషయం పరిశీలిస్తామనీ



# న్యూఢిల్లీ లేఖ



సమాధానమిచ్చారు. అయినా ఆ చిత్రంలో పటం మార్చబడకుండానే ఉండిపోయింది.

1949 జులై 8 వ తేదీన టిబెటన్ మంత్రివర్గం—టిబెట్‌లో రేడియో స్టేషనులోను, ఆస్పత్రిలోను, లాసా, గ్యాంట్సేలలో ఉన్న చైనీస్ ప్రైమరీ పాఠశాలల్లోను పనిచేస్తూ చైనీస్ జాతీయ ప్రభుత్వంతో సంబంధమున్న వ్యక్తులందర్నీ తొలగించటానికి నిశ్చయించింది. చైనీస్ ప్రభుత్వపు రేడియో స్టేషన్‌ను లాసా అధికారులు స్వాధీనం చేసుకుని సామగ్రినంతనూ సీలుచేసేశారు. ఏ చైనీయుడు భారతీయ వైర్లెస్ సర్వీస్ ద్వారా సైనా సరే బయటికి వార్తలు పంపించటానికి వీలేకుండా కట్టుదిట్టం చేశారు. డాక్టరుగా, టీచరుగా ఇంకా ఇతరవిధాలుగా పనిచేస్తున్న చైనీస్ వ్యక్తుల్లో చాలామంది లాసా నుంచి జులై 18 వ తేదీన తరలి వెళ్ళిపోయారు.

భారతప్రభుత్వం 1949 నవంబరు 1 వ తేదీన కమ్యూనిస్టుచైనా ప్రభుత్వానికి ఒక లేఖ రాసింది: చైనీస్ సార్వభౌమత్వానికి లోబడి ఉంటూనే టిబెట్ తనకు స్వయం పరిపాలనాధికారం ఉండాలని చేస్తున్న న్యాయసమ్మతమైన ఆందోళనలో తాము కలగజేసుకోబోవటం లేదని, తమకు స్వప్రయోజనాలంటూ ఏమీలేవనీ రాసింది. అయితే టిబెట్‌కు స్వయంపాలనాధికారం ఉండాలనీ, ఆచారసిద్ధంగాగాని, ఒడంబడికల మూలంగాగాని టిబెట్‌లో భారతదేశానికి ఉండుకున్న హక్కులను మన్నించాలనీ కూడా ఆ లేఖలో స్పష్టంచేసింది. ఈ హక్కులేమిటో భారత ప్రభుత్వం జాబితా ఇచ్చింది: లాసాలో తమ ప్రతినిధి ఉండాలి; యాటుంగ్‌లో ఒక వ్యాపారవు ఏజెంటూ గ్యాంట్సేలో ఇంకో ఏజెంటూ ఉండాలి. గ్యాంట్సేకి వెళ్ళే వ్యాపారపు రహదారిపొడుగునా తంతి, తపాలా ఏర్పాట్లు ఉండాలి. ఆ రహదారిరక్షణకు గ్యాంట్సేలో భారతీయ సైనికులదళం ఒకటి ఉండాలి. భారత చైనాసంబంధాలు చెడిపోనిపద్ధతిలో టిబెటన్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించాలనికూడా ప్రభుత్వం ఆ లేఖలో మరీ మరీ ఉద్ఘాటించింది.

ఈవిధంగా భారతప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వ కాలంలో వలెనే, టిబెట్‌లో చైనాకు సార్వభౌమాధికారం మాత్రమే ఉందని గుర్తించింది. టిబెట్‌కు స్వయం పాలనాధికారం ఉండాలని గట్టిగాచెబుతూ చైనా తొందరపడి ఏచర్యా తీసుకోకుండా నిగ్రహించ ప్రయత్నించింది. బ్రిటిష్‌పాలన కాలంలో వలెనే ఇప్పుడుకూడా తనకు టిబెట్‌లో కొన్ని హక్కులున్నాయని ఖచ్చితంగా చెప్పివేసింది.

కమ్యూనిస్టు చైనాతో పంచశీల ఒడంబడిక చేసుకోవటం మూలంగా ఈ సమస్య అంతా మారిపోయినట్లు భావింపవలసి ఉంటుంది. మొన్న మార్చి 23 వ తేదీన భారత ప్రధాని లోక సభలో టిబెట్ సంగతి ప్రస్తావిస్తూ, టిబెటన్ తిరుగుబాటు చైనా అంతరంగిక వ్యవహారమనీ, దాంతో భారత దేశానికి సంబంధమేమీ లేదనీ అన్నారు.

* * *

దిగుమతులను తగ్గించీ—టూరిస్టులకు కోటాలు తగ్గించీ—విదేశీ ద్రవ్యాన్ని పొదుపుచేయాలని ఒకమూల ప్రయత్నిస్తూనే, మరోకవంక యథాప్రకారంగా విదేశాలకు ప్రభుత్వ ప్రతినిధివర్గాలనూ, వ్యాపార ప్రతినిధివర్గాలనూ పంపుస్తున్నారు. ఉత్పత్తి అభివృద్ధిమండలి స్థాపితమైన తర్వాత చేసిన మొదటిపని ఏమిటీఅంటే—విదేశాలకు ఒక ప్రతినిధివర్గాన్ని పంపించటం. ఇంకో ఆరుప్రతినిధివర్గాల్ని పంపించాల్సిఉందట. లోక సభలో ఈ మధ్య శ్రీ మహావీర్ త్యాగి చెప్పినట్లు, పలభైమంది తోకూడిన శాస్త్రజ్ఞుల సంఘం ఒకటి ఒక సమావేశానికి హాజరయ్యేందుకుగాను జనీవా వెళ్ళింది. భారతదేశంలో వ్యవసాయాన్ని అభివృద్ధి చేసేందుకుగాను, వ్యవసాయశాఖ చైనాకు ఒకటివెనక ఒకటిగా ప్రతినిధి వర్గాలను పంపిస్తోంది. రాష్ట్రపతికూడా ఇటీవలకొన్ని దేశాలు దర్శించివచ్చారు.

ఇది ఇలాఉండగా ఒక పెద్దమనిషి ఇటీవల రష్యావెళ్ళివచ్చి ఒక బృహన్ని వేదిక సమర్పించాడు. దాన్ని ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలించింది. పరిశీలనచేస్తే—ఆ నివేదికలో కనీసం సగానికి సగం—అదివరకెప్పుడో ఒక అమెరికను తన ప్రభుత్వానికి సమర్పించిన నివేదికలోంచి యథాతథంగా కాపీ కొట్టబడిందని తేలింది. అయితే అది గ్రంథచౌర్యం అనటానికి వీల్లేదు. అది భారతీయుల అజ్ఞానాన్ని ఆసరాచేసుకుని లబ్ధి పొందాలనిచేసిన ప్రయత్నం. ఆ పెద్దమనిషి భారతరత్న బిరుదానికి అర్హుడు.

* * *

"రాజ్యాంగాన్ని లోపలచేరి ధ్వంసం చేయటానికి" కీ. శే. పండిట్ మోతిలాల్ నెహ్రూనాయకత్వాన కాంగ్రెసు పార్టీ శాసనసభలో చేరింది. కాంగ్రెసుపార్టీ ద్వారా పార్లమెంటులో చేరిన వ్యాపారస్తుల విషయంలోకూడా అదే చెప్పవచ్చు. వారిలో కొందరు-ముఖ్యంగా శ్రీ మొరార్కా ప్రభుత్వరంగాన్ని లోపలనుంచే నాశనం చేయప్రయత్నిస్తున్నారు. ప్రభుత్వరంగంలోని మూడు ఉక్కుకర్మాగారాలనుగూర్చి ఆయన వారం వారం ప్రశ్నల బాణాలు విసురుతూ ఉంటారు. కాంగ్రెసు వాదులు చాలామంది సభ్యులుగా ఉన్న అంచనాల సంఘం శ్రీ మొరార్కా విమర్శించటానికి కావలసినంత సమాచారం సప్లయి చేసింది.

కాని శ్రీ మొరార్కా వేసిన ప్రతిసవాలుకూ సమాధానం చెప్పటానికి ఉక్కుశాఖ మంత్రి కృతనిశ్చయులయ్యే వున్నారు. ఆయనకు ఏ విషయమూ దాచవలసిన అవసరం లేదు.

శ్రీ మొరార్కాలాంటి వ్యక్తులు ప్రైవేటు రంగానికి ఉపకారంకంటే అపకారమే ఎక్కువ చేస్తున్నారని ఇక్కడ కొందరి అభిప్రాయం. ప్రతి క్రియకూ సమానమైన ప్రతిక్రియ ఉంటుంది. ప్రభుత్వరంగంపై యుద్ధం ఎక్కువైనకొద్దీ ప్రైవేటురంగాన్ని నిరోధించాలనే ప్రయత్నంకూడా ఎక్కువ అవుతూ ఉంటుంది.

* * *

గడిచిన వేసవికాలంలో తపాలాపనివారికి దొంగ సర్టిఫికెట్లు ఇచ్చిన కొందరు డాక్టర్లపై ప్రభుత్వం ఏమి చర్య తీసుకున్నదని లోక్‌సభలో వచ్చిన ప్రశ్నకు సమాధానంగా ఆ డాక్టర్లకు వార్నింగు ఇచ్చామని ఆరోగ్యశాఖమంత్రి చెప్పారు.

# న్యూఢిల్లీ లేఖ

నాకొక సందర్భం ఇలాంటిదే జ్ఞాపకం వస్తోంది. దొంగ సర్టిఫికెట్టు ఇచ్చిన ఒక డాక్టరు పేరు మెడికల్ రిజిస్టరులోంచి తొలగించారు. భారతదేశంలో నిజాయితీ ప్రమాణమూ, వృత్తినీతీ తగ్గిపోతున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?

* * *

ఢిల్లీలో బిచ్చగాళ్ల న్యూసెన్సు గూర్చి వచ్చిన ప్రశ్నకు డిప్యూటీహోం మంత్రి శ్రీ బి. ఎమ్. దత్తార్ ఇలా జవాబిచ్చారు.

"ఢిల్లీ మునిసిపల్ కార్పొరేషను ఆక్టు (1957)లో సెక్షను 397 (1) (ఎ) (ii) ప్రకారం బహిరంగస్థలాలలో ఊరికే విచ్చలవిడిగా తిరగటం, బిచ్చం ఎత్తుకుంటూ తిరగటం నిషేధించబడింది. ఢిల్లీ ఎడ్మినిస్ట్రేషనువారు, ఢిల్లీ కార్పొరేషను, న్యూఢిల్లీ మునిసిపల్ కమిటీ—ఢిల్లీ భిక్షు గృహానికి సహాయంగా రూ47,500ఇచ్చారు."

ప్రభుత్వాన్ని పట్టుకున్న ముఖ్యమైన జబ్బేమిటో శ్రీ దత్తార్ సమాధానంవలన తెలియవస్తోంది. ప్రభుత్వం ఒక శాసనం చేస్తుంది. ఆశాసనంతో 'చెడు' కాస్తా కొట్టుకుపోయిందనే భ్రమలో నిద్రపోతుంది. ఆరోగ్యశాఖవారు ఆహార పారిశుద్ధ్యానికి, మందులలో కల్తీలేకుండా చేయటానికి కొన్ని శాసనాలు చేశారు. అంటే కనీసం భారత రాజధానిలోనైనా ప్రజలకు శుభ్రమైన ఆహారం, కల్తీలేని మందులు దొరుకుతున్నాయని మనం కూడా భ్రమపడి నిద్రపోవాలన్నమాట. అయితే ఒక్కసారి చాందినీచౌక్‌కు శ్రమపడి వెళ్ళిచూస్తే అలా భ్రమపడే అవకాశం లేదని తేల్తుంది.

శ్రీ దత్తార్ సమాధానమూ అలాగే భ్రమాన్వితంగా ఉంది. శాసనం ఉంది గనక ఢిల్లీలో బిచ్చగాళ్లు లేరని ఆయన ఊహించారు. ఢిల్లీ రైల్వే స్టేషనులోగాని, కనాట్ ప్లేస్‌లోగాని ఒక్క అయిదు నిమిషాలసేపు తాపీగా నుంచోటానికి వీల్లేకుండా చేసే మనుషులు శ్రీ దత్తార్ చెప్పినదాన్నిబట్టి బిచ్చగాళ్ళు కారన్నమాట. బిచ్చగాళ్ళే అయితే భిక్షుగృహంలోనో, పోలీసు లాకప్పులోనో ఉంటారుగా! అంచేత లాతప్పేమీలేదు. మళ్ళీ తనకు ప్రజాబాహుళ్యంతో బుజాలు రాసుకు తిరిగేంత సాన్నిహిత్యం ఉందని శ్రీ దత్తార్ చెప్పుకుంటూ ఉంటారు. ★

## ఉగాది పండుగ

(8-వ పేజీ తరువాయి)

ప్రారంభించి తమతమ జీతగాళ్ళకు పాలేళ్ళకు బహుమతులిచ్చి సంతోష పెట్టుట చూడగా భూమాతను నమ్ముకున్న పేద రైతు, రైతుయొక్క ఆదరాభిమానాలను చూరగొంటున్న కూలిసోదరుడు మనకు గోచరిస్తారు.

తిథి, వార, నక్షత్ర, యోగ, కరణాలతో కూడినది పంచాంగము. అట్టిపంచాంగములో వ్రాసిన వర్షములు, కార్తెలు, ధనధాన్య సమృద్ధి మొదలైన విషయములను, రైతు తెలిసికొని తన నూతన సంవత్సర కార్యక్రమమునకు పునాదివేసికొనుటలో అతనికి సంప్రదాయాలపైగల గౌరవం వెల్లడి అవుతున్నది.

సంవత్సరాదిని పంచాంగం విన్నవారికి యజ్ఞఫలం కలుగగలదని పురాణాల్లో చెప్పబడివుంది.

పూర్వం కొన్ని ప్రదేశాలలో దీపావళి పండుగవలె యీ సంవత్సరాదినాడు కూడా టపాకాయలు ప్రేల్చడం దీపాలు వెలిగించడంగూడా జరిగేదని తెలుస్తోంది.

సుమారు ఎనిమిది తొమ్మిదివందల సంవత్సరముల క్రితం భిన్నాభిన్నమైపోయిన తెలుగుజాతి యీనాడు తిరిగి యేకజాతిగా సుసంఘటితమై గత సంవత్సర కార్యక్రమాన్ని తలచుకుని యీ నూతన సంవత్సర ప్రణాళికను సిద్ధపరచుకొని తెలుగుగడ్డ నిర్వీర్యంకాలేదని ఋజువు చేసుకోడానికి ప్రయత్నిస్తుందని ఆశిద్దాం. ★

# అత్తా అపచారం





ఆరోజే తిరుపతివెళ్లి వెంకన్నను చూసి రావాలని పట్టుబట్టారు మా అత్తగారు.

పని తీరికలేని మావారు "వై వచ్చేవారం వెళ్దాంలేమ్మా"—అన్నారు ఆఫీసుకు బయలు దేర్తూ.

"అపచారంరా అపచారం—" అంటూ రెండు చెంపలూ వాచిపోయేట్టు బాదుకున్నారు మా అత్తగారు తన సొంత చేతుల్తో.

నాకు నవ్వొచ్చింది—కాని మరుక్షణం అపచారం అంటూ నాచేతివేళ్లు కూడా రెండు చెంపలూ మృదువుగాతాకాయి.

"మరేవిటంటావురా!" అన్నారు మడిలో వున్న మా అత్తగారు మర్చిపోయి వాకిలికేసినకర్టెన్ ముట్టుకొని నేను చూసేలోగానే దూరంగా జరుగుతూ.

"పోనీ ఒకపని చెయ్యమ్మా. నీవూ నీకోడలూ వెళ్ళిరండి. ఇంకోసారి అందరం కలిసి వెళ్లొచ్చు" అన్నారు మావారు.

"హాయ్యొ నె త్తిరాతా నీవులేకుండా ఎట్టాగా వెళ్లడం! అపచారంరా అట్టా అనకూడదూ" అంటూ దీర్ఘం తీశారు మా అత్తగారు.

"మరేం చేయమంటావమ్మా! అర్జంట్ పనులన్నీ యీవాళే వున్నాయి, ఇంకో వారం రోజులదాకా నే నెక్కడికీ కదలడానికి వీల్లేదు—అయినా నువ్వు యీవాళే తిరుపతి ప్రయాణం అవుతావని నేనేం కలగన్నానా!"

"అవ్వ్రాయ్ కలంటే జ్ఞాపకం వచ్చింది రాత్రి వెంకన్న నాకల్లో కనిపించాడ్రా. ఎట్టా వచ్చాడనుకున్నావ్! మన పక్కింటి పురుషోత్తమాచార్లు లేడూ, ముసలాయన, ఆయనలాగా వచ్చాడ్రా. ఒంటినిండా నామాలతో, వెండి పొన్ను వేసిన కర్ర ఒకటి చేత బట్టుకుని వాకిట్లో కొస్తూనే" అమ్మణ్ణీ! అంటూ ఒక్క కేకేశాడ్రా. ఓయమ్మ, యిదేమిటి ముసలాయన కింత కోపం వచ్చిందనుకుంటూ, వంటింట్లో వంట చేస్తున్నదాన్నల్లా చేతులోవున్న తప్పేలా ఆపళంగా అక్కడే పడేసి, హాల్లోకి పరుగెత్తుకొచ్చాను. ఆ అన్నట్లు, ఆహాలు మళ్ళీ మన యీ హాల్లాగా లేదు, ఆ వంటిల్లూ మన యీ వంటిల్లుగాదు. మా తాతగారి యింట్లో వుండే వంటింటిలాంటిదనీ, మా పెత్తండ్రి వాళ్ళింటి హాల్లాంటిదీని కనిపించాయిరా."

"ఏదోకటిలేమ్మా—త్వరగా చెప్పూ—పోవాలి—" అన్నారు అప్పుడే టిఫిన్ తిని ఆయాసపడుతున్న మావారు.

"అపచారంరా, అట్టాఅనకు ఆ నామాల ముసలాయని ఎవరోకాదురా; వెంకన్నే సాక్షాత్తూ ఆ వడ్డికాసులవాడే అట్టా వచ్చాడ్రా! ఇంతకూ ఏమైందనుకున్నావ్! నన్ను చూస్తూనే, ఆ ముసలాయన మండిపడుతూ 'ఏం అమ్మణ్ణీ! నీకండ్లు నెత్తి కెక్కినట్లున్నయ్యే! నన్ను చూట్టానికి రావడం కొత్తుగా మానేశావే! నేనొకణ్ణి వున్నా

భాగవతుల రామకృష్ణ

పిల్లవాడికి ఎప్పుడూ సరిపడదు. "పిన్ని స్యాన్ యింద బ్యాగ్ ఎంగ వెక్కణుం! తలెమేలెయో!" అంటూ డ్రైవర్ మీద మండిపడ్డాడు మళయాళం.

"ఉస్సీ—అరవక—అమ్మగారొస్తున్నారు" అంటూ కారుదగ్గరికెళ్ళిన నన్ను చూపించాడు డ్రైవర్. మళయాళం నోరు మూశాడు—

మా అత్తగారు, వెనకవైపున్న వంటిల్లూ, వడ్లకొట్లూ, స్టోరుగదీ, పూజామందిరంవున్న గదీ అన్నీ సెంబర్లవారీగా తాళాలేసుకుని, సహారా ఎడారి భూదానం యిచ్చినట్లు, వంటింటి ముందున్న వసారానుమాత్రం వంటవాడికి వదిలేసి, తోటవాడికి యింటిభద్రం అంతా చెప్పి, వర్షం వచ్చేట్లయితే గొడ్లను కొట్టంలో కట్టేయమని చెబుతూవచ్చి కార్లో కూర్చున్నారు, ముకుపులు పెట్టిన తాటాకు బుట్టతో సహా. ఈలోపుగా మేడమీద గదులన్నిటికీ తాళాలేసుకొని వెళ్ళి కార్లో కూర్చున్నాను.

"మరి తాళాలుఅబ్బాయికిచ్చివెళ్ళొద్దూ" అన్నారు మా అత్తగారు.

"వెళ్ళే దోవలోనేగా ఆఫీసు! ఇచ్చి వెడదాం" అన్నాను. కారు బయలుదేరింది.

కొంతదూరం వెళ్ళినతర్వాత మా అత్తగారు కూర్చున్నవైపు కారుటైరు 'ఢాం' అంటూ బ్రహ్మాండమైన మోతతో పంచరయింది, "ఓయమ్మ ఏమిటే ఆ మోత," అంటూ హడలిపోయి నన్ను గట్టిగాపట్టుకున్నారు మా అత్తగారు—నవ్వనా! నవ్వకుండా వుండనా!—"అబ్బే ఏం లేదత్తా—టైరు పంచరైం" దన్నాను—నవ్వాపుకుంటూ—"మరెట్లాగూ యిప్పుడు! అబ్బాయికూడా రాలేదే!" అన్నారు మా అత్తగారు ఖంగారుపడుతూ.

"వేరే టైరుంటుంది కార్లో—మార్చుకుంటాడు మనం కాసేపు కారుదిగాలి," అన్నాను—

"అట్లాగా!" అంటూ కారుదిగారు మా అత్తగారు నాతోబాటూ.

"అయినా ముందున్న పాతబస్సే నయం, యీకొత్తకారుకంటే ఎన్నడయినా ఆబస్సు యిట్లా 'ఢాం'అంటూ పేలిందా"—

మా అత్తగారు చెప్పేబస్సు మా పాత ఫోర్డువేన్. అది ఆమె అభిమానాన్ని చూరగొన్న బస్సు.

డ్రైవర్ టైరు మార్చుకున్నాడు. తిరిగి కార్లో కూర్చున్నాం.

అసలే మధ్యాహ్నం ప్రయాణం—అలవాట్లేక తలనొప్పి పట్టుకుంది. దానికితోడు మా అత్తగారు నేనెరగని తన పుట్టింటి వాళ్ళను గురించీ, వాళ్ళకు సంబంధించిన బంధువులు తిరుపతిలో ఎంతమందివున్నారో వాళ్ళను గురించీ, వాళ్ళలో తనతో మాటలేని వాళ్ళెంతమందో, తనంటే పడిచచ్చే వాళ్ళెంతమందో, వాళ్ళందర్నీ గురించీ చెప్పినా తలనొప్పి మరికాస్త ఎక్కువ చేసింది. నిజంగానే తిరుపతిలో మా అత్తగారి బంధువు లెక్కువగానే వున్నారు. ఎవళ్ళింటికెళ్ళి, ఎవళ్ళింటి కెళ్ళకపోయినా చిక్కే. అంగుకే మావారొస్తే టైమ్ లేదనే సాకుతో నేరుగా కొండకెళ్ళి స్వామి దర్శనం చేసుకొని తిరిగి వచ్చేస్తుంటారు. కొడుకు వెంటవచ్చినప్పుడు మా అత్తగారు కూడా నోరెత్తరు. కాని నేను యీసారి ఆమెచేతుల్లో చిక్కాను. ఆమె ఎక్కడికి తీసుకెడితే అక్కడికి వెళ్ళాలి చచ్చినట్లు. మావారు వాళ్ళ పెదనాన్న యింటికెళ్ళి, వాళ్ళన్నయ్యను పిల్చుకొని కొండకు వెళ్ళమని చెప్పారు. నిజంగానే మా బావగార్నీ, తోడికోడళ్నీ చూసి చాలాకాలమయింది. మనవడుపుట్టాక వెళ్ళనేలేదు. నామకరణానికి రాలేదని ఎంతో నిష్ఠూరంగా జాబు వ్రాసింది మా తోడికోడలు. మావారు వాళ్ళ పెదనాన్న యింటికెళ్ళ మన్నప్పుడు, మా అత్తగారు సరే అన్నారేగాని తీరా తిరుపతి దగ్గరకొచ్చేసరికి, "ఏమే మరి మా సరోజ యింటికెళ్ళి యీ రాత్రి వుండి, తెల్లారుగట్ల బయలుదేరి కొండకెళదాం! దాన్ని చూసి చాలారోజులైంది— 'ఏం" అన్నారు. సరోజ మా అత్తగారి పెద్దక్క మనవరాలు—ఒద్దని నేనెట్లా చెప్పేది!

"మరి మీ అబ్బాయి బావగారింటికి వెళ్ళమన్నారు," అని గొణిగాను మెల్లిగా.

"ఆ, వాడంటానికేం లెస్తూ—నీకు తెలీందేముంది చెప్పూ... పైగా ఆమధ్య నీ తోడికోడలికి పెద్ద జబ్బు చేసిందనీ, మంచంలోంచి లేవడం లేదనీ జాబు రాశాడుగా నరం...! మరి యిప్పుడెట్లావుందో!... ఇంత రాత్రప్పుడు మనం వెళ్ళి జబ్బుమనిషిని దాన్ని అవస్థపెట్టడం ఎందుకూ!... దానికోడలు యిక్కడే వుందో లేక పుట్టింటికెళ్ళిందో. అంతగా అయితే కొండదిగి వచ్చేప్పుడు చూసి వెళ్దాంలే... ఏమంటావ్!" అన్నారు మా అత్తగారు. ఏమంటాను! "సరే మీ యిష్టం" అన్నాను.

కారు సరోజ యింటిముందాగింది. సంతోషంగా కారు దిగబోతున్న అత్తగారు ఆగిపోయారు, బ్రేక్ వేసినట్లు. సరోజ యింటివాకిలికి తాళం వేసుంది. కారు ఆగడం చూసి బయటికొచ్చిన పక్కింటివాళ్ళు చెప్పారు, సరోజ మొగుడికి ట్రాన్స్ఫర్ అయిందనీ, నెలరోజుల క్రితమే తాడిపత్రివెళ్ళిపోయారనీ.



# ★ అత్తా తోడికోడలీయం ★

నన్నమాటే మర్చిపోయావే! ఇంత పొగరా నీకు అంటూ చేతులోవున్న కర్రతో నా నెత్తిమీద బాదడం మొదలెట్టాడ్రా.

తలంతా బొప్పెలు కట్టిందంటే నమ్మ. కల్లోనే అనుకుంటానట; చూశావా, నేను తిరుపతి రాలేదన్న కోపంతో వెంకన్నే యీవిధంగా వచ్చి దండిస్తున్నాడు అని."

అని మా అత్తగారంటుంటే మావారు పక్కున నవ్వి "భలేదేవుడే మొత్తానికి. తన్ను చూట్టానికి రాకపోతే తన్ని రప్పించుకుంటున్నాడు" అన్నారు.

"అపచారంరా! వెంకన్నతో వేళాకోళాలేమిట్రా! వెంకన్నంటే ఏమనుకున్నావ్, తప్పంటే చెప్పు తీసుకుని కూడా తంతాడ్రా. వెనకటికి మా అత్తగార్ని వెండిచెప్పుతో కొట్టాట్ట కల్లో కనబడి. మంచి వేళ, మడిలో వున్నాను గనక, చేతికర్రతోనే నా నెత్తి చితగ్గొట్టాడా వడ్డికాసుల వాడు. మరి కొట్టాడంటే కొట్టకుట్రా! మనం తిరుపతివెళ్ళి దగ్గిర దగ్గిర ఏడాది కావచ్చిందా కట్టిన ముడుపులన్నీ అట్లాగే పేరుకుపోయాయి. మరి ఆయనకు మాత్రం కోపం వచ్చిందంటే రాకేంజేస్తుంది. చూశాడు చూశాడు; తనే పక్క బయల్దేరొచ్చాడు నాకు బుద్ధి చెప్పడానికి. అందుకే యీరోజు ఏమైనా సరే వెళ్ళి తీరాలనుకున్నాను. తీరా వెళ్దామనుకుని వెళ్ళకపోతే స్వామికి మళ్ళీ ఏం కోపం వస్తుందోనని భయంగా వుందిరా."

"సరే నీవు తప్పనిసరిగా యీరోజే వెళ్ళాలంటే, మీ అత్తాకోడళిద్దరూ వెళ్ళి రావల్సిందే. నేను ఆఫీసులో దిగి కారు పంపుతాను. మధ్యాన్నం భోజనాలయ్యాక బయల్దేరి వెళ్ళండి; పని పిల్లవాణ్ణి కూడా తీసుకుని" అంటూ వెళ్ళి కార్లో కూర్చున్నారు మావారు.

"అయితే యింతకూ నువ్వు రావన్నమాటేగా."

"అహా, మీ వెంకన్నకు కోపం వచ్చినా సరే."

"అపచారంరా ఏం మాటల్రా అవీ."

"మరి నన్నేం చేయమంటావమ్మా! ముఖ్యంగా యీ వేళా రేపూ నేను కదలడానికి వీల్లేనన్ని పనులున్నాయి. అబద్ధం గాదు."

"సరే ఏంజేస్తాం! వెంకన్నకే నిన్ను కొండకు రప్పించుకోవాలని వుంటే ఆ పన్లన్నీ మధ్యాన్నం లోపుగానే పూర్తి కాకూడదూ!"

"అవునవును. అన్నట్లు వెంకటేశ్వర స్వామి బిజినెస్ దేవుడేగా! నా పన్లన్నీ మధ్యాన్నంలోగా పూర్తిచేస్తాడేమో చూడాలి."

"తప్పక పూర్తిచేస్తాడ్రా వెంకన్న రాత్రి నాకల్లో వచ్చినట్లు తనే వచ్చి "

"తల చితగ్గొడతాడు బాబోయ్. వద్దు ఆయన అంతపని చేయకుండానే, నేను కొండకొస్తానని చెప్పు. కాని యీరోజు కాదు.. "

"అబ్బ ఆమాటే అనకురా అపచారం."

"సరే అనన్లే. అనుకుంటూను—"అంటూ లెంపలేసుకున్నారు మావారు.

"సరే నీయిష్టం. అంతా వాడిదయ. నువ్వు రానందుకు అపరాధకానుక హుండీలో వేస్తాను——"

"ఆ. ఆపనేదో చెయ్యమ్మా. అలాంటి సదుపాయాలన్నీ నాలాంటి వాళ్ళకోసం ఆదేవుడు ముందే ఏర్పాటుచేశాడుగా!" అంటూ కారు స్టార్టుచేసి ఆఫీసుకెళ్ళిపోయారు మావారు.—

తిరుపతి ప్రయాణానికి అన్ని ఏర్పాట్లూ చేసి, పెందరాడే భోజనం ముగించింది మా అత్తగారు. మావారుకూడా రాలేదన్న నిరుత్సాహంతో నేను నాలుగు మెతుకులు తిని, విధిలేక మా అత్తగారివెంట బయల్దేరాను. మావారు కారు పంపించారు పెట్రోలు గట్రా వేయించి. తిరుపతి వెళ్ళుతున్నామని తెలియంగానే, డ్రైవరుకూడా తనపెళ్ళాం పిల్లల జబ్బుల బాపతు, ఎన్నాళ్ళనుండో 'స్టాక్'లోవున్న ముడుపులూ, పిల్లల తలమీద శాస్త్రానికి వేసిన కత్తెరబాపతు తలవెంట్రుకలూ, అన్నీ కలిపి ఒక చిన్నకిరసనాయిల్ డబ్బాలోపెట్టి తెచ్చుకుని ముందు సీట్లో తనపక్కనే పెట్టుకున్నాడా డబ్బా—

ఆ ముడుపుల డబ్బా మీద ఏలాంటి సామాను పెట్టనివ్వకుండా కాపాడుకోడానికి అవస్థపడిపోయాడు డ్రైవర్. ముందు సీట్లో ఆ డబ్బాపక్కనే మా మళయాళం పనిపిల్లవాడుకూడా వచ్చి కూర్చున్నాడు. అంతటితో ఆగక వాడు బట్టలుపెట్టి తెచ్చుకున్న తోలుసంచీ ఆ ముడుపుల డబ్బా మీద పెట్టాడు. డ్రైవర్ ప్రాణం విలవిలకొట్టుకుంది. తక్షణం ఆ తోలుసంచితీసి సీటుకింద పడేస్తూ, "అది స్వామిముడుపుల డబ్బా. ఇది తోలుసంచి—అపచారం—"అంటూ సగం అభినయంతోనూ,

సగం వచ్చీరాని అరవమాటల్తోనూ మెల్లిగాచెప్పాడు డ్రైవర్.

అసలు మా డ్రైవర్ కూ, మళయాళంపని



# ★ అత్తా తోడికోడలియం ★

మా అత్తగారి ముఖం వెలవెలబోయింది. నా ముఖం చూడలేక పోయింది. "పోనీ శకుంతల వుందేమో చూసి పోదాములే! దగ్గిరేగా!..." అన్నారు మా అత్తగారు.

"అలాగే" అన్నాను. శకుంతల మా తోడికోడలికి తోడికోడలున్నూ, మా అత్తగారి పుట్టింటి ఆడబడుచున్నూ. మా తోడికోడలంటే సరిపడక పోయినా శకుంతలంటే ప్రాణాలిస్తుంది మా అత్తగారు.

కారు శకుంతల యింటిముందు ఆగింది—మళ్ళీ మా అత్తగారు కారు దిగబోతూ ఆగిపోయారు—శకుంతల యింటివాకిలిక్కూడా తాళం వేసుంది. మళ్ళీ ఆ పక్కింటివాళ్ళే చెప్పారు—పురిటికి పుట్టింటి కెళ్ళిందనీ, ఆవిడభర్త వాళ్ళ అన్నగారింట్లోనే వుంటున్నాడనీ. మా అత్తగారి ముఖాన కత్తివేటుకు నెత్తురుచుక్క లేదు.

"ఏడ్చినట్టేవుంది"... అని కాసేపు విసుక్కున్నారు మా అత్తగారు.

"ఊఁ సరే... ఏంజేస్తాం!... మీ తోడికోడలింటికే పోదాంపద" అన్నారు మా అత్తగారు నీరసంగా. నా ప్రాణం లేచొచ్చింది.

మా తోడికోడలింటి ముందు కారాగింది. యీసారి మా అత్తగారు బిగుసుకుపోయి కూర్చున్నారు. నేనే ముందు కారుదిగాను. నన్ను చూస్తూనే మా బావగారు ఎక్కడలేని సంతోషంతో యింట్లోంచి పరుగెత్తుకొచ్చారు కారు దగ్గిరికి.

"రామ్మా—ఎన్నాళ్ళకు కనిపించావు-కార్లో ఎవరు?'కక్కే!' ఏం కక్కా కార్లోనే కూర్చున్నావ్! లోపలికి రా.ముది మనవణ్ణి చూద్దువుగాని—ఏమిటో మీ రంతా మమ్మల్ని బొత్తుగా మర్చిపోయారు... అన్నట్టు తమ్ముడు రాలేదేం!"

"అర్జంటుపనులున్నాయని ఆగిపోయారు"

"అట్లాగా! ఆ. వాడికెప్పుడూ అర్జంట్ పన్లే. యిదుగో—డ్రైవర్! కారు తీసుకెళ్ళి, వీథిచివరున్న వియ్యన్నగారింటి షెడ్లో పెట్టు. అబ్బాయ్! ఆ సామానన్నీ లోపలికి తీసుకెళ్ళు నాయనా!" అని మళ్ళీ యాళంతో చెప్పి "రాండి కక్కా!" అంటూ మమ్మల్ని లోపలికి పిల్చుకెళ్ళారు మా బావగారు.

"ఏమేవ్ మా కక్కా, మీ చెల్లెలూ వచ్చారేవ్... త్వరగా రా..." అంటూ వంటింట్లోవున్న మా తోడికోడల్ని కేకేశారు మా బావగారు.

"ఎట్లాగూ! వాళ్ళకు మన యిల్లు కనిపించిందా అసలూ! మనమీది కోపంతో అసలు తిరపతి రావడమే మానేస్తారేమో అనుకున్నా. పోన్లెండి. దేవుణ్ని చూట్టానికైనా వచ్చారుగద ఇదుగో వస్తున్నా" అంటూ వంటింట్లోంచే చదివేసింది మా తోడికోడలు.

మా బావగారి యింటి వాకిళ్ళన్నీ ఎత్తూ వెడల్పూ లేని చిన్నవాకిళ్ళు. మా అత్తగారు జాగ్రత్తగా తలవంచి, శరీరాన్ని అడ్డంగా తిప్పి లోపలికి రావడం చూసిన మా తోడికోడలు గుళ్ళు తేలేసి "ఎవరూ! అత్తమ్మా!" అన్నది ఆశ్చర్యంగా దవడలు నొక్కుకుంటూ.

"ఆ—ఏం! అంత గుర్తుపట్టలేకుండా ఏమైనానూ!" అని కోపంతో దీర్ఘం తీశారు మా అత్తగారు, దిష్టి తగుల్తుందని పమిటకొంగు ఒంటినిండా కప్పుకుంటూ.

"అబ్బే మీరేం కాలేదత్తా... మీ శరీరమే ఏదో..."

"ఆ—నీముఖంలే. త్వరగా వెళ్ళి మరదలి భోజనం సంగతి చూడు..." అంటూ మా బావగారు గుర్రుమని చూశారు మా తోడికోడల్ని.

"ఎందుకట్లా నన్ను గుర్రుమని చూస్తారు? తప్పేవన్నాను! ఒక్కప్పుడు నేను యీ వాకిళ్ళన్నీ పట్టనని మీ కక్క అందరికీ చెప్పి నవ్వలా!.."

"నేనేమీ నవ్వ లేదమ్మాయ్..." అంటూ మా అత్తగారు నట్టింటి గుంజకానుకుని "క్రిష్ణా" అంటూ కూర్చున్నారు. మా అత్తగారు చూడకుండా మా బావగారు మా తోడికోడల్ని చూసి పండ్లుకొరుకుతూ, "అబ్బ... నీనోరు కుట్టి కుదుళ్ళల్లో పెట్టినా వూరుకోదుగదా! ముందు వెళ్ళి మరదలి భోజనం సంగతి చూడమంటే... అట్లాగే నాకోసం అట్టేపెట్టిన ఆవుపాలున్నాయేమో కక్కకివ్వు యీపూట నాకక్కర్లా..."

"ఎందుకురా! నాకోడలు నాకోసం ప్లాస్కులో తెచ్చింది మా యింటి ఆవుపాలు చాలు. అవున్నాయిగా!"

"ఆమె ఎప్పుడొచ్చినా, మనింట్లో పచ్చి మంచినీళ్ళుకూడా ముట్టకూడదనే ఏర్పాటుతోనే వస్తుందిలెండి... రా వమ్మా, చెల్లెలా! భోంచేద్దాం..." అంటూ నా చేయి పట్టుకుని వంటింటివేపు పిల్చుకెళ్ళింది



# పండుగ ముగ్గులు

కల్యాణప్రసాదశర్మ (విజయనగరం)

మా తోడికోడలు.

"ఊ—యిన్నేళ్లొచ్చినా నీ పెళ్లాం దాని బుద్ధి పోనిచ్చిందికాదురా నరం," అన్నారు మా అత్తగారు తన బుద్ధి పోనివ్వకుండా.

మా బావగారు మాట సర్దుతూ, "ఆ దానిమాటలకేంలే కక్కీ! నీకు తెలీందేముందీ! ఒట్టిపిచ్చిది నోరుందని వాగడమేతప్ప దానికి మనసులో ఏమీ వుండదు. ఒట్టిబోళా" అన్నారు - ఎప్పుడూ పెళ్లాన్ని వెనకేసుకొస్తుంటాడని మాబావగారంటే గూడా మా అత్తగారికి కొంత కోపం లేకపోలేదు మనసులో.

"ఏమో నాయనా—మా తోడికోడలు పోయినప్పుడే యీ యింటికీ నాకూ ఋణం తీరింది. తోడికోడలయినా సొంత అక్కకంటే ఎక్కువగా చూసేది. అన్నట్లు నీకొడుకేడీ!"— అంటూ మాటమార్చారు మా అత్తగారు—

"వాడికి వరంగల్‌లో వుద్యోగమైంది కక్కీ! వాడు వెళ్లి అప్పుడే రెండు నెలలయింది. యిల్లు దొరగ్గానే కోడల్నీ, మనవణ్ణీ తీసుకెళ్ళి అబ్బాయిదగ్గిర దిగవిడిచి రావాలి—"

"అట్లాగా! అన్నట్లు నీ మనవడేడ్రా! నిద్రపోయాడా!

"అవును కక్కీ—వాడికి వారంరోజుల నుండీ దగ్గూ జలుబూ పట్టుకుని వదలడంలా—పాపం చాలా ఢీలా అయినాడు బిడ్డ—చూస్తావా!"

"ఇప్పుడెందుకురా బిడ్డని నిద్రలేపడం! కాసేపుండి చూడొచ్చులే. ఇంతకూ వాడికి అబ్బపోలికొచ్చిందా, అమ్మపోలికొచ్చిందా," అంటూ చిన్న ప్రశ్న వేశారు మా అత్తగారు.

మా బావగారు నవ్వి "అందరూ తాత పోలికే వచ్చిందంటున్నారు కక్కీ!" అన్నారు.

"అ—అట్లాగే కాకపోతుండి మీ కక్కని. అవ్వపోలి కొచ్చిందంటే కేవు వాడికి ఒపూట అన్నంకూడా పెట్టదావిడ." అని అంగుకుంది మా తోడికోడలు భోంచేసి ఆకుమడుస్తూ—

మా బావగారు భయపడిపోయారు. మాటమారుస్తూ— "కక్కీ పాలఫ్లాస్కు కార్లోవుందా, లోపలికి తెచ్చాడా,"అంటూ వెళ్ళి సామాన్లదగ్గిరున్న ఫ్లాస్కూ, పండ్లూ, గ్లాసూ తెచ్చి మా అత్తగారి ముందు దర్జాగా వుంచారు మా బావగారు.

"ఆ, యిప్పుడే ఎందుకురా. కాసేపుండి తీసుకుంటాలే." అన్నారు మా అత్తగారు.

"తీసుకో కక్కీ! ఒంటిపూట భోజనం. పాలు కూడా వేళకు తీసుకోకపోతే, పెద్దతనంలో నీరసంగా వుంటుదూ,"—అంటూ మా బావగారు కాసేపు బ్రతిమాలిన తర్వాత,

(44-వ పేజీ చూడండి)





కందుకూరి లింగరాజు

# సమర్థవాది

(గత సంచిక తరువాయి)

## 15

ప్రపంచయుద్ధం ముగిసింది. ఆ సంతోషములో ప్రభుత్వం, భారతీయుల్లో తమ తొత్తులుగా వుండిన 'వీరాధివీరుల' నందరినీ కూడా, బిరుదాలు, పతకాలు గౌరవాల్తో బహుకరించేరు. సైన్యానికి ఆట విడుపు అన్నట్టే అయ్యింది. ప్రత్యేకంగా డోగ్రా రెజిమెంటు, ఘూర్కా రైఫిల్స్ దళాలవారిని గూర్చి పుట్టెడు యుద్ధకథలు వ్యాపించాయి. అనునయంగా ప్రభుత్వమూ చాటేసింది. "జర్మనులు మన ఘూర్కా కుగ్రీలను చూస్తేనే చాలు మూడు ఆమడ పరిగెత్తేవా"ళ్ళని, ప్రభుత్వ వైఖరివుంటే, "ప్రజాయుద్ధంలో గెలుపు మనదే" అంటూ మద్దతు నాయకులు, ఊరూర సభలు, నాటకాలు, హరికథలు, అభిషేకాలు, బుర్రకథలు, తోలుబొమ్మలతో ఆర్భాటాలు చూపించేసేరు. తోరణాలు పాలవెల్లులే చేసేరు.

ఆ బహుమతులు పుచ్చుకున్నవాళ్ళలో కూన్నారాయణ ఒకడు. మొదట్లో ఓ చిన్న గుమాస్తాగా ఉన్నవాడు ఇప్పుడు తహసీల్దారే అయిపోయేడు. ఓ తాలూకాకి అధిపతి అనీ అనిపించుకున్నాడు. అయినా లోపల్లోపల మాత్రం భయంగానే వుంది. ఈ ఎక్కిన మెట్లన్నీ కూడా తన భుజబలం మీద, తెలివితేటవల్ల సంపాదించినవి కాక పోవడంవల్ల. అవన్నీ కూడా ఒక్కొక్కళ్ళ సమాధ త్రవ్వి సంపాదించినవే. కాలంజరిగే సరికి ఈ పనులు అన్నీకూడా నిత్యకృత్యాలై పోతాయి అనుకున్నా ఈ జస్టిస్ ప్రభుత్వం ఉన్నంత కాలమే తన పచ్చదనం. తర్వాత అంతా చీకటే అనీ తట్టేది. "నాలాంటివాళ్లు ప్రభుత్వంక్రింద లక్షా తొంభైమంది ఉన్నారు. నేను ఒక్కణ్ణే మనస్సు పాడుచేసుకోవడం ఎందుకు," అన్న వెర్రి ధైర్యం తెచ్చుకున్నాడు. ఏమైనా అవధానిని తలచుకోందే అన్నం ముట్టకు నేవాడు కాడు.

చలపతి, సీతమ్మకూడా ఆ కాలంలో ప్రముఖపాత్రలే వహించేరు. పేరు, ప్రతిష్ఠా తెచ్చుకున్నారు. వీలైనంతవరకూ బలగాలు చేకూర్చుకుని, ఆంధ్రలో ఓ నాయక దంపతులు అనిపించుకున్నారు.

ప్రజల్లో ఎంతవరకూ చైతన్యం అభ్యుదయం, సాంఘిక సాంస్కృతిక ఉన్నతి తెచ్చేమూ అని ప్రశ్న వేసుకుంటే, నిశ్చయంగా ఇది అని లెఖ్ఖపెట్టి చెప్పడానికి కనుపించటంలేదు. కనుపించినా పై పేటి ల్లోనూ ఖరాఖండీగా జమవేసి లెక్కపెట్టడానికి కన్పించవు. యుద్ధం సాగినంత కాలం, ఏదిచేసినా పదిమందిలో మాటగా సాగిపోయింది. చెలామణీ అయ్యింది. ఇప్పుడు ప్రజాయుద్ధం అని భావించినా, ఇండియాకు అది ఎల్లా అన్వయిస్తుంది, నెగ్గేం కదా అని బావుకున్నది ఏమిటే అంటే సమాధానం చెప్పలేకపోయేవాడు చలపతి.

"అభ్యుదయమార్గంలోకి ప్రజల్ని నడిపిస్తున్నాం గదా" అంది సీతమ్మ.

"ఏమిటి అభ్యుదయం! చచ్చిన యుగపురుషుల్లోంచి ఎలుగెత్తి పునః అభ్యుదయగామి అవడం అభ్యుదయమా? ఆర్థిక స్తోమత లేక, కడుపు చేత్తో పట్టుకునే కూలి కర్షకబృందం జీవనాలు అభ్యుదయాలా? ఊరూరా, వేదికలెక్కి, ఘంటలతరబడి మాట్లాడీ, నాల్గు పువ్వులదండలు వేసుకుని వెయ్యిమంది కరతాళ ధ్వనుల్లో పొంగిపోయే మన సత్వం అభ్యుదయమా?" అన్నాడతడు చికాకులో.

సీతమ్మకు కోపం వచ్చింది. దిగమ్రింగుకుంటూనే "మరేమిటో! ఇన్నాళ్ళూ అవి చెయ్యి, ఇవి చెయ్య అని ఆదేశించిన నాయకులకు ఇప్పుడు మతి భ్రమించింది కాబోలు," అంటించింది.

నవ్వేడు చలపతి. "పరిస్థితులు, కాలం బట్టి నడిచేం. అలా నడవవలసినదే తప్ప వేరు గత్యంతరం లేనేలేదు. ఇప్పుడు పరిస్థితి మారింది. స్వాతంత్ర్యంకోసం విప్లవ జీవాల్లో పునాది వేసుకున్న మనం, ఆ విప్లవాన్ని ఎంతవరకూ సాధించేం! వాటన్నిటిని చంపుకునిశాంతికాములమంటూ ఇప్పుడు తయారై, మనకందరికీ కన్నెర్రగా వున్న ఆ కాంగ్రెస్‌ను దెబ్బ తియ్యాలనేగా ఇల్లా తయారవుత. ఆ విప్లవం చచ్చిపోయి నిర్వీర్యమైపోయిందా?

ప్రభుత్వానికి తెలియదంటావా! ఎప్పుడూ ఓ సవతిప్రేమతో చూస్తూనే వున్నారు. వాళ్ళ కాళ్ళక్రింద ఉన్నంత కాలం, వాళ్ళు ఏమి అనరు. ఇప్పుడు వాళ్లకు మన అవసరం కూడా తీరిపోయింది అది తెలియదేమో నీకు.

ఉల్లికారం కళ్లల్లో పెట్టినట్లయ్యింది సీతమ్మకు. అంతదూరంగా ఆలోచించే శక్తిసామర్థ్యాలు లేవు.

"అయితే, ఓ చరఖా పుచ్చుకోండి" అనీ అనేసింది.

ఈసారి సీతమ్మ కోపానికి, అమాయకత్వానికి బాగా నవ్వు వచ్చింది చలపతికి,

నవ్వనూ నవ్వేడు.

"గాంధీగారు వెర్రివాడు కాక బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఊపేసే తెలివితేటలు కల వాడు. ఆ కట్టుకున్న బట్టలు ఎక్కడినుంచి వస్తున్నాయి. బ్రిటిష్ కర్మాగారాలనుండి. వాట్లకోరకు ఎన్ని కోట్ల రూపాయిలు మన దేశంనుంచి పోతున్నాయో తెలుసా! బూర్జువా అంటావు! ఎవరు బూర్జువా? ఆ మిల్లు అధికార్లు. వాట్లను అరికట్టడానికే ముతక, చేనేత, వస్త్రాలను ధరించండి. మీ నూలు మీరే తీసుకోండి, అని చెప్పడానికే చరఖా."

సీతమ్మ అంతవరకూ వినలేదు ఈ విషయం. నషాళం అంటించింది.

"అల్లాగే ఉప్పు తయారీ. మనదేశంలో దొరికే దానిమీద పన్నేమిటి అన్నాడు. అన్నిట్లకన్న హరిజనోద్ధరణ పెద్ద గొడ్డలి పెట్టు ప్రభుత్వానికి.

ఎప్పుడైనా ఆలోచించేవా ఈ క్రైస్తవ పాదిరీలు, ఆస్పత్రులని పెడుతూ చేసేపని. ఎంతమందిని మతస్వీకారం చేయిస్తే అంత గొప్ప అనుకుని విజృంభించేరు. అందులో ప్రత్యేకంగా మాల మాదిగల్లో కడుపుకోసం మతం మార్చుకోవటం ఎక్కువైంది. దీన్ని అరికట్టడానికే హరిజనోద్ధరణ అంటూనే వాళ్ళకూ దేవాలయప్రవేశాలు చేయించాలి అని నిర్దేశించాడు.

అల్లాంటప్పుడు నిజంగా విప్లవవాది అతనా, నువ్వా నేనూనా?" ఖచ్చితంగా ప్రశ్నే వేసినట్లు అడిగేడు.

కుంచించుకుపోయిందిసీతమ్మ. ఓ పెద్ద కట్టుకున్న సౌధాలన్నీ కూడా ఎంత వొట్టి పునాదులమీద అనుకున్నా, అందులోని వ్యామోహము, తన్ను గజిబిజి చేసింది. దుఃఖమూ వచ్చింది.

"అయితే మీరు..." ఇంక చెప్పలేక పోయింది.

"లేదు. చేరను. కాని ఒక్కటే బాధ పెడుతోంది. విప్లవం అన్నది ఎల్లా తీసుకు రావాలా అని" గొణిగేడు.

తెల్లబోయింది. ఓవిధంగా అనునయమూ కల్గింది. యాథాలాపంగానే "రమణమ్మ గారు ఎక్కడ వుందో!" అంది.

ఒక్కసారిగా మర్చిపోయిన విషయాలన్నీ చలపతికి జ్ఞాపకం వచ్చేయి. అన్నగార్లు, ఒదినెలు, తండ్రి, తల్లి, అన్నిటకన్న శచి. వాళ్ళను గురించి ఆలోచించనే లేదు. తను, తన స్వార్థంలో పడిపోయేడు ఇన్నాళ్ళూ. పొరలు కమ్మినట్లు. తానేదో మహా సంస్కరణ చేసేను అని అనుకున్నా, ఈనాటి సీతమ్మ ఆ ఇంటి కోడలుగా వెళ్ళ లేదు. ఆమెతో తనూ కడసారివాడన్న హుందాలో గడప దాటలేదు. ఆ అగ్నిహోత్రాల దరి చేరడానికి నిజం ఒప్పుకోవాలంటే తనకేతాహతూ లేదు.

# నీరాజనము

నేమాని సంగమేశ్వరరావు

శ్రీరంజిల్లగ తెల్గుల
కారోగ్యము, పాడి, పంట, నైశ్వర్యములన్
ధారాళముగా నొసగుము
నీరాజన మిదియె గొనుము నీకు వికారీ!

తీయని కంఠమెత్తి తమి తీరగ తెల్గుల వైభవంబులన్
కోయిల కూయుచున్నదదు గో తిలకింపుము గున్న మావిపై!
ఊయలలూగుచున్ ముఱియుచుండిరి బాలలు పూలతోటలో
హాయి! ఉగాది నేడు! దరహాసములందరి యాననమ్ములన్!

దీనికి తోడు మామయ్య, అత్తయ్య కూడా 'శాంతభావి చిద్రం చేసే'డన్న కోపంలో ఏమైనా చేసెయ్యవచ్చు అన్న భయమూ వుండిపోయింది.

కాకపోతే ఒక్క బుల్లి అన్నయ్య, అవధాని, రమణమ్మ ఒదినె, ఇప్పటి రాజకీయ వాతావరణంలో, తన వివాహం ఒప్పుకో వచ్చు. కాని ఆతిథ్యం ఇవ్వలేరు. రాజకీయంగా ఎదురుకోణాల్లో వున్నాయి ద్రుక్పథాలు. రమణమ్మ ఒదిన సీతమ్మని చేరదీయ వచ్చు. అదేనా ఆనాడు, ఏస్థితిలో అయితే ఇల్లు వదిలిందో ఆ స్థితిలో వుంటే; కాని ఇప్పుడు, ఈ మారిన మనిషిని ఒప్పుకుంటుందా. అదీ సంశయాత్మకమే.

మమత, ఆపేక్ష అన్నయ్యని చూడలని ముందుకు త్రోసింది. వాళ్ళను ఒదిలిపెట్టేరంటే మనస్సులో సంతోషపడ్డాడు... దానికి దోహదంగా అన్నయ్య వైరం పెట్టుకుని శచిని పైకి తీసుకురావడం, అదీ స్వశక్తి వల్ల పైకిరావడం చూస్తే, అన్నయ్యలోని విప్లవం నాకేమి వుంది అన్న ఆరాధనా కల్గింది. దాంతో గుండెలు ఉరుకులేసేయి.

వెనువెంటనే, ఒంటరిగా ఉన్న శ్రీపతి అన్నయ్య తలంపుకు రావడం, ఆ సూర్య రాజు ప్రోత్సాహం, రంగాచారి పట్టుదలల్లో తానూ చెయ్యికలిపి, మాల వీరడి నాయకత్వం క్రింద, నానాబాధలు పెట్టడం జ్ఞాపకంరాగా, క్రుంగిప్పోయేడు.

ఒక్కటే విచిత్రంగా తట్టింది. తను ఆ వూరు వెళ్లలేకపోతున్నాడు. ఆ వెళ్ళే ఘడియే రాకుండా వుంది. ఎందుకు కాలాడటం లేదో తెలియనే లేదు. అది ఓ అతీత శక్తిని దాటడంలా తట్టింది.

ఇవన్నీ క్రమ్ముకుంటుంటే దిగాలుపడుతున్న సమయంలో "సి. పి. గారూ! మీ కోసం ఎవరో వచ్చేరు" అన్నాడు ఒకరు.

తెల్లబోయినట్లయ్యింది. లేచేడు.

కళ్ళు తుడుచుకుంటూ మెట్లు దిగేడు. బహుశః ఏ గ్రామీణ అనుచరులో సమస్యలంటూ సమ్మెలకోరకు వచ్చారేమో అనుకునే దిగేడు.

"ఏం మరిదీ! ఖులాసాగా వున్నావా?" అంది రమణమ్మ.

ఉబ్బెత్తుగా గాలి నలువైపులనుండీ వచ్చి తాకినట్లు, ఊపిరి తిరగలేదు చలపతికి క్షణం సేపు. ఎదురుగా, అన్నయ్య, ఒదినా, వెంకట్రామయ్యగారున్నూ.

"అన్నయ్యా!" ఒక్కటే కేక వేసినట్లు వెళ్లి కాళ్ళు పట్టుకున్నాడు. అవధాని కరిగి పోయి, కౌగలించేసుకున్నాడు. రక్తస్పర్శలోని సంబంధం ఎన్ని రాజకీయ వైషమ్యాల జలధి అడ్డువున్నా, అధిగమించినట్లయ్యింది.

ఆ ఉమ్మరం తగ్గింతర్వాత "ఒదినా చూస్తూనే వున్నావుగా!" అనేసేడు.

"సీతమ్మ ఏదీ?" అంది రమణమ్మ.

అందుకున్నట్లే వెంకట్రామయ్యగారు "అల్లా విడుదలయి వచ్చేరు. ఆరోగ్యమైనా సరిగ్గా కోలుకోలేదు. ఆ వచ్చిన రోజునుండీ

(64-వ పేజీ చూడండి)

# బంగారం సింగారం

బొమ్మల కథ

అనగనగా బోలెడు డబ్బు
దానికి -
బోలెడు మేడలు -
వాటికి ఒక యజమాని
ఉండేవాడు - పేరు 'బంగారం'
ఈయనకు ఓ పెద్ద
హొటలు, చాలా దుకాణాలు
ఎంతో ఆశ!....
ఒక రోజు
'బంగార్ విలాస్" హొటల్లో....













నే చెప్తిని సామీ!
లేదు మావయ్యా- నేను పెసరట్లు కోసం రాలే- వీడు చూడు- రాగి డబ్బు లేని ఈ బైరాగి కేమో.....


ఛప్!- బంగారం హొటల్లో డబ్బు లేకుండా తింటే ఏం చేస్తానో తెలేదా తినే వాడికి ~


జై సద్గురు.....సాధువులు ఒకరి సొమ్ము ఆశించరు- సొమ్ము అన్నది ఏ ఒకరిదీ కాదు—


రేయ్! నువ్వు డబ్బిద్దామనే లగాయిస్తున్నావా పెసరట్లు?
శాంతి! అహింస!


నీకు చొక్కా లేదూ, జేబూ లేదు కదా— డబ్బెక్కడిదిరా? నిజం చెప్పు —


జై సద్గురు! నిజం ఒకటే నాయనా! ఈ పెసరట్లు - చొక్కా - జేబూ - డబ్బూ ఇవన్నీ మిథ్య!
ఇంకా ఉంది ~ వచ్చే వారందాకా బంగారం ఆశ్చర్య పడుతూ ఉంటాడు ~

# లౌక్యుడు

క్రూతురి పెళ్ళి చేశాడు కిష్టమూర్తి.

ఎవరైనాసరే ఆడపిల్ల పెళ్ళి చేస్తే, 'పోనీలే, ఏదో వోహటి, మొత్తానికి చేసేశాడు,' అని అందరూ అనుకునే 'ఈ' రోజుల్లో చాలామంది అలా అనుకోలేదు.

చాలా మంది చాలా ఆశ్చర్యపడ్డారు.

ఎందుకంటే కిష్టమూర్తి పిల్లని చేసుకున్న వాళ్ళకి ఆస్తి మరీ బొత్తిగా ఎక్కువగా వుంది. బోలెడంత భూమీ, పుట్రానూ.

అంచేత చాలామందికి ఆశ్చర్యం—కిష్టమూర్తిలాటి 'సంసారి' అలాటిసంబంధం ఎలా తేగలిగాడా అని.

నిజానికి కిష్టమూర్తి 'సంసారి' కాడు. పెళ్ళాం, పిల్లలూ వున్నవాడు తప్పక సంసారేనంటే ఏం చెప్పలేను.

అతనికో భార్య వుంది. అది అందరికీ తెలిసిన విషయమే.

ఆమె కాకుండా అతనికి వేరే ఓ 'మనిషి' వుంది. ఇది చాలా మందికి తెలీదు.

వీళ్ళిద్దరూ కాకుండా అతనింకా చాలా మందితో గుట్టుగా గడుపుకొస్తున్నాడు.

అతన్ని నిందించి ప్రయోజనం లేదు.

సంపెంగకి ఆ సువాసనెలా అబ్బిందో, గులాబీరేకులకి ఆ అందం ఎలా వచ్చిందో, కొంతమందికి మజ్జిగపులుసంటే ఎందుకంత ఇష్టమో ... అలాగే ప్రకృతిసిద్ధంగా అతనులాంటే.

—ఇది కిష్టమూర్తి అనుకున్న విషయం.

వచ్చిన చిక్కల్లా ఏంటంటే అతని భార్య అలా అనుకోలేకపోయింది.

అతగాని భార్య మనవాళ్ళ మాటల్లో కొంచెం 'సత్తెకాలం మనిషి.'

కిష్టమూర్తి నలుగురికీ తెలుస్తుందని అనుకోండి, మరెందుకైనా అనుకోండి, తనపనులు నిశ్శబ్దంగా రగడ లేకుండా జరుపుకొస్తున్నాడు.

కథాకాలంనాటికి అతనికి పదిహేడేళ్ళ పెళ్ళికాని పిల్ల సరోజ, ఇద్దరు మొగపిల్లలు–చిన్నవాళ్ళే లెండి, ఓ ముప్ఫైనాలుగేళ్ళ పెళ్ళాం నిక్కచ్చిగా వున్నారు.

ఓరోజు రాత్రి మూడింటికి నరసమ్మ—అంటే కిష్టమూర్తి నిజభార్య—పొరిగింటివాళ్ళ నూతిదగ్గర బాదంచెట్టు నీడలో, వెన్నెల వెలవెలబోతూన్నప్పుడు, కిష్టమూర్తి వొళ్ళో పొరుగింటి సావిత్రి చాలాసుఖంగా పడుకునుండటం చూసింది.

అంత సుఖంగానూ కిష్టమూర్తి ఆమెనానుకొని వున్నాడు.

రాత్రివేళ దొడ్లోకొచ్చిన నరసమ్మ దొడ్లో మొండిగోడ దగ్గర్నించి చూసిన ఈ దృశ్యం మొదట్లో నమ్మలేకపోయింది. కన్ను చెదిరిపోయింది.

'వెన్నెల్లో నీ చెక్కిలిగుంట ఎంత బావుందనీ!' ఇవి సాక్షాత్తూ కిష్టమూర్తి మాటలు.

ఇలా రోజూ అంటూనే వున్నాడు. అతనికి ఇవాళేం కొత్తలేదు.

గోడమీద వొరిగిచూస్తున్న నరసమ్మకి చాలా కొత్తగానూ, ఎంతో బాధగానూ తోచాయి ఆ మాటలు.

'పోదురూ ...'

సావిత్రి బొంగురు గొంతుక నిశ్శబ్దంలో వెగటుగా తోచింది నరసమ్మకి.

ఇక చూళ్ళేక పోయింది.



భమిడిపాటి జగన్నాథరావు




ఇంట్లోకొచ్చి లైటువేసి అద్దంలో మొహం చూసుకొంది. ఎవరి మీద కోపగించాలో తెలీలేదు పాపం ఆ సత్తెకాలం మనిషికి.

ఆమె కళ్ళు చాలా తీక్షణంగా మెరుస్తున్నాయి. అద్దానికి పక్కగా తనూ, భర్తా చిన్నప్పుడు తీయించుకున్న ఫోటో.

అప్పటి అందం, మెరుపూ ఇప్పుడు నరసమ్మలో లేవు.. అది ముందు గ్రహించినవాడు కిష్టమూర్తి.

తనలో మార్పు వచ్చిందనుకొంది నరసమ్మ.

తను కోరి మారిపోలేదే!

తను ముగ్గురి బిడ్డల తల్లి.

—కిష్టమూర్తితో పంతొమ్మిదేళ్ళ సంసారం.

.. తనిలా ఐపోయింది.

—కారణం కనిపిస్తూనే వుంది.

'తన్ని నాశనంచేసి సావిత్రితో కులుకుతున్నాడు." మండిపోయింది నరసమ్మ.

అసలు గొడవెక్కడంటే నరసమ్మ భర్త 'కృష్ణలీలలు' ఇన్నేళ్ళూ చూళ్ళేదు సరిగదా వినలేదు గూడానూ.

పొద్దుటే చేతిలో చిన్న సంచీతో అబ్బ! వెధవ ప్రయాణం, వెధవ రైలూనూ, హుస్సు! అంటూ దిగాడు కిష్టమూర్తి.

"కాఫీ ఐందా?"

"అవకేం చేస్తుంది. వెళ్ళిన ప్రయాణమేమైంది?" నరసమ్మ కంఠస్వరం అంత సుముఖంగా లేదని గ్రహించాడు.

"అ.. మరే.. వెధవది, మనం వెళ్ళినప్పుడే ఆ రామయ్యగారు వూళ్లో వుండకపోవడం" అంటూ మొదలెట్టాడు.

"అలా సావిత్రి చెప్పిందా?"

ఉలిక్కిపడలేదు కిష్టమూర్తి. ఇలాంటి సందర్భాల్లో అతనికి కొట్టినపిండే—భార్యతో ఇదే మొదటిసారైనా.

"రామయ్యగారి పెళ్ళాంపేరు సావిత్రా ఏవిటీ?"

"రామయ్యగారి పెళ్ళాంపేరు సావిత్రో దమయంతో నాకేం తెలుసు. రాత్రంతా మీతో గడిపిన పక్కింటి సావిత్రిమాట నేననేది."

"బలేదానివే మనపక్కింట్లో వున్న పిల్లపేరు సావిత్రా?"

"మరే. పిల్లే అది — కూచి ముప్ఫై ఏళ్లువచ్చి.. ఇంకా పిల్లే మీరూ బాలా కుమారులే."

"ఏవిటి నివనేది...?"

"నా ఖర్మ! నేననేదేవి బావుంటాయి? దానిమాటలు బావుంటాయిగాని, లేకపోతే దానికేం పొయ్యేకాలం...పండంటి సంసారంలో నిప్పులొయ్యడానికి ఐనా దాన్నని ఏం ప్రయోజనం—మన బంగారం మంచిది కానప్పుడు, ఇంట్లో ఈడొచ్చిన పెళ్ళికాని పిల్లవుందాయె—దానిపెళ్లి పెటాకులూ లేవు కాని...హువ్వ!" అంటూ నోరు నొక్కుకుంది నరసమ్మ.

"పిల్లదాని పెళ్ళిమాటేనా? సరోజ పెళ్లి నిముషాలమీద చేసేయనూ" మాట తప్పించబోయాడు.

"ఏవిటా దాగుడుమూతలు, అసలు సంగతి వదిలేసి. ఇన్నేళ్ళొచ్చి మగాడికి ఆ మాత్రం బుద్ధి నిలవలేనప్పుడు..." ఆయాసపడుతూ ఆపేసింది.

కిష్టమూర్తి ఒకందుకు సంతోషించాడు. భార్యకు ఇతర సంగతులు తెలేవు. ఇదే ప్రథమ

# ★ లౌక్యుడు ★

"వెధవది! పక్కిల్లేగదా; సావిత్రి ఆ మాత్రం చూసుకోవద్దూ" అని సావిత్రిమీద చిరాకు పడ్డాడు కిష్టమూర్తి మనసులో.

అసలు కిష్టమూర్తి భార్య దీనికింత రాద్ధాంతం లేవదీస్తుందని గ్రహించి ఉంటే తన జాగ్రత్తలో తనువుండేవాడు.

తన సంగతి ఆమెకు పూర్తిగా తెలీకపోయినా చూచాయగా తెలిసే వూరుకుంటోందన్న దురభిప్రాయంలో వున్నాడతగాడు ఇన్నాళ్ళూ.

భోజనాలవేళ "అదికాదు సరసూ..." అంటూ ఏదో సర్దబోయాడు.

"ఇంకా ఆ పిలుపెందుకూ? ఇన్నాళ్లు సంసారం చేసి ఆ మాత్రం బుద్ధిసరిగాలేని మనిషిదగ్గర నేనుండలేను. మా పుట్టింటికి పోతా. కాకపోతే మరీను...ఇంట్లో పెళ్ళి కావలసిన ఈడొచ్చినపిల్ల వుండగా, దాని ఇది ఇదైపోనూ, రామరామ, దాని చెక్కిలి గుంటలు, వెన్నెల్ల...ఇదంతా దానిమీద ప్రేమే కాబోలు, ప్రేమ 'సడాగం' బాగానే వుంది" వెటకారంగా అంటూ సరసమ్మ తారాపథానికి లేచింది.

కిష్టమూర్తి భార్యమాటలు వినడంలేదు. ఊరికే నవ్వాడు.

ఇంట్లోవున్న 'ఈడొచ్చిన' పిల్ల సరోజ వింటోంది. కాని సరోజకి తల్లి చివరిమాటలేం రుచించలేదు.

అమ్మ అలా అంటుందేవిటీ?

అమ్మకేం తెలుసు మహా అలా అనెయ్యడానికి, ప్రేమట! ప్రేమ అని వెటకారంగా.

తనతో సుందర్రావు ఏమన్నాడు మొన్న చీకట్లో చెయ్యి నొక్కుతూ. 'ప్రేమకి కులం, డబ్బు వీటితో సంబంధంలేదు. హృదయం ప్రధానం. నువ్వు నా జీవితానికి పూలబాట—అబ్బే, అదికాదు ఇంకా ఏవో ఎంతో చక్కగా అన్నాడమ్మా అనుకుంటోంది. "ఈడొచ్చిన" సరోజ.

అన్నట్టుగానే సరసమ్మ మొగపిల్లలిద్దర్ని తీసుకుని పుట్టింటికి బయల్దేరింది, "ఇక ఈ ఇంట్లో అడుగుపెట్ట" నని నోటిసిస్తూ.

నరసమ్మ పుట్టింటికి వెళ్ళినందుకు ఎవరూ అట్టే విచారించలేదు—ఓ నెళ్లాళ్ళ తర్వాత నరసమ్మ తప్ప.

సరోజ ఎగిరి గంతేసింది.

సావిత్రి పెద్దది కాబట్టి గంతులెయ్యలేదు.

సరోజ ఎగరడానికి బోల్డుగ్రంథముంది. సుందర్రావూ తనూ చాలా ప్రేమించుకున్నారు...అలా సుందర్రావు చెప్పలేదూ?

కాని చిక్కెక్కడంటే, నరసమ్మ వుండగా సుందర్రావుకు సరోజని కలుసుకోడానికి అట్టే వీలుండేది కాదు.

ఇప్పుడో?...లైన్‌క్లియర్.

* * *

అకస్మాత్తుగా పిల్లల్తో దిగిన నరసమ్మని చూసి తల్లి ఆశ్చర్యపడింది. అన్నగారు ఆశ్చర్యపడినా ప్రకటించలేదు. భోజనాలయాక సావకాశంగా కూచుని "ఉత్తరం ముక్కైనా రాయకుండా వచ్చేశావేమే, అన్నయ్యవచ్చునుగా స్టేషన్కి" అంది సుబ్బమ్మ కూతురు నుద్దేశించి.

తల్లి సామాన్యంగానే అన్న ఈమాటల్లో ఉత్తరమేనా రాయకుండా రాడంలో అంతరార్థం ఏవిటి?" అని ధ్వనించింది నరసమ్మకి.

తల్లి అలా అనడంలో సబబుంది. మొన్న నరసమ్మ అన్నగారు వచ్చి తీసుకువెళ్తానంటే, 'ఆయనా, పిల్లా వుండలేరు; పండక్కి వస్తా'నని నరసమ్మే సాగనంపింది అన్నగార్ని.

అది జరిగి నిండా పదిహేను రోజులవలేదు.

'ఏవమ్మా వొదినా, మొన్న ఆయనొచ్చినప్పుడు అన్నగార్ని వదిలి రాలేనన్నావుటగా?' అంది సాగదీసుకుంటూ నరసమ్మ అన్నగారి భార్య.

సాయంత్రం దొడ్లో బియ్యం కడుగుతూన్నప్పుడు గోడవతలనించి రత్తమ్మ కేక: 'ఏవమ్మోయ్ నరసమ్మా!... ఎప్పుడొచ్చావ్?—విశేషంతో ఏమైనా వచ్చావా?'

ఎవరికీ సమాధానం చెప్పదల్చుకోలేదు నరసమ్మ.

'వెధవ పల్లెటూరు. అందిరి గొడవా వీళ్లకే కావాలి!' విసుక్కుంది.

రోజులు గడుస్తున్నకొద్దీ నరసమ్మకి చిరాగ్గా వుంది. అందరిమాటకేంగాని, తల్లికి సమాధానం చెప్పలేకపోతోంది.

"మాటామాటా వస్తే మాత్రం!... కోపంతో వచ్చేస్తే మనకేనష్టం! మాటపట్టింపులకి పోతే సంసారం నడవడమెలా?"

"మాటపట్టింపు వచ్చిందని ఎవరు చెప్పారే?"

"అదికాదే వేరే చెప్పాలీ? ఏదో మనమే సర్దుకుపోవాలిగాని."

"అబ్బ! వూరుకోవే..." విసురుగా లేచిపోయింది నరసమ్మ.

ఏవిటోగాని నరసమ్మకి రానురాను ముళ్లమీద కూచున్నట్టుగావుంది. ఎవరూ ఏమీ కష్టంగా అనకపోయినా అందరిమాటల్లో ఒకటే ధ్వని. తల్లిగాని, ఆఖరికి అన్నయ్యగాని తన్నికణ్ణించి పొమ్మనడంలేదు - అది నిజం.

అయితేం?— అందరి భావం తనా సంసారం జరుపుకోవాలనే.

'వచ్చే పున్నంకి రెండునెలలు దాటిపోతాయి వచ్చి,' అనుకొంది.

మధ్యాహ్నం చుట్టుపక్కల అమ్మలక్కలంతా నరసమ్మ ఇంట్లో గల్లుగీస్తున్నారు పచ్చీసు ఆడటానికి.

"అవును కాని సుబ్బమ్మత్తా, వెనకవీథి సూరమ్మ కూతురు..." అని ఆపేసింది. శేషమ్మ, 'ఆకూతురెవరో తెలుసా' అన్నట్టు.

"ఊఁ. సుబద్రమ్మగదూ ?"

"ఆఁ. సుబద్రమ్మే." అని మెటికలు విరుచుకొని, "ఏంచేసిందో తెలుసా ?" అని పూర్తిచేసింది శేషమ్మ.

చాలా జతలకళ్లు ఆమెవంక 'ఏంచేసిందో' వినడానికి ఆత్రంగా చూస్తున్నాయి.

కొంచెం దగ్గరగా జరిగి "ఏంచేసిందో, శేషమ్మొదినా!" అంది ఒకావిడ.

"మీకు తెలీదూ? నాచేత వాగించడానికిగాని. నేనేదో మహా తెలిసినట్టు మొదలెట్టబోయాను," అని వూరుకొంది శేషమ్మ.

ఈ దెబ్బతో 'సుభద్రమ్మ ఏంచేసిందో' అన్న విషయం—చెప్పడానికి తగ్గ 'క్లైమాక్స్' పూర్తిగా అందుకొంది.

"చెబుదూ శేషమ్మత్తా!" అన్నాయి రెండు కంఠాలు.

"ఏంలేదర్రా! మొగాడు తిరిగితిరిగి వస్తాడా; ఏకళ్ళనున్నాడో ఓరోజు రెండు బాదాట్ట—అంతే పుట్టింటికి వచ్చేసింది. మగాడన్న తర్వాత అమాత్రం కొట్టడా, మనం తినగూడదా? చోద్యం మరీను."

"కాదుమరీ?" అని సాగదీసింది

(55-వ పేజీ చూడండి)



# ఆంధ్ర మహాభారతము

## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము

క. భూరిజవభూతజాతధ,రారేణుప్రకరధూసరశరీరకు లై
వారిద్దఱు నొప్పిరి సిం, హోరచ్ఛన్నంబు లయిన యద్రులపోలెన్.

క. ఆ రాక్షసుండు భీము న,పారభుజాబంధనమున బంధించి మహా
ఘోరధ్వని రోదోంతర,పూరిత మగునట్లు గాఁగ బొబ్బిడి యార్చెన్.

వ. అమ్మహాధ్వని విని కుంతియుఁ గొడుకులును మేల్కాంచి తమసమీపంబున నతిమానుషంబైన రూపసౌందర్యంబులతో నున్న హిడింబం జూచి యిది వనదేవతయో సురకన్యయో యనుచు విస్మయంబునొంది రంతం గుంతి కాంతవచనంబుల నీ వెవ్వరిదాన విట యేలవచ్చితని యడిగిన నది యిట్లనియె.

సీ. నీలజీమూతంబు లీల నాక్షేపించి, నల్లనై తోఁతెంచు నల్లగృహము
గలహిడింబుం డను బలితంపురక్కసు, చెలియల నాతండు వెలయ మీకు
కోయక యహితంబు సేయ నన్ బంచినఁ,జనుదెంచి యేను మీ తనయునందుఁ
బలిబుద్ధిఁ దాల్చి యుద్ధతమన్మథార్తనై, మసలితి మసలిన నసుర వచ్చి

తే. యలిగి నాతోడ నన్నును గలయఁబట్టి, మ్రింగనున్న నయ్యసురతోడం గడంగి
మల్లయుద్ధంబు సేయుచు నల్లచోట, నున్నవాఁడు మీసుతుఁడు దర్పోన్నతుండు.

వ. నన్నును మిమ్మును రక్షించి యారక్కసు నుక్కడంగ నశ్రమంబున నిప్పుడ చంపుం జూడుండనిన నందఱు లేచి యుద్ధతుండయి మల్లయుద్ధంబు సేయుచున్న భీమహిడింబులం జూచి రంత నచ్చోటికిం జని యర్జునుండు భీమసేనున కిట్లనియె.

ఉ. తూర్పరుణంబు గాఁ దొడఁగె దుష్టనిశాచరవేళ యయ్యెడున్
మార్పుము కాలయాపన మమర్షక యప్పిశితాశిఁ బట్టి పా
లార్పఁగ నేల నావుడు బలాఢ్యుఁడు భీముఁడు మల్లవిద్య నే
ర్పేర్పడఁగా హిడింబు బలహీనపరాక్రముఁ జేసెఁ జెచ్చెరన్.

క. వడి నసురఘాత ముక్కున, నుడుగక రక్తప్రవాహ మొలుకఁగ నలుకం
గడగాలు వట్టి వానిని, మడవక పవనజుఁడు నూఱుమాఱులు వీచెన్.

ఆ. లావు సెడఁగ నిట్లు వీవంగఁబడి గత,చేష్టుఁ డయిన యసురఁ జిక్కఁబట్టి
నేలఁ బెట్టి వాని కోలెమ్ము ప్రల్లన, విఱిచి నడుము ద్రుంచి వీచి వైచె.

వ. అట్టి చిత్రవధం జూచి చిత్రీయమాణచిత్తులై భీమసేనుపరాక్రమంబు వొగడుచు నందఱు హిడింబానుగమ్యమానులై చని రట్లరుగునెడ భీముండు హిడింబరాక కొడంబడక రాక్షసులు వైరంబుఁ దలంచి మాయలు సేయుదురు కావున నీవు మాతోడ రావలవదు నిన్ను విశ్వసింపము నీవును మీయన్నపోయిన తెరువునన పొమ్మనిన నది భయంపడి వడవడ వడంకుచున్న దానిం జూచి కరుణారసార్ద్రచిత్తుండయి ధర్మరాజు భీమున కిట్లనియె

తే. వధకు నర్హుఁడై వచ్చిన వానిఁ జంపి, తదియు ధర్మువ యిది చాల నబలదీని
కలుగఁ జన దాత్మరక్షకు నగ్గలంబు, ధర్మరక్షయ యుత్తమ ధార్మికులకు.

క. ఆపద యయినను ధర్మువ, ప్రాపుగ రక్షింపవలయుఁ బరమార్థము ధ
ర్మాపాయము ధార్మికులకు, నాపద జన్మాంతరమున ననుగత మగుటన్.

వ. దీనియందు రాక్షసభావం బుపలక్షింప వలవదు మాకు నాత్మీయబుద్ధియ యుండుననిన హిడింబ ధర్మరాజునకుం గుంతీదేవికిని మ్రొక్కి యేకాంతంబు కుంతి కిట్లనియె నవ్వా సర్వప్రాణులకు సామాన్యంబయ్యును మనోజరాగంబు వనితల కసహ్యంబయి విశేషంబయి యుండునేను వృకోదరునిమిత్తంబు మదనబాణ బాధితనయి నాచుట్టంబులనుం జెలులను విడిచితి నాయిష్టంబు మీరు గావింపని నాఁ డప్పుడ ప్రాణంబులు విడుతు నన్ను రక్షించిన మీకు నిష్టంబు లయినవాని నెల్లం ధలంచి చేయుదు నిమ్ము గానియెడల మిమ్మంధఱ నెత్తికొని మీ మెచ్చినచోటికిఁ బోవనేర్తు నాపలుకులు నమ్మునది యే నతీతానాగతవర్తమానంబులెల్లను దెల్లంబుగా నెఱుంగుదు వలయునేని యనాగతంబు సెప్పెద వినుండు ముందట నొక్క సరోవరంబును నొక్క వనస్పతియునుం గల వవి రెండును శాలిహోత్రుండను మహాముని చేతం దపఃప్రభావంబునం బడయంబడినయవి యక్కొలని నీళ్లు ద్రావినవారికి నెన్నండును నాఁకలియును నీరువట్టును లే వవ్వనస్పతియు శీతవాతాత వర్షంబులవలన రక్షించు మీరలందున్న మీకడకుఁ గృష్ణద్వైపాయనుండు వచ్చి మీకు హితోపదేశంబు సేయునని సెప్పిన.

క. విని కుంతియుఁ బాండవులును, మనమున విస్మయముపడి సమంజసభావం
బున దాని దివ్యవనితయ, యని తద్దయు నాదరించి రప్పుడు కరుణన్.

వ అంత దాని వినయంబునకు ననాగతం బెఱుంగుటకు సంతసిల్లి కుంతి భీమున కిట్లనియె.

క. అన్న యిది ధర్మ వని మీ, యన్నను నన్నును నతిప్రియంబున నెదలో
మన్నించి యేమి వనిచినఁ, గన్నన మాఁనుపు సేయఁ గడఁగుము బుద్ధిన్.

క. ఇది పరమసాధ్వి దీనిని, మది నొండుగఁ దలఁపవలదు మానుగఁ బుత్రా
భ్యుదయ మగుఁ బాండుహితముగ, నిదికార్యమయని పరిగ్రహింపుము నెమ్మిన్.

వ అని భీమసేను నొడంబఱిచి హిడింబ కనురాగంబుగాఁ జెప్పి నీవు శుచివయి యుత్తమస్త్రీగుణంబులు దాల్చి భీమునకు మనఃప్రియంబు సేయుముపగళ్లెల్లను మీయిష్టంబున విహరించి రాత్రులు మాయొద్దన యుండునది యని నియమించిన భీముండును బుత్త్రజన్మంబగునంతకు దీని మీవచనంబునఁ బరిగ్రహించెద నని వారలసమక్షంబున సమయంబు సేసెనంతఁ బాండవులు జననీసహితంబు శాలిహోత్రు నాశ్రమంబునకుం జని ప్రభాతసమయం బక్కొలనఁ గృతస్నానులయి సంధ్యావందనంబులు దీర్చి శాలిహోత్రుచేతం బూజితులయి తద్వనస్పతి తలంబున విశ్రమించి విగతక్షుత్పిపాసు లయి సుఖం బున్నంత,

ఉ. పుణ్యతపోమయుండు మునిపూజ్యుఁడు బ్రహ్మసమప్రభుండు బ్ర
హ్మణ్యుఁడు ప్రావృషేణ్యజలదాసితవర్ణుఁ డశేషకిల్బిషా
రణ్యదవానలుం డగు పరాశరనందనుఁ డేఁగుదెంచెఁ ద
త్పుణ్యచయస్వరూపమును బోలెఁ గరంబు మనోముదంబుగన్.

వ. ఇట్లు వచ్చిన వ్యాసమునీంద్రులకు సందఱు నతిభక్తి నమస్కరించి యాసనార్ఘ్యాదివిధులం బూజించి యున్నవారలం గరుణార్ద్రదృష్టిం జూచి కృష్ణద్వైపాయనుం డిట్లనియె.

పద్మకము. కొడుకుపల్కు విని కూడదు నాక దురాత్ముఁ డై
కడఁగి మీకు నపకారము సేసి ధరిత్రి వె
ల్వడఁగఁ బంచెఁ గడుఁ బాపమతిన్ ధృతరాష్ట్రుఁ డె
య్యెడల దుర్జనుల నేమఱి నమ్మఁగఁ బోలునే.

వ దీని నెఱింగి మీకు హితోపదేశంబు సేయ వచ్చితి నిఖిలధర్మవిదుల రయి వినీతుల రయిన మీకు బాంధవవియోజనం బయినయీకర్మంబు పురాకృతంబు దీనికి శోకింపవలవదు కొండొకకాలంబునకు మీరును బాంధవులును గలసి యెప్పటియట్ల రాజ్యంబు సేయుదు రిది శాలిహోత్రుతపః ప్రభావంబున నైన కొలనుదీని జలంబు లుపయోగించినవారికి బుభుక్షాపిపాసలు లే వివ్వనస్పతియును శీతవాతాతపవర్షంబులవలన రక్షించు నిం దొరు లెఱుంగకుండఁ గార్యార్థులరై కతిపయదినంబు లుండి యేకచక్రపురంబున కేఁగి యందు బ్రాహ్మణభావంబున బ్రాహ్మణగోష్ఠినుండి నారాక ప్రతీక్షించుచుండునది యని కఱపి తనకు వినయావనతులయి కృతాంజలు లయిన మనుమల దీవించి కౌఁగిలించుకొని బాష్పపూరితనయనయయి మ్రొక్కియున్నకోడలి నూరార్చి నీకొడుకు ధర్మనిత్యుం డీ యుధిష్ఠిరుండు నారాయణభుజంబులంబోని తన నలువురుదమ్ముల బలంబున సర్వపార్థివుల శాసించి సార్వభౌముండై రాజసూయాశ్వమేధాదిక్రతువులు సేసి పితృపైతామహంబైన రాజ్యలక్ష్మి ననుభవించుచుం గురుకులంబునెల్లఁ బవిత్రంబుసేయు నని శోకోపశమనంబుఁ జేసి హిడింబం జూచి దీని పేరు కమలపాలిక యిది భీమునకు వశవర్తినియయి పరిచరించి మహాసత్త్వుం డయిన కొడుకుం గాంచు నాతండు మిమ్మందఱ నాపద్విషయంబున నుద్ధరించునని చెప్పి మునివరుండు తిరోహితుండైన.



సిమ్లాలో రాష్ట్రపతి నివాస్.

# న్యూఢిల్లీ, సిమ్లా,

# భారత

# నివాస

కె. ఆర్. 

దేశానికి స్వాతంత్ర్యం రావటంతో మన రాజకీయ వ్యవస్థ అనేక అవస్థాంతరాలు పొందింది. ముఖ్యంగా చెప్పుకోదగిన మార్పు, మన జాతీయ నాయకుల్లో వచ్చింది. అప్పటిదాకా మామూలు ఖద్దరు బట్టలు కట్టుకుని నిరాడంబరంగా జీవితం గడిపిన నాయకులు ఒక్కసారిగా ప్రభుత్వాధినాయకులయ్యారు. ప్రపంచ చరిత్రలోకల్లా గొప్పదైన మహాసామ్రాజ్యానికి చెందిన సమస్త వైభవాడంబరాలు వీరిని చుట్టుముట్టాయి. కాని అందరిలోకి ఎక్కువ మార్పులకు లోనుకావలసివచ్చిన వ్యక్తి రాష్ట్రపతి. అతి నిరాడంబర జీవితానికి అలవాటుపడిన ఆయన ఒక్కసారిగా రాచమర్యాదలకు, అధికారిక సంప్రదాయాలకు అలవాటుపడవలసి వచ్చింది.

రాష్ట్రపతి కార్యక్రమాలకు కేంద్రం రాష్ట్రపతి భవనం. మామూలుగా ఆయన ఏడాదికి ఎప్పుడెప్పుడైతేనేం మొత్తానికి నాలుగు అధికారిక భవనాలలో నివసిస్తారు. వీటిలో న్యూఢిల్లీలోని రాష్ట్రపతి భవన్, సిమ్లాలోని రాష్ట్రపతి నివాస్—ఈ రెండే ప్రభుత్వ భవనాలు.

## న్యూఢిల్లీలోని భవనం

భారత రాజధానిలోని రాష్ట్రపతి భవనాన్ని స్వాతంత్ర్యానికి ముందురోజుల్లో వైస్రాయిభవనం అనేవారు. ఈ భవనం అత్యంత సుందరమైనది. అతి విశాలమైనది. 1911 లో భారత రాజధాని కలకత్తానుండి ఢిల్లీకి మారినప్పుడు వైస్రాయికి ఒక మహాభవనం నిర్మించాలని ప్రభుత్వం నిశ్చయించింది. వైస్రాయి అంటే సామాన్యుడా! రవి అస్తమించని సామ్రాజ్యానికి అధిపతిఅయిన ఐదవజార్జి చక్రవర్తికి సాక్షాత్తు ప్రతినిధి. అందుచేత ఆయన అంతస్తుకు తగినంత బ్రహ్మాండంగా భారత దేశంలో ఎన్నిరకాల వాస్తుశిల్పాలున్నాయో అన్నిరకాలనూ ప్రతిబింబించే మొగలు వాస్తుశిల్పంలో నిర్మించాలని చక్రవర్తి ఆదేశించాడు.

అంతేకాదు. వైస్రాయిని చూట్టానికి వచ్చేవాళ్ళు మాత్రం సామాన్యులా! బ్రహ్మాండమైన రాజభవనాలలో నివసించే నిజాం, బరోడా మహారాజాల్లాంటి హేమాహేమీలు. వారు తన్ను చూట్టానికివచ్చినప్పుడు వారి కళ్ళుకూడా చెదిరిపోయేలా దిగ్భ్రమ కలిగించేంత గొప్పభవనాన్ని నిర్మించాలని వైస్రాయి రాజుగారికి రాశాడు.

న్యూఢిల్లీ నిర్మాణంపని ఇద్దరు ప్రముఖ శిల్పులకు అప్పగించారు. ఒకాయన సర్ హెన్రీ బేకర్. ఇంకొకాయన సర్ ఎడ్విన్ లూట్యెన్స్.

ఇక ఖర్చుసంగతి. క్రొత్త రాజధానిని కట్టడానికి సాధ్యమైనంత తక్కువఖర్చుపెట్టాలని భారత ప్రభుత్వం అభిప్రాయపడింది. కాని ప్రభుత్వం కేటాయించిన డబ్బు చాలదని శిల్పులు భావించారు. వైస్రాయి హార్డింజ్ ప్రభువు ఫర్నిచరు, తోటలు, అశ్వశాలలు, సిబ్బంది గృహాలకు కాక మిగతా భవనపు నిర్మాణానికి మాత్రం 26 లక్షలకంటె ఎక్కువ ఖర్చుపెట్టకూడదని అనుకున్నారు. కాని 130లక్షలైనా లేందే భవనాన్ని అందంగా కట్టటానికి సాధ్యంకాదని సర్ లూట్యెన్స్ భావించారు. 1932లో భవనం పూర్తయ్యేనాటికి లెక్కవేసి చూసుకుంటే సర్ లూట్యెన్స్ అంచనాయే అయిన ఖర్చుకు దాదాపు సరిపోయింది. ఎందుకంటే న్యూఢిల్లీని కట్టటానికి అయిన 14 కోట్ల రూపాయల్లోనూ, 170 లక్షలు వైస్రాయి భవనానికీ, తోటలకీ, సిబ్బంది ఇళ్ళకీ ఖర్చయింది. ఇంచుమించుగా ఒక ఘనపు అడుక్కి రూపాయి పావలా చొప్పున



హైదరాబాదులోని రాష్ట్రపతి నిలయం.

# హైదరాబాదులలో
# ...ష్ట్రపతి ...వనాలు

...న్. స్వామి



సిమ్లాకుదగ్గిర మషోబ్రావద్దఉన్న రాష్ట్రపతి వసతి గృహం.

యింది. అదే ఇంగ్లండులో అయితే ఘనపుటడుక్కి 4 రూపాయలు అయ్యేది. అంటే మొత్తం 550 లక్షలయ్యేదన్నమాట. ఇవాళ భారత దేశంలో ఇలాంటి భవనం కట్టించాలంటే దాదాపు పదికోట్లు అవుతుంది.

అయితే ఇంకో విశేషం గమనించాల్సి ఉంది. భవనాన్ని, న్యూఢిల్లీని ప్లాను చేసినందుకుగాను శిల్పులకు ఇచ్చిన ఫీజు చాలా ఉంది. మొత్తం ఖర్చులో నూటికి అయిదువంతుల చొప్పున ఇవ్వటానికి, సలహాదారులుగా వ్యవహరించినందుకు మరొక వెయ్యేసి పౌనులు ఏటా ఇవ్వటానికి ఒప్పందం జరిగింది. దీని ప్రకారం ఫీజు 65 లక్షల రూపాయలయ్యేది. కాని ఇంతలో మొదటి ప్రపంచ యుద్ధం వచ్చింది. దాంతో నగర నిర్మాణం ఆలస్యమై మొత్తం 17 ఏళ్లు పట్టింది. నిర్మాణవ్యయంకూడా పెరిగింది. శిల్పులకు ఎక్కువిచ్చేస్తున్నారనే గోల బయలుదేరేసరికి ప్రభుత్వం ఖర్చులో నూటికింత అని కాకుండా మొత్తం 26 లక్షలు తీసుకునేట్లు శిల్పులను ఒప్పించింది.

రాష్ట్రపతి భవనం 200 గజాల పొడుగు, 180 గజాల వెడల్పు వుంది. ఇందులో 340 గదులున్నాయి. 74 లాబీలున్నాయి. నడవలే మొత్తం ఒకటిన్నర మైళ్ళ పొడుగున వున్నాయి. 18 మెట్లవరుసలు, 37 నీటిబుగ్గలున్నాయి. మొత్తం వైశాల్యం దాదాపు రెండులక్షల చదరపు టడుగులు.

భవన నిర్మాణానికి దేశంలో దొరికే సామగ్రినే ఎక్కువగా ఉపయోగించారు. జోధ్‌పూర్‌లోని మక్రానానుంచి తెల్లపాలరాయి, బరోడా, అజ్మీర్‌లనుంచి ఆకుపచ్చరాయి, మార్వార్‌నుంచి బూడిదరంగురాయి హరిపూర్‌నుంచి ఎర్రరాయి, జైసల్మీర్‌నుంచి పసుపుపచ్చరాయి మొత్తం ఒకలక్ష ఘనపుటడుగుల స్ఫటికశిల ఉపయోగించారు. దిగుమతి చేసినదల్లా ఇటలీనుంచి పోర్ఫిరీ అనే స్ఫటికశిల.

తివాచీలు చాలా శ్రేష్ఠమైనవి తయారుచేయించారు. దర్బారు హాలులోని తివాచీకి డిజైను 16వ శతాబ్దపువర్షియన్ రాజుల తివాచీలను అనుసరించారు. మిగతాగదుల్లో కూడా ప్రాచీన పారశీక తివాచీలను అనుసరించి నేయించిన తివాచీలు వేశారు. ఈ తివాచీలు నేయటానికి 500 నేతగాళ్ళకు రెండేళ్లు పట్టింది.

## దర్బారుహాలు

భవన మంతటిలోకీ దర్బారుహాలు అద్భుతమైనది. దీంట్లో అడుగుపెడుతూనే ప్రేక్షకుడు నోటమాటరాక దిగ్భ్రాంతుడైపోతాడు. ఈ హాలుగోడలు 42 అడుగుల ఎత్తుదాకా తెల్లస్ఫటికశిలతో తాపడం చేయబడినవి. ఆ ఎత్తునుంచి 78 అడుగుల ఎత్తున, 72 అడుగుల వ్యాసంతో ఒక పెద్ద గోపురం ప్రారంభమవుతుంది. నేలడిజైను కూడా చూపరులను నిశ్చేష్టుల్ని చేస్తుంది. చూసివచ్చినవారు మొదట రెండుమూడు అడుగులూ వేయటానికి భయపడిపోతారు. అయితే ఆరోజుల్లో సాధారణంగా చూడవచ్చే వారందరూ పెద్దపెద్ద సంస్థానాధీశ్వరులే గనక ఆ దృశ్యానికి తట్టుకోగలిగేవారు.

రాష్ట్రపతి భవన్ ఎదురుగా 145 అడుగుల ఎత్తున్న ఒకగొప్ప స్తంభం ఉన్నది. రెండులక్షల రూ.ల నిర్మాణ వ్యయం పట్టిన ఈ స్తంభాన్ని జయపూర్ మహారాజా బహూకరించారు.



న్యూఢిల్లీలోని రాష్ట్రపతి భవన్.

భవనానికి ఆనుకుని ప్రసిద్ధికెక్కిన మొగల్ గార్డెన్సు ఉన్నాయి. నాలుగేళ్ళ నిరంతర కృషిఫలితంగా ఈ తోటలు తయా

(54-వ పేజీ చూడండి)

## వికారి సంవత్సరం

# గోచార ఫలితాలు

ఈ సంవత్సరము రాజు గురుడు. సేనాధిప, అర్ఘాదిప, మేఘాధిపతులు చంద్రుడు, మంత్రి కుజుడు, సస్యాధిపతి శుక్రుడు, ధాన్యాధిపతి బుధుడు, రసాధిపతి సూర్యుడున్నూ అయిరి. కుంచము బాల్యవయస్సుగల బ్రాహ్మణ హస్తగతమయి నాలుగు కుంచములు వర్షం కలుగును. చైత్రాది ఆషాఢ పర్యంతము వర్ష ప్రతిబంధక అవయోగము లుండుటచేత విశేషవర్షయోగములు లేక పోవుటచేతను, ఆ కాలమందు మధ్యమముగా వర్షించును. కొంత వర్ష ప్రతిబంధకమున్ననూ జ్యేష్ఠబహుళము లగాయతు శ్రావణ శు 11 వరకు కుజుడు రవి శుక్రుల మధ్యనుండుటచే సస్యానుకూలముగా వర్షములు కురియును. వైశాఖమాసమున తొలకరివానలు ఆరంభమగును. పూర్వ సస్యవృద్ధి తక్కువగాను, అపరసస్యములు పూర్ణముగాను ఫలించును. శ్రీకృష్ణుడు పశుపాలకుడగుటచే పశువృద్ధి కలుగును. ధాన్యాధిపతి బుధుడగుటచే ధాన్య వృద్ధి మధ్యమముగా వుండును. రసాధిపతి సూర్యుడగుటచే రసవస్తువులగు చింతపండు, బెల్లము, మిరప మొదలగునవి వృద్ధి తక్కువగాయుండి ధరలు కలిగివుండును. కాలసర్పాదిదోశారిష్టయోగములుండుటచే ప్రజలు దుర్భిక్ష, రోగ, అనావృష్టి యోగములు పొందుదురు. ఈ ప్రాంతములలో మనకగుపడు గ్రహణములు లేవు.

శ్రావణ బ 1 8 బుధవారము లగాయతు భాద్రపద శు 3 శనివారమువరకూ శుక్ర మూఢమున్నూ, కార్తిక బ 7 ఆదివారము

**ఓ. ఎస్. రావు**

మొదలు మార్గశిర్ష బ 7 మంగళవార పర్యంతము గురుమూఢమున్నూ కలుగును. శేష మాసములు శుద్ధములు.

వికారి సంవత్సరమున రోగములవలనను, అనావృష్టివలననూ అన్ని దేశములు పీడింపబడును. పూర్వసస్యములు స్వల్పముగాను, అపరసస్యములు విస్తారముగాను ఫలించును.

గురుడు రాజగుటవలన ప్రజలకు సుభిక్షము ఆరోగ్యము, సుఖము, సవృష్టి కలుగును.

మంత్రి కుజుడగుటవలన అగ్నిభయముచే పుర, గ్రామములకు పీడ కలుగును. వర్షములు మధ్యమముగా వుండును. సేనాధిపతి చంద్రుడగుటవలన ఎక్కువ వర్షములు కురియును. ప్రజలు రోగములులేక సుఖింతురు. శుక్రుడు సస్యాధిపతియగుటవలన స్థలధాన్యములు, జలధాన్యములు సమృద్ధిగా ఫలించును. తెల్లభూములు బాగుగా పండును. బుధుడు ధాన్యాధిపతి యగుటవలన వర్షములు, సస్యములు మధ్యమముగావుండి పంట తక్కువగును మేఘములు గాలిచే పీడించబడి సరియగు వర్షములు కలుగవు. చంద్రుడు మేఘాధిపతియగుటచేతను అన్ని దేశములందును పంటలు బాగా ఫలించును. ఆవులు పాలను సమృద్ధిగానిచ్చును. గురుడు నీరసాధిపతియగుటచేతను పూగీఫలములు, అఖిల రత్నములు, బంగారము, చందనము, పువ్వులు, ధాన్యము, తోళ్లు, దూది మొదలగునవి వృద్ధి కలిగియుండును. ప్రజలు సుఖపడుదురు. తమోనాయక మేఘముగుటచేతను మేఘ గర్జన మెక్కువగా యుండును. అక్కడక్కడ వడగండ్ల వాన కురియును. అధిక వర్షములచే నదీనదములు బాగా ప్రవహించును. కొన్ని చోట్ల వరదలబాధ కలుగును.

### గోచార ఫలితాలు

[గోచార ఫలితాలు గురు, శని, రాహు కేతువులు, కుజుడు స్థితినిబట్టి వ్రాయడమైనది. స్వల్పకాలమందు మారు రవి, బుధ, శుక్రులనుబట్టి వ్రాయలేదు. వారిని బట్టి కూడా మాసవారీ ఫలములు వ్రాసిన గ్రంథ విస్తరమగును. జాతకమందు శుభ ఫలములు గలుగు దశాంతర్దశలు నడుచుచున్న యెడల మంచి ఫలములే కలుగును. నామ నక్షత్రమును బట్టి కూడా ఫలితాలు తెలుసుకొనుటకు వీలుగా వ్రాయడమైనది.]

### మేషరాశిఫలం

అశ్విని 1-2-3-4 చూ, చే, చో, లా

భరణి 1-2-3-4 లీ, లూ, లే, లో

కృత్తిక 1 అ

ఈ రాశివారికి ఆదాయము 11 వ్యయము 5. రాజపూజ్యము 2 అవమానము 4 అయి

నవి. సంవత్సరారంభము నుండి పుష్యశు 18 వరకు అష్టమమందు గురుడు, సంవత్సరమంతయూ భాగ్యశని, షష్టరాహువు, వ్యయమందు కేతువు వుందురు. గురు కేతువులు అశుభప్రదులు. శని రాహువులు సామాన్యులు. పుష్యమాసము వరకూ కొంత గడ్డుగా వుండును. యత్నకార్యములకు ఆటంకములు కలుగును. ఇతరులతో కలహము, వస్తునష్టము, స్థానచలనము కలుగును. జ్యేష్ఠ, ఆషాడ మాసములు మంచివి కావు. తక్కిన నెలలో కొంచము అనుకూలముగా వుండును. పుష్య, మాఘ, ఫాల్గుణ మాసములలో కార్యానుకూలత, శత్రుజయము, ఆరోగ్యము, ఉత్సాహము కలుగును. అష్టమందున్న గురుదోష నివారణకై గురునికి శాంతి చేయించుట కొంత మేలునిచ్చును.

## వృషభ రాశిఫలము

కృత్తిక 2-3-4 ఈ, ఊ, ఏ

రోహిణి 1-2-3-4 ఓ, వా, వీ, వూ

మృగశిర 1-2 వే, వో

ఈ రాశివారికి ఆదాయము 5, వ్యయము 14, రాజపూజ్యము 3, అవమానము 4, అయినవి. సంవత్సరారంభమునుండి పుష్యశు 18 వరకూ సప్తమ గురుడు శుభుడు. ఆపైని అష్టమమున అశుభుడు. సంవత్సరమంతా పంచమరాహువు మధ్యమము, లాభకేతువు శుభుడు, అష్టమశని అశుభుడు. వైశాఖ, జ్యేష్ఠములలో కుజుడు శుభుడు, ఆపైని సామాన్యుడు. అష్టమశని యైననూ తక్కిన గ్రహస్థితి బాగుండుటచే శుభఫలాధిక్యము కలుగును, పాపఫలము స్వల్పముగాయుండును. శుభాశుభ మిశ్రమముగా నడుచును. ఆశ్వయుజాంతమువరకూ యత్నకార్యసిద్ధి, మనోజయము, వ్యాపారమూలముగాధన లాభము, శుభకార్యాచరణ కలిగియుండును. కొంచమనారోగ్యము కూడా కలుగవచ్చును, ఆపైని మధ్యమముగా వుండును. మాఘము మొదలు గురుశనులు అష్టమమందుండుటచే అకాలమున జనవిరోధము, మనోభీతి, స్థానచలనము, ధనవ్యయము, రోగభీతి కలుగును' గురుశనులకు శాంతి చేయించుట మేలు.

## మిధున రాశి ఫలం

మృగశిర 3-4 కా, కి.

ఆరుద్ర 1-2-3-4 కూ, ఖ, జ, ఛ.

పునర్వసు 1-2-3 కే, కో, హా.

ఈ రాశివారికి ఆదాయము 8, వ్యయము 11. రాజపూజ్యము 1, అవమానము 7 అయినవి. సంవత్సరాదినుండి పుష్య శు 18 వరకు షష్ఠగురుడు, ఆపైని సప్తమగురుడు సప్తమ శని, చతుర్ధరాహువు, దశమకేతువు సామాన్యులు. వైశాఖ శు 12 వరకునూ, మాఘ బ 2 లగాయతు సంవత్సరాంతమువరకు కుజుడు అశుభుడు అయినందున మధ్యమముగా వుండును. ఆషాఢ శ్రావణములు శుభకరముగా వుండును. భాద్రపద ఆశ్వయుజ కార్తీక

# ★ గోచారఫలితాలు ★

ములు మధ్యమముగానుండును. పుష్య, మాఘ ఫాల్గుణములు అనుకూలముగా నుండి, పుత్సాహము, శత్రుజయము, ధనలాభము, ఉద్యోగమందు అభివృద్ధి, గౌరవము, శుభ కార్యాచరణము కలుగును.

### కర్కాటకరాశి ఫలం

పునర్వసు 4 హీ.

పుష్యమి 1-2-3-4 హూ, హే, హో, డా.

ఆశ్లేష 1-2-3-4 డి, డూ, డే, డో.

ఈ రాశివారికి ఆదాయము 2, వ్యయము 11. రాజపూజ్యము 4, అవమానము 7 అయినవి. సంవత్సరాదినుండి పుష్య శు 13 వరకు పంచమగురుడు, సంవత్సరమంతయు షష్ఠశని తృతీయరాహువు, భాగ్యకేతువు శుభులు అగుటవల్ల పుష్యమాసమువరకూ చాలా అనుకూలముగానుండును. అందు జ్యేష్ఠ కార్తీక మాసములు మధ్యమముగానుండును. పుష్యము మొదలు గురుడు అశుభుడు అగుటచేతను కొంచెము మనోవ్యథ, యత్నకార్యములకు ఆటంకములు కలుగును. మొత్తముపైని అనుకూలముగానే వుండును.

### సింహారాశి ఫలం

మఖ 1-2-3-4 మా, మీ, మూ, మే.

పూర్వఫల్గుణి (పుబ్బ) 1-2-3-4 మో, టా, టీ, టూ. ఉత్తర 1 టే.

ఈ రాశివారికి ఆదాయము 5, వ్యయము 5 రాజపూజ్యము 7, అవమానము 7 అయినవి. సంవత్సరాదినుండి పుష్య శు 13 వరకు చతుర్థగురుడు అశుభుడు. ఆపైని పంచమ శుభుడు. సంవత్సరమంతయు పంచమమున శని మధ్యమము. ద్వితీయరాహువు అష్టమ కేతువు అశుభులు అగుటచేతను, పుష్య మాసమువరకు మనోభీతి, కార్యవిఘ్నము, అపజయము, అనారోగ్యము, ఉద్యోగము లందు చికాకులు కలుగును. ఆషాఢ కార్తీక మాసములు చిక్కుగా వుండును. పుష్య మాసము మొదలు అనుకూలముగా వుండి యత్నకార్యసిద్ధి, ధనలాభము, ఆరోగ్యము కలుగును.

### కన్యారాశి ఫలం

ఉత్తర 2-3-4 టో, పా, పీ.

హస్త 1-2-3-4 పూ, ష, ణ, ఠ.

చిత్త 1-2 పే, పో.

ఈ రాశివారికి ఆదాయము 8, వ్యయము 11. రాజపూజ్యము 3, అవమానము 3 అయినవి. సంవత్సరాదినుండి పుష్య శు 13 వరకు తృతీయ గురుడు. ఆపైని చతుర్థగురుడు అశుభుడు. సంవత్సరమంతయు జన్మరాహువు, సప్తమకేతువు, చతుర్థశని అశుభులుగాన అవయోగములు ఎక్కువగానుండుటచే మనోవ్యథ, నిరుత్సాహము, బంధుకలహము, ఆకస్మిక ధననష్టము కలుగును. శని, గురు, రాహువులకు శాంతిచేయించిన కొంత మేలు కలిగించును.

### తులారాశిఫలం

చిత్త 3-4 రా, రీ

స్వాతి 1-2-3-4 రూ, రే, రో, తా

విశాఖ 1-2-3 తీ, తూ, తే

ఈ రాశివారికి ఆదాయము 5, వ్యయము 14; రాజపూజ్యము 6, అవమానము 3 అయినవి. సంవత్సరాదినుండి పుష్యశు 13 వరకు ద్వితీయ గురుడు శుభుడు, అపైని అశుభుడు. సంవత్సరమంతయు తృతీయశని, షష్టకేతువు శుభులు. ద్వాదశ రాహువు మధ్యమము. పుష్యమాసమువరకూ చాలా అనుకూలముగా వుండి, యత్న కార్యసిద్ధి, శత్రుజయము, ధనలాభము, గృహమందు శుభకార్యాచరణ, సంతానమూలక సౌఖ్యముగలిగి ఉత్సాహముగా వుండును. ఆపైన కొంత మనోవ్యథ కలుగును.

### వృశ్చికరాశిఫలం

విశాఖ 4-తో

అనూరాధ 1-2-3-4 నా, నీ, నూ, నే

జ్యేష్ఠ 1-2-3-4 నో, యా, యీ, యూ

ఈ రాశివారికి ఆదాయము 11, వ్యయము 5; రాజపూజ్యము 2, అవమానము 6 అయినవి. సంవత్సరాదినుండి పుష్యశు 13 వరకు జన్మగురుడు అశుభుడు, ఆపైని శుభుడు. చైత్రమాసములో అష్టమ కుజుడు అశుభుడు. సంవత్సరఅంతయూ ద్వితీయ శని అశుభుడు. లాభ రాహువు, పంచమ కేతువు శుభులు అగుటచేతను శుభాశుభ మిశ్రమఫలముల నిచ్చును. చైత్ర, ఆశ్వయుజ, కార్తీకమాసములలోమనః క్లేశము,బంధువిరోధము, అనారోగ్యము, వ్యాపారనష్టమువల్ల పీడ, ధనవ్యయము కలుగును. పుష్యమాసము మొదలు శుభదాయకముగానుండి కార్యసిద్ధి, ధనలాభము కలుగును.

### ధనూరాశిఫలం

మూల 1-2-3-4 యే, యో, బా, బీ

పూర్వాషాఢ 1-2-3-4 బూ, ధ, భా, ఢ

ఉత్తరాషాఢ 1-బే

ఈ రాశివారికి ఆదాయము 14, వ్యయము 11; రాజపూజ్యము 5, అవమానము 6 అయినవి. సంవత్సరాదినుండి పుష్య శు 13 వరకు వ్యయగురుడు. ఆపైని జన్మగురుడు అశుభులు. సంవత్సరమంతా జన్మశని, దశమరాహువు, చతుర్థకేతువు, వైశాఖ, జ్యేష్ఠములు అష్టమమునను, మార్గశిర, పుష్య మాఘములు ద్వాదశజన్మలందున్నూ కుజుడు ఎక్కువ కష్టదాయకుడై యుండును. ముఖ్యముగా మూలానక్షత్రమువారికి చాలా చిక్కుగా వుండును. మనోభీతి, కార్యవిఘ్నము, కుటుంబవిరోధము, జనవిరోధము, కొంచము అనారోగ్యము కలుగును. జ్యేష్ఠమార్గశిర పుష్యములు పీడాకరములైనవి. అందుచేత గురు శనులకు శాంతిచేయించుట మంచిది.

### మకరరాశిఫలం

ఉత్తరాషాఢ 2-3-4 బో, జా, జీ

శ్రవణము 1-2-3-4 జూ, జే, జో, ఖా

ధనిష్ఠ 1-2 గా, గీ

ఈ రాశివారికి ఆదాయము 2, వ్యయము 8 రాజపూజ్యము 1, అవమానము 2 అయినవి. సంవత్సరాదినుండి పుష్య శు 13 వరకు లాభగురుడు శుభుడు. ఆపైని ద్వాదశగురుడు అశుభుడు. తృతీయకేతువు, భాగ్యరాహువు శుభులు. ఆషాఢ శ్రావణములలో అష్టమ కుజుడు అశుభుడు. ఈ రాశివారికి శుభాశుభ మిశ్రమఫలములు కలుగును. ఆషాఢ, శ్రావణ, పుష్య, మాఘ, ఫాల్గుణములు కొంచము కష్టముగానుండి తక్కిన మాసములందు కార్యసిద్ధిజయము, ధనాగమనము,ఉత్సాహము కలుగును. శుభకార్యములుచేయుట, పాల్గొనుట, పుణ్యకార్యములు చేయుట కలుగును.

### కుంభరాశి ఫలం

ధనిష్ఠ 3-4 గూ, గే,

శతభిషం 1-2-3-4 గో, సా, సీ, సూ

పూర్వాభాద్ర 1-2-3 సే, సో, దా

ఈ రాశివారికి ఆదాయము 2, వ్యయం8. రాజపూజ్యము 4, అవమానము 2 అయినవి. సంవత్సరాదినుండి పుష్య 13 వరకు దశమ గురుడు అశుభుడు. ఆపైని లాభమంగు శుభుడై వుండును. లాభశని శుభుడు. ద్వితీయ కేతువు, అష్టమరాహువు పాపులు. అందుచేత కార్తీకము కష్టదాయకమై యుండును. మొత్తము మీద సామాన్యముగా నుండి స్వల్ప శుభఫలము నిచ్చును. ఆశ్వయుజ మాసము శుభకరము. ఇందు యత్నకార్యసిద్ధి ధనలాభము కలుగును.

### మీనరాశి ఫలం

పూర్వాభాద్ర 1 ది

ఉత్తరాభాద్ర 1-2-3-4 దూ, శం ఝ, థ,

రేవతి 1-2-3-4 దే, దో, చా, చీ

ఈ రాశివారికి ఆదాయము 14, వ్యయము 11, రాజపూజ్యము 7, అవమానము 2 అయినవి. సంవత్సరాదినుండి పుష్య శు 13 వరకు భాగ్యగురుడు శుభుడు; ఆపైని దశమరాశి సంచారము అశుభము. జన్మకేతువు, సప్తమ రాహువు, దశమశని పాపులు. శుభ ఫలాధిక్యము, స్వల్ప అశుభము కలుగును. కించిత్తు భయము, కలహము కలిగిననూ వాంఛితార్థసిద్ధి, శుభకార్యాచరణ, ఉద్యోగమందు గౌరవము కలుగును. మార్గశిర పుష్యములు కష్టదాయకము.

# నక్షత్ర ఫలితాలు

[8-4-59 మొదలు 14-4-59 వరకు]

బి. నరసింగరావు

గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| శ బు కే | శు | । | కు |
| | తే 9దీని శుక్రుడు వృషభములో ప్రవేశించును. తే 13 దీని రవి మేషములో ప్రవేశించును మీన, మేష, వృషభ, మిథునములలో చంద్రుడు | | |
| | | | |
| శ | గు | | రా |

*** అశ్విని [చూ, చే, చో, లా] ***

ఈ వారం అవాంతరాలు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభం పొందుతారు. ఆశించిన డబ్బు అందక అప్పు చేస్తారు. సోదరసహాయక కలుగుతుంది. ఆత్మీయులవల్ల నిందలు; దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు, లోహపు సామానుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము. 8 న ప్రమాదసూచన.

*** భరణి [లీ, లూ, లే, లో] ***

ఈ వారము మీకు యోగప్రదము. బంధువుల సహాయముతోనూ, అధికారుల సహాయంతోనూ ఆటంకములను గడిచి ఫలం పొందుతారు. ఆదాయము అభివృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్యదిక్కు నుండి క్షేమవార్త తెలుస్తుంది. విద్యార్థులకు మంచి కాలము. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 9, 10, 11, 12 తేదీలలో ధనలాభము, కార్యసిద్ధి.

*** కృత్తిక [అ, ఈ, ఉ, ఏ] ***

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది. ఆశించిన సొమ్ము చేతికివస్తుంది. నూతన కార్యములు ప్రారంభిస్తారు. కోర్టు దావాలలో అనుకూలత. వుంటుంది. పండిత గోష్ఠి జరిపి నూతన విషయాలు తెలుసుకుంటారు. వారమంతా శుభయోగములతో కూడివుంటుంది. 9, 10, 11, 12 ధనలాభం, కార్యసిద్ధి, పుత్రులలాభాభివృద్ధి విద్యార్థులకు చదువుబాగా సాగుతుంది. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగస్తులకు పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది.

*** రోహిణి [ఓ, వా, వీ, వూ] ***

ఈ వారము వినోదములలో పాల్గొనుట, దధి, క్షీర, మధురపదార్థయుక్త సుభోజనము రజతపాత్రములలో భుజించుట, నీటిపై ప్రయాణముచేయుట, తలిచిన కార్యములలో జయము, తెల్లటి వస్త్రములు కొనుట, మొదలగు యోగములుకలుగును. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, బియ్యము, వెండి, ద్రవపదార్థ జనిత వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. 8 అధిక ఖర్చులు, ఆందోళన.

*** మృగశిర [వె, వో, కా, కి] ***

ఈ వారము ధనధాన్య వృద్ధి, యత్న కార్యలాభము, వివాహాది శుభకార్యములలో పాల్గొనుట, ఇష్టవస్తు లాభము. పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువు బాగా సాగుతుంది. విలుగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు రెట్టింపు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఆప్తులతో విందు, వినోదము.

*** ఆరుద్ర [కూ, ఖ, ఙ, ఛ] ***

ఈ వారము మీకు కార్యభారము ఎక్కువ; రాబడి తక్కువ. గృహావసరములు తీరనందున కలతలు. ఆరోగ్యము చెడుచున్నట్లు సూచనలు కనబడగానే ఔషధచికిత్స పొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతిచేయించుట మేలు. ఉద్యోగస్తులకు కొత్తసమస్యలు; వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. రాజకీయవాదులకు ఆందోళన. 8 న అనారోగ్యము, అధిక ఖర్చులు. 10, 11, 12, 13, పితృవర్గ సహాయము, ధనలాభము, ప్రయాణము.

*** పునర్వసు [కే, కో, హా, హి] ***

ఈ వారము మీకు మిశ్రమయోగము. మొదట్లో నిరాశగావున్నా మిత్రసహాయమువల్ల కార్యలాభము పొందుతారు. ధనలోపమువల్ల ఆందోళన. ఉద్యోగస్తులకు ఏమంత బాగుండదు. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు సాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. వారములో అవయోగములున్నా, మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము, విచిత్రవస్తుసంపాదనవంటి శుభయోగములు కూడా కలవు.

*** పుష్యమి [హూ, హే, హో, డా] ***

ఈ వారము మీరు సహాయము పొందదలుచుకున్న వ్యక్తి మూలముగా కార్యహాని అవుతుంది. ధనాభావము ఎక్కువగా వుంటుంది. ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆధ్యాత్మిక చింతవల్ల దైవముపై భారము వేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వ్యాపారస్తులకు నిరాశ. విద్యార్థులకు మంచి కాలముకాదు. పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, విచిత్రములను చూచుట జరుగును. వారమంతా అవయోగ శుభయోగ మిశ్రమముగా వుంటుంది.

*** ఆశ్రేష [డీ, డూ, డే, డో] ***

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతి



# నక్షత్రఫలితాలు



కూలత ఎక్కువ. యత్న కార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తవి. ఇతరులకు సహాయము చేయబూని సఫలముగాక నిందలు పొందుతారు. ఇచ్చి పుచ్చుకోవడములో వివాదములు వస్తాయి. ఉద్యోగస్థులకు అధికారుల అనాదరణ; తోటివారి సహకారము. వర్తకులకు వారమంతా నిరాశ. వారాంతమున మేలు. విద్యార్థులకు చదువు బాగా సాగదు. కి భార్యకు అనారోగ్యము.

### * మఖ [మా, మీ, మూ, మే.] *

ఈ వారము ఎన్ని ఆటంకములు వచ్చినా, పట్టుదలతో ప్రయత్నించి కార్యసాధన పొందుతారు. ఆశించిన సొమ్ము సమయానికి అందక అప్పు చేస్తారు. డబ్బులు తగిలే ప్రమాదము జాగ్రత్త వల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహ, ఖనిజ వ్యాపారస్తులకు కష్టముతో కూడిన యోగము. గనుల యజమానులకు, యంత్రములు నడుపు నిపుణులకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలుకాలము.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### (మో, టా, టీ, టూ)

మీకు ఈ వారము యోగకాలము. బంధువుల సహాయము, అధికారుల సహాయము కలుగుటచేత వచ్చిన ఆటంకములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. ఆదాయము వృద్ధి అవుతుంది. శాస్త్రప్రసంగాలలో పాల్గొంటారు. కవులు నూతన రచన చేస్తారు. బంధువుల క్షేమవార్త తెలిసి సంతోషము పొందుతారు. విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలం.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈవారము మీకు మంచి భాగ్యయోగము. అనుకున్న డబ్బు చేతికి వస్తుంది. ఇబ్బందులు తీరుతాయి. దావాలలో గెలుపు పొందుతారు. పిల్లల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది. విద్యార్థులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలు కాలము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము వుంటుంది. సంగీత సభలు, కవితాగోష్ఠివంటి వినోదములలో బంధుమిత్రులతో కలిసి పాల్గొని మృష్టాన్న భోజనము, వెండి పాత్రలలో చేస్తారు. శుభకార్యములలో కూడా పాల్గొంటారు. నీటిమీద ప్రయాణము చేయవలసివస్తుంది. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము. విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలు కాలం.

**— ఈ వారము ధరలు: —**

నూలు, వస్త్రములు :- సమస్థాయిలో వుండును.
నూనెదినుసులు:- తగ్గుదలలో వుండును.
ఆహారధాన్యములు:-స్వల్పముగా హెచ్చును.
బెల్లము, పంచదార:- మందముగా వుండును.
చింతపండు:-మందముగా వుండును.
పప్పుదినుసులు :- తగ్గుదలలో వుండును.
బంగారము :-స్వల్ప తేడాలో వుండును.
వెండి :- స్వల్ప తేడాలో వుండును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మనక్షత్రము తెలుగనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయునూ చూచుకొనునది.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈ వారము కూడా గతవారమువలెనే యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తాయి. శుభపుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ప్రయత్నాలు చేస్తారు. వాహన యోగము కలుగుతుంది. ఉద్యోగస్థులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయ విక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా కుటుంబకలహముచే ఆందోళన కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు నటీనటులకు యోగం.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

ఈ వారము రాబడితక్కువ; ఖర్చులు ఎక్కువ. కార్యభారముచే తీరుబడి వుండదు. గృహావసరములు తీరక స్పర్థలు వస్తాయి. ఆరోగ్యము చెడుచున్న చిహ్నాలు కనబడగానే ఔషధచికిత్స పొందడముగ రవికి శాంతిచేయించడము మంచిది. ఉద్యో

స్తులకు క్రొత్త సమస్యలు, వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా సాగదు. వారమంతా భయాందోళనలతో కూడి వున్నా పితృవర్గ సహాయము, కార్యలాభం, ప్రయాణము కలుగును.

## * విశాఖ [తీ, తూ, తే, తో] *

ఈ వారము నిరాశగావున్నా అజ్ఞాత మిత్రసహాయంవల్ల కార్యలాభం అవుతుంది. ఇంట్లోవున్నవారి ఆరోగ్యము చెడుటచే ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమందు లాభము. వారమంతా ఉద్రేకంతో కూడివుంటుంది. విదేశీయుల పరిచయము, అపురూపవస్తు సంపాదన వుంటవి. 8 ఆత్మీయుల అనారోగ్యముచే వ్యథ, అధికఖర్చులు. విద్యార్థులకు చదువుబాగా సాగదు.

## * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము మీకు మిశ్రమయోగము. ఆశించినసహాయము లభించక, అవసరములు తీరక అశాంతి కలుగుతుంది. అయిననూ ఈశ్వరానుగ్రహమువల్ల కష్టములు గడిచి కార్యసిద్ధి పొందుతారు. వర్తకులకు చాలా కాలమునుండి నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ. పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతిగావున్నా నష్టద్రవ్య లాభము పొందుతారు.

## * జ్యేష్ఠ [నో, యా, యీ, యూ] *

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ. ఇచ్చిపుచ్చుకు నేపట్ల వివాదాలు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారాలు అనుకూలించినా ఆ సంతోషము అమిత ఖర్చులవల్ల వుండకుండా పోతుంది. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది. 8 న భార్య ఆరోగ్య భంగము. అధిక ఖర్చులు.

## * మూల [యే, యో, బా, బీ] *

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్న కార్యములకు ఆటంకములు కలుగుతునేవుంటవి. అయిననూ పట్టుదలలో కార్యలాభము పొందుతారు. సోదర సహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలము. 8 న ప్రమాద భయం, అధిక ఖర్చులు.

## *పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]*

ఈ వారము మీకు యోగదాయకము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్యదిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. శుభకార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము కలుగుతుంది. గణిత, జ్యోతిషశాస్త్ర చర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, చిత్రకారులకు, నటీ నటులకు మేలు కాలము. 8 న అధిక ఖర్చులు, ఆపైని ధనలాభము.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఇంట్లో శుభకార్యాలకు ప్రయత్నములు చేస్తారు. పుణ్యకార్యాచరణ, శాస్త్రచర్చలు, ప్రభుత్వసన్మానమువంటియోగములు జరుగుతవి. విద్యార్థులు నూతనాంశాలను నేర్చుకుంటారు. ఇంట్లో వున్నవారి ఆరోగ్యము బాగుపడుటచే ఆందోళన తొలగుతుంది. పిల్లల క్షేమలాభముల కొరకు కొన్నియేర్పాట్లు చేస్తారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా ఉంటుంది.

## * శ్రవణము [జూ, జే, జో, ఘా] *

ఈ వారము మీరుతలపెట్టిన పనులలో జయము పొందుతారు. బంధుమిత్రులతో మృష్టాన్నభోజనము చేస్తారు. వినోదములలో పాల్గొంటారు. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థజనిత వస్తువుల వర్తకులకు లాభదాయకము. నీటిమీద ప్రయాణము చేయవలసివస్తుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీ నటులకు మేలుకాలము.

## * ధనిష్ఠ [గా, గీ, గూ, గే] *

ఈ వారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి వుంటుంది. వివాహాదిశుభకార్యాలోచనలు ఫలప్రాప్తి పొందుతాయి. ఇష్టవస్తు లాభము, పరోపకారమువల్ల కీర్తి కలుగుతాయి. విద్యార్థులకు చదువు చురుకుగ సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభముకలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగదాయకము.

## శతభిషం [గో, సా, సీ, సూ]

ఈ వారము కార్యభారము ఎక్కువ. వింతమాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము వుండును. అకాలభోజనమువల్ల అనారోగ్యము కనబడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. విద్యార్థులకు చదువు బాగా సాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత. 8-న అనారోగ్యము, ఆపైని శుభయోగము, కార్యసిద్ధి.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ]*

ఈ వారము యత్నకార్యములకు ఆలస్యము. వర్తకులకు లాభము తక్కువ. ఆత్మీయుల ఆరోగ్యము చెడుటచే చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్తులకు వనపర్వత ప్రాంతములకు బదలీ అయ్యే సూచనలున్నవి. రహస్యములను కనిపెట్టుటకు నియోగింపబడుతారు. వారమంతా చికాకుగా వున్నా వారాంతమందు అజ్ఞాతమిత్రుని సహాయమువల్ల కార్యసిద్ధి జరుగుతుంది.

## *ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]*

ఈ వారము ధనాభావము ఎక్కువ. ఇతరుల సహాయమువల్ల కార్యసాధన చేదామనుకున్నారో వారివల్ల ఆటంకములు కలుగుతాయి. అయినా ఈశ్వరానుగ్రహంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారి ఆరోగ్యము బాగుండదు. ఉద్యోగస్తులకు ఒత్తిడి. వర్తకులకు నిరాశ. విద్యార్థులకు మంచిరోజులు కావు. వారమంతా ఆందోళనగా వున్నా సజ్జనసాంగత్యము, పుణ్యక్షేత్ర సంచారము, దేవతాదర్శనము, నష్టద్రవ్యలాభము కలుగును.

## * రేవతి [దే, దో, చా, చీ] *

ఈ వారము అనుకూలతకన్నా ప్రతికూలత ఎక్కువ. యత్న కార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తాయి. కోర్టు దావాలు అనుకూలిస్తాయి. పరోపకారానికి ప్రయత్నపడి సాధక నిందలు పొందుతారు. భార్యకు అనారోగ్యము కలుగుతుంది. ఇచ్చి పుచ్చుకొనేపట్ల వివాదాలు. ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహకారము లభిస్తుంది. వారమంతా వర్తకులకు నిరాశ అయినా వారాంతమున స్వల్ప అనుకూలత. విద్యార్థులచదువు బాగా సాగదు.

❀

# బాలసాహిత్యం

## ఉగాదికి స్వాగతం

రమ్ము రమ్ము ఓ వికారి!
రమ్మిదరి కొక్కసారి!
సరాగాల
    పరాగాల
విరికన్నెల
    పరిమళాల
నొకపరి మూ
    ర్కొనగా —
రమ్ము రమ్ము ఓ వికారి!
రమ్మిదరి కొక్కసారి!
కులాసాల
    దిలాసాల
కోకిలముల
    కుహూకుహుల
వీనులార
    వినగా —
రమ్ము రమ్ము ఓ వికారి!
రమ్మిదరి కొక్కసారి!
వయారాల
    మయూరాల
నయవిధాల
    నాట్యమ్ముల
కన్నులార
    కనగా —
రమ్ము రమ్ము ఓ వికారి!
రమ్మిదరి కొక్కసారి!
తియదనాల
    నయగుణాల
పాయసాల
    ప్రసాదాల
తృప్తిదీర
    తినగా —
రమ్ము రమ్ము ఓ వికారి!
రమ్మిదరి కొక్కసారి!
వివాదాల
    విభేదాల
విడిచి, చాల
వితానాల
ఉనికి స్థిరం
    అనగా —
రమ్ము రమ్ము ఓ వికారి!
రమ్మిదరి కొక్కసారి!

 అలపర్తి వెంకటసుబ్బారావు 

# పుత్రవాత్సల్యం

తంగిరాల సుబ్బారావు

అనగనగా ఓ పట్టణం వుంది. ఆ పట్టణంలో పెద్ద వర్తకుడున్నాడు. అతనిపేరు లక్ష్మయ్య. విదేశాలతో వజ్రాల వర్తకంచేసి బోలెడంత ధనం సంపాదించాడు. ముగ్గురు కొడుకులకీ మూడు మేడలు కట్టాడు. తనోమేడు కట్టుకున్నాడు. కొడుకుల్ని పెంచి పెద్దవాళ్లను చేశాడు. పెళ్లి పేరంటాలు జరిపాడు. తాను అరవయ్యోపడిలో పడగానే, కిటుకులన్నీ నేర్పి, వర్తకమంతా కొడుకుల చేతుల్లో పట్టేశాడు. "కృష్ణా! రామా!" అనుకుంటూ హాయిగా కూర్చున్నాడు లక్ష్మయ్య.

ఉన్నట్టుండి హఠాత్తుగా జబ్బు చేసింది లక్ష్మయ్యకు. చచ్చేంతపని అయింది. ముగ్గురు కొడుకుల్నీ దగ్గరకు పిలిచాడు. తన మూడు కోట్ల ఆస్తీ ముగ్గురికీ పంచేశాడు. వజ్రాల కొట్టులో ముగ్గురికీ వాటాలు పెట్టాడు. ప్లీడర్ని పిలిపించి, నుంచున్నపళాన దస్తావేజులు వ్రాయించి, రిజిష్టరు చేయించి పారేశాడు. "మరి, అయితే, ఆ ఉంగరం మాటేంచేశావు నాన్నా?" అని నసుగుతూ అడిగాడు పెద్దకొడుకు, సత్యం.

"ఉంగరం ఒక్కటి, ఉన్నవాళ్లం ముగ్గురం! ఎల్లాగ పంచడం? అమ్మేసి, డబ్బు పంచెయ్యినాన్నా!" అని సలహా యిచ్చాడు రెండో కొడుకు శివం.

"మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి నాన్నగారూ!" అన్నాడు మూడో కొడుకు సుందరం.

కొడుకుల మాటలు విని చిరునవ్వు నవ్వాడు లక్ష్మయ్య. "ఈ ఉంగరం నాకు ప్రాణసమానం. నేను బ్రతికుండగా దీన్ని అమ్మలేను. ఇది నాకెంతో అదృష్టాన్ని తెచ్చిపెట్టింది. దీన్ని అమ్మిపారేస్తే, మర్నాడే మన సిరిఅంతా తుడుచుపెట్టుకుపోతుంది. ఎంతో కష్టపడి సంపాదించాను దీన్ని. ఆఫ్రికాలో 20 లక్షలు పెట్టి కొన్నాను దీంట్లో వున్న వజ్రాన్ని."

"అయితే...ఏం చేద్దామనుకుంటున్నారు దాన్ని?...పెద్దవాణ్ణి కాబట్టి నాకివ్వండి," అన్నాడు సత్యం.

"పెద్దవాడయినంత మాత్రాన ఇవ్వాలని ఎక్కడుంది? పైగా అన్నయ్యకు పిల్లా పీచూ లేరు. నాది బోలెడు సంసారం! కాబట్టి ఆ వజ్రపుటుంగరం నాకివ్వడం భావ్యం నాన్నగారూ!" అన్నాడు రెండోవాడు శివం.

లక్ష్మయ్య మళ్లీ చిరునవ్వునవ్వి, మూడోకొడుకు ముఖంలోకి చూశాడు.

"మీ యిష్టం వచ్చినట్టు చెయ్యండి నాన్నగారూ! ఎవరికిచ్చినా నాకేమీ అభ్యంతరం లేదు," అన్నాడు మూడోవాడు సుందరం.

లక్ష్మయ్య గంభీరంగా ముఖం పైకెత్తి ఇలా అన్నాడు: "నాయనలారా! మీరు ముగ్గురూ నాకు సమానమే. దీనికోసం మీలోమీరు తగవులాడకండి. ముగ్గురిమీదా ప్రేమ సమానం కావటం మూలానే ఎవరికివ్వాలో తెలియడం లేదు... ఓ చిన్నపని చెయ్యండి. ఓ ఏడాది పాటు మీరందరూ దేశయాత్ర చేసి రండి. అప్పుడు ఈ వజ్రపుటుంగరం నాకు తోచినవాళ్లకిస్తాను."

పెద్దాడూ, చిన్నాడూ ఒకళ్ళ ముఖం ఒకళ్లు చూసుకున్నారు. మూడోవాడు ఖంగారుగా "అదేమిటి నాన్నగారూ! మీరిక్కడ జబ్బుతో బాధపడుతూ వుంటే మమ్మల్ని దేశయాత్రచేసి రమ్మంటారేమిటి? నేను వెళ్లను. నాకా వుంగరం అక్ఖర్లేదు. మీకు సేవ చేస్తూ ఇక్కడే వుండిపోతాను," అన్నాడు.

"భయపడకు నాయనా! నాకు రోగం తగ్గుముఖం పట్టింది. నాకేమీ ఫరవాలేదు. నామాట విను. మీరు ముగ్గురూ కూడా వెళ్లండి" అన్నాడు లక్ష్మయ్య.

తండ్రి ఆజ్ఞ ప్రకారం సత్యం, శివం, సుందరం—ముగ్గురూ కూడా దేశయాత్రలు చేసుకొని, ఏడాది తిరగ్గానే ఇంటికి తిరిగి వచ్చారు. లక్ష్మయ్య ఆరోగ్యంగా హాయిగా

## ★ సత్కార్యం ★

వున్నాడు. నవ్వుతూ కొడుకులను ఆహ్వానించాడు. అందరికీ తలంటి నీళ్లు పోయించి, పిండివంటలతో భోజనాలుపెట్టి, మేడమీద కూర్చోబెట్టాడు. ఊళ్ళోవున్న నలుగురు పెద్దల్నీ పిలిపించాడు. అందరిలోకీ పెద్దవాడైన చెంచయ్య అధ్యక్షతను చిన్న సభ జరిపాడు. ఆ సభలో ముగ్గురు కొడుకులూ తమ తమ యాత్రానుభవాల్ని గురించి మాట్లాడారు. అధ్యక్షుడవడం మూలాన చెంచయ్య కూడా ఏవో రెండు ముక్కలు చెప్పాడు.

అప్పుడు లక్ష్మయ్య లేచి: "నాయనలారా! మీరు ముగ్గురూ మీమీ యాత్రల్లో చేసిన ఒక్క సత్కార్యాన్ని గురించి చెప్పండి. ఎవరు గొప్ప సత్కార్యం చేస్తే వాళ్ళకివ్వదలచాను ఈ ఉంగరం," అన్నాడు.

పెద్దవాడు సత్యం హుషారుగా లేచి యిలా చెప్పాడు: "నేను కాశీ వెడుతూంటే, దారిలో నాకో యాత్రికునితో పరిచయం కలిగింది. అతడొక వెయ్యి రూపాయలు నా చేతికిచ్చి దాచమన్నాడు. తాను పదిరోజులు కలకత్తాలో వుండి తరవాత కాశీ వస్తానన్నాడు. అప్పుడు తీసుకుంటానన్నాడు తన డబ్బు. నేనొక్కణ్ణే కాశీ వెళ్లాను. అక్కడ అతనికోసం పదిరోజులూ ఆగాను. కాని అతను రాలేదు. పదిహేను రోజులయింది. అతను రాలేదు. నెల గడిచిపోయింది. అయినాసరే అతను రాలేదు. ఆ వెయ్యిరూపాయలూ పుచ్చుకొని వుడాయించేసి, హాయిగా ఢిల్లీ, కాశ్మీరు వగైరా చూసి రావచ్చును. కాని నేనలా చెయ్యలేదు. నన్ను నమ్మినవానిని మోసం చెయ్యదలచుకోలేదు. చచ్చినా అతను వచ్చేవరకూ కదలకూడదనుకున్నాను. మూడు నెలలు పోయాక అతను వచ్చాడు. అతని డబ్బంతా అతనికిచ్చేశాను. అంతే కాదు, మార్వాడీ రేటు ప్రకారం వడ్డీకూడా యిచ్చేశాను." సంతోషంతో మొహం చేటంత చేసుకుని, వజ్రపుటుంగరం తప్పకుండా తనకే వస్తుందనే ధీమాతో వెళ్ళి కూర్చున్నాడు సత్యం.

తర్వాత రెండోకొడుకు శివం లేచి నుంచున్నాడు. "నేను బర్మా వెడుతూంటే, మద్రాసు హార్బరు దగ్గర చంటిపిల్ల ఒకతె ఓడమీద

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

**బాలల సంఘం**

[సభ్యత్వపు దరఖాస్తు]

GROUP
A లేక B

సభ్యుని (సభ్యురాలి) పూర్తిపేరు (విడివిడి అక్షరాలలో) ....

పుట్టినతేదీ, నెల, సంవత్సరం : జులై 1 నాటికి వయస్సు ....
తండ్రి, లేక, సంరక్షకుని పూర్తి పేరు : ....
ఊరిపేరు, జిల్లా, తాలూకా, పోస్టు [వీధి. నెంబరు] ....
* చదువుతున్న తరగతి, లేక, ఫారము ; ....
పాఠశాల పేరు . ....
ప్రధానోపాధ్యాయునిపేరు (తెలిస్తే) ;

అర్యా :
ఆంధ్ర సచిత్ర వారపత్రిక బాలల సంఘములో నన్ను సభ్యునిగా/సభ్యురాలుగా చేర్చుకొన ప్రార్థన. పైన వ్రాసిన విషయాలన్నీ యదార్థములు.

ఇట్లు

[తేదీ : -1959]

(సంతకము)

* మరా : ఏ పాఠశాలలోనూగాక ఇంటివద్దనే ట్యూషన్ చెప్పించుకొనే బాలబాలికలు కూడా సభ్యులుగా చేరవచ్చు. 'చదువుతున్న తరగతి' అనే విషయానికి ఎదురుగా 'ప్రైవేట్ స్టడీ' అని వ్రాయాలి.

సంచిక: **8-4-59** | ఈ దరఖాస్తు **11-4-59** నాటికి మాకు చేరాలి |

నుంచి సముద్రంలోకి పడిపోయింది. 'అరెరె!' అంటూ అందరూ ఆశ్చర్య పోతూ నుంచున్నారు. నేను దభీలున సముద్రంలోకి దూకి ఆ పసిపిల్లను రక్షించాను. అందరూ నన్ను తెగ పొగిడారు. నా ధైర్యాన్ని మెచ్చు కున్నారు. ఆ పిల్ల తల్లిదండ్రులు చాలా సంతోషించి, నాకు వెయ్యి రూపాయలు బహుమతి యిస్తాన న్నారు. నేను ఆ కనీస మానవ ధర్మానికి ప్రతిఫలం తీసుకోదలచ లేదు." ఇంతకంటే మంచికార్యం ఎవడు చేస్తాడు? ఆ ఉంగరం మన దేలే!— అనుకుని కూర్చున్నాడు శివం.

మూడో కొడుకును పిలిచాడు అధ్యక్షుడు. సుందరం వినయంగా వచ్చి, నుంచుని ఇలా చెప్పాడు: "నేను కాశ్మీరంలో పర్యటిస్తూ, ఓ కొండ ఎక్కాను. ఆ కొండమీద కొన్ని గొర్రెలు మేస్తున్నాయి. ఆ గొర్రెల కాపరి కొండ కొమ్మ మీదున్న చెట్టుక్రింద కూర్చుని జోగుతూ నిద్రపోతున్నాడు. ఇంకో అయిదారు నిమిషాలు అలా వున్న ట్లయితే, తప్పకుండా ఆ కొండ శిఖ రాన్నుంచి క్రిందపడి పప్పుపప్పుగా చితికి చస్తాడు. నేను తొందరగా అతని దగ్గరకెళ్లి చూశాను. ఆశ్చర్య పోయాను! వాడెవడో కాదు, నా పరమశత్రువు. పది రోజుల్రకితం గొర్రెల వర్తకంలో నన్ను మోసం చేసి, డబ్బు దొంగిలించి, నాతో అనవసరంగా విరోధం పెంచుకున్న నీచుడు. 'అయిదారు నిమిషాల్లో చస్తాడు, నా పగ తీరుతుంది—' అనుకున్నాను ఆ క్షణంలో. కాని మరుక్షణంలో నా అభిప్రాయం తప్పని తెలుసుకున్నాను. ఆపదలో వున్నవాడు శత్రువైనా సరే రక్షించడం ధర్మం అని తెలుసుకున్నాను. వెంటనే అతన్ని తట్టిలేపాను. నిద్ర లోంచి లేస్తూ తూలి పక్కన పడ బోయాడు. వెంటనే నేనతని చెయ్యి పట్టుకుని కొండకిందికి పడిపోకుండా రక్షించాను. అతడు చాలా సంతో షించాడు. తన తప్పును క్షమించ మని నా కాళ్లమీద పడి వేడుకు న్నాడు."

సుందరం చెప్పిందంతా విని "సెభాష్" అన్నాడు అధ్యక్షుడు చెంచయ్య. లక్ష్మయ్య కళ్లు ఆనం దంతో మెరిసిపోయాయి. అతను లేచి ఇలా అన్నాడు: "పెద్దబ్బాయి చేసినపని చాలా సామాన్యమైంది. ఆమాత్రం మంచిగుణం లేనివాడు మనిషే కాదు. రెండోవాడు చేసిన పని మంచిదే. వాడి ధైర్యానికి మెచ్చుకోవాలి. కాని ఈ వుంగరం పొందడానికి అంతకన్నా గొప్పపని చెయ్యాలి. అటువంటి పని మూడో వాడు చేశాడు. సుందరం చేసినపని చాలాగొప్పది. మహాత్ములు సైతం దీనిని మెచ్చుకుంటారు. శత్రువుకి కూడా ఉపకారం చెయ్యడం మహ త్తర విషయం. చిన్నప్పటి పద్యం ఒకటి జ్ఞాపకం వస్తోంది:

చంపదగిన యట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు చేయరాదు;
పొసగ, మేలు చేసి పొమ్మనుటే
చాలు,"—

అని ఇంకా ఏదో చెప్పబోతూంటే,

(64 వ పేజి చూడండి)

# తమాషా లెక్కలు

ఓ. వై. కృష్ణమూర్తి — మదనపల్లె

[5-వ ఫారం విద్యార్థి; బాలల సంఘం సభ్యుడు]

ఆకాశంలో రెండు బారులుగా కొన్ని పావురములు విహరిస్తు న్నాయి. పై వరుసలోని పావుర మొకటి, క్రింద వరుసలోని పావుర ములను 'మీ రెంతమం'దని ప్రశ్నిం చగా, 'మీ వరుసలోనుండి మాలో కొక పావురమొచ్చినట్లయితే మీకు రెట్టింపవుతాము. మా వరుసలో నుంచి మీలో కొకపావురము చేరి నట్లయితే మీరు మేము సమాన ముగా ఉంటా'మని జవాబిచ్చేయి. అట్లైన పై వరుస, క్రిందవరుసలలోని పావురములెన్ని?

ఇద్దరు స్నేహితులు ఎక్కడికో పోతుండగా, దారిలో వారికొక ముత్యాల హారము దొరికింది. ఆ హారములోని ముత్యాలను వారిరువురు పంచుకొనగా ఒక ముత్యము మిగిలింది. అంతలో ఇంకొక స్నేహితుడు రాగా వారు ముగ్గురు పంచుకొన్నారు. అప్పుడు రెండు ముత్యములు మిగిలాయి. అలాగే నల్గురు పంచుకొనగా, మూడు ముత్యములు, ఐదుగురు పంచుకొనగా నాల్గు ముత్యములు, ఆరుగురు పంచుకొనగా ఐదు ముత్య ములు, మిగిలాయి. ఏడుగురు పంచు కొనగా సమముగా, నిశ్శేషముగా సరిపోయాయి. అయితే ఆ హారము లోని ముత్యములెన్ని?

[జవాబులకు 64 వ పేజి చూడండి]

# ★ అత్తా తోడికోడలీయం ★

(21-వ పేజీ తరువాయి)

మెల్లిగా ముందుంచిన పండ్లూ, పాలూ, పక్షపాతం లేకుండా పుచ్చుకున్నారు మా అత్తగారు.

మా తోడికోడలూ నేనూ భోంచేసి తమలపాకులపొందానుతోసహా వచ్చి మా అత్తగారి పక్కనే కూర్చొన్నాం. మా అత్తగారు మా తోడికోడ లొచ్చేలోపుగానే అరటిపండ్ల తొక్కలన్నీ పక్కనేవున్న మంచంకిందికి తోశారు. మమ్మల్ని చూస్తూనే "కృష్ణా" అంటూ నేలమీదనే కొత్తనకుంవాల్చారు.

"అదేమిటమ్మోయ్ కిందపడుకున్నారు. పక్కనే మంచంవుందిగా," అన్నది మా తోడికోడలు

"ఆ ఈకట్టె నెక్కడ పారేస్తే ఏంలే"- అన్నారు విరక్తిగా మా అత్తగారు.

"ఇన్నాళ్లూ మీ ఒళ్లు కట్టే. కాని యిప్పుడట్టా కాదే. పాపం పెద్దతనంలో వాతంవస్తే...అవస్తే..." అన్నది అసాధ్యురాలైన మా తోడికోడలు. మా బావగారు వూరుకోమంటూ మా అత్తగారు చూడకుండా నెత్తి బాదుకున్నారు.

"నాకు వాతంరాలేదూ—అవస్థా పట్టంలేదు. నేనెప్పట్లాగే వున్నా. అయినా తెలీకడుగుతాగానీ, వచ్చినప్పట్నుంచీ నా ఒళ్లును గురించీ వాతాన్ని గురించీ చదువుతున్నావేమిటూ గ్రంథం!" అన్నారు బాగా 'హీ' ఔక్కిపోయిన మా అత్తగారు.

"ఆ-ఆనాడు నా లావును గురించి దేశం అంతా చెప్పి మీరు నన్నెగతాళి చెయ్యలా!" అన్నది అక్కసు కడుపులో పెట్టుకున్న మా తోడికోడలు.

"నేనేమీ దేశం అంతా చెప్పలేదు. చూసేవాండ్లకు కండ్లు లేకపోతేగా!"

"కండ్లున్నవాళ్లెవ్వరూ నేను లావుగా వున్నానని ఏనాడూ అన్లేదు—"

"అయితే ఏమిటే నువ్వనేది! నాకండ్లు లేవంటావా! పండ్లు లేవంటే ఒప్పుకుంటాను. దాందుంపదెంచ కండ్లుకూడా లేవంటే ఎట్టాచచ్చేదీ! యీరోజు జబ్బుచేసి నువ్వు చిక్కిపోయావేమోగాని మొదట్నుంచీ నువ్వు లావనేసంగతి అందరికీ తెలిసిందేగా!"

"అదుగో ఆ మాటే నే నడుగుతున్నా- మొదట్నుంచీ మీఒళ్ళు కట్టెలావున్నా, యీరోజు పెట్టెలా వుందని చూసేవాళ్ళందరికీ తెలీదాంట? నన్ను చూసి నవ్వినవాళ్ళే యీరోజు మిమ్మల్ని చూసి నవ్వడం లేదాంట..."

"నవ్వితే నవ్వనీ. నీచేత మాటలు పడమని భగవంతుడు నాముఖాన రాశాడు. తప్పుతుందా!"—

"నాచేత మీరేం మాటలు పడలేదమ్మోయ్. అన్నిమాటలూ నేనే మీచేత బడ్డాను. మా పుట్టింటివాళ్ళు గతిలేనివాళ్ళన్నదీ మీరే. మా పుట్టింటివాళ్ళకు శుచీ, శుభ్రం తెలీదన్నదీ మీరే—

మా వియ్యాలవాళ్లని తిట్టిపోసిందీ మీరే—

నా కోడలికి ముక్కు సొట్టన్నది మీరే.- నా మొగుడు నామాట విని చెడిపోయాడన్నదీ మీరే—

నేను గయ్యాళిననీ, రాక్షసిననీ ఆడిపోసుకుందీ మీరే......"

"ఆగిపోయావేం...! ఇంకా చదువూ. నీనోటి కడ్డేముందీ! ఎన్ని అభాండాలయినా వేస్తావ్.."

"నేనేం అభాండాలు వేయడకలా... ముఖం వుంది, అద్దం వుంది. అనలేదని ప్రమాణం చెయ్యండి..."

"మధ్య నేనెందుకే ప్రమాణం చెయ్యడం. పాపం ఎక్కడుంటే భయం అక్కడుంటుంది. నాకేం!"

"మరి భయంలేనప్పుడు ప్రమాణం చేయడానికేం!" అన్నది లాయరు కూతురైన మాతోడికోడలు.

మా బావగారికోసం వెతికాను... కనిపించలా. ఇద్దరూ రెచ్చిపోతున్నారు. అప్పటికే భయపడుతూనే "వూరుకోండత్తా" అన్నాను. ఆమాట అంటానికి అంతవరకూ నాకు 'ఛాన్సు' యివ్వలా వాళ్లిద్దరూ.

"నన్నూరుకోమంటావేమిటే! అదట్లా నోరుపారేసుకోడం బాగుందా! అసలిందుకే యీ కొంపకు రావడం అంటే నాకిష్టం వుండదు. ఏనాడు మా తోడికోడలు పోయిందో ఆనాడే యీ యింటికీ నాకూ ఋణం తీరిపోయింది."

మా తోడికోడలు వూరుకోలేదు.

"హాఁ యబ్బ..... తోడికోడలుండగా యిద్దరికీ మహా సరిపడ్డట్టు. హాయొవ్వ సంబడం! ఎవరికి తెలీదు!" అంటూ సాగదీసింది మా తోడికోడలు.

"తెలిసే తెలిసిందిలేవే. నా తోడికోడలైనా, మేనత్తైనా ఆవిడే గనక, ఓ మాటన్నా పడుండేదాన్ని. నీలాగా నా తోడికోడలు అత్తను అడుపులు పట్టించలేదు."

"అదుగో ఆమాటే అనొద్దంటా. అత్తను నేనా అడుపులు పట్టించాను! మొగుడు చచ్చిన ఆడబడుచును నానా అవస్థలూ పెట్టి అడుక్కుతినేట్టు చేసింది నేనాంట."

"నేనేం అడుక్కు తినమని పంపలేదు. అడుక్కుతినే బుద్ధులుండేవాళ్ళే అడుక్కుతింటారు. ఇంతకూ దానిపిల్లని నీ పుట్టింటివాళ్లలో యిచ్చుకుందనేగా దాన్నింతగా వెనకేసుకు రావడం?"

"నేనేం వెనకేసుకురాలా. ఆవిణ్ణాగతి చేసినందుకు వూరూ, నాడూ అనుకుంటేనూ......"

"హాఁ యబ్బ... నువ్వు అత్తను పెట్టిన అగచాట్లు ఎవ్వరూ అనుకోనట్టు..."

"మీలాంటివాళ్లు తప్ప ఎవ్వరూ అనుకోలేదు మంచానబడ్డ ఆవిడికి నేను చేసిన చాకిరీ వూరందరికీ తెలిసిందేగా! నిజం నిలకడమీద తెలుస్తుంది..."

"ఆ - తెలుస్తుంది. నీనోటికి భయపడితే, తెలీకేంజేస్తుంది?"

"అదుగో మళ్లీ ఆ మాటే అనోద్దంటూ, నానోరు, నోరు అంటారే. మీ నోటికి భయపడం దెవరు! మీ పేరంటేనే మా పుట్టింటివాళ్లు హడిలి చస్తారాయిరే!"

"నా పేరంటేగాదేవ్, నీ పేరంటేనే నాపుట్టింటివాళ్లు భయపడి చస్తారు. ఎందుకీ సిగ్గులేని మాటలు పోనిస్తూ...... ఎవరైనా వింటే నవ్విపోతారు.. ఎవరికి తెలీదు! ఎవరి నోరెట్లాంటిదో!"

"అందరికీ తెలుసు," అన్నది మాతోడి కోడలు చేతులు తిప్పుతూ. ఇంక లాభం లేదని "నువ్వైనా వూరుకోవమ్మా—" అంటూ మా తోడికోడలు చేయిపట్టుకొని లేవదీసి వంటింటివేపు తీసికెళ్లాను. మా తోడికోడలి కోడలు మా అత్తగారి దగ్గిర కూర్చుని "వూరుకోండవ్వా..." అంటూ బ్రతిమాలింది. అంతా సద్దుమణిగాక బయట్నుంచి మా బావగారు పిల్లిలాగా లోపలి కొచ్చారు. తెల్లారుగట్ల మూడింటికే లేచి వేడినీళ్లు పెట్టింది మా తోడికోడలు మా స్నానాలకు. అప్పటికే స్నానం, గీనం పూరించుకుని మా బావగారు డ్రైవర్ను నిద్ర లేపడానికి వెళ్లారు. రాత్రిజరిగిన దెబ్బలాట పూర్తిగా మర్చిపోయి మా అత్తగారూ, తోడికోడలూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడుకోడం చూసి నేనూ, మా తోడి కోడలి కోడలూ విస్తుబోయాం.

తీరా బయల్దేరేటప్పుడు మా బావగారి తోబాటు మా తోడికోడలు కూడా వస్తే బాగుంటుందనిపించింది. కాని చంటిపిల్లాణ్ణీ, కోడల్నీ ఒంటరిగా విడిచిపెట్టి ఎట్లా వస్తుంది. పోనీ కోడల్నీ, పిల్లాణ్ణీ కూడా కొండకు పిల్చుకెడితే! అయినా నేనుగా మాతోడికోడల్ని కూడారమ్మని పిలిస్తే మా అత్తగారి కేం కోపం వస్తుందోనని నోరు మూసుకూరుకున్నాను. తీరా బయల్దేరే ముందు "ఏ మండోయ్ పిల్లాడివి, అబ్బాయివీ కొన్ని ముడుపులు అట్లాగే వున్నాయి. తీసుకెళ్లి హుండీలో వేస్తారా లేకపోతే రేపు మనం వెళ్లినప్పుడు వెయ్యొచ్చంటారా!"

"పోనీ మనంవెళ్లినప్పుడే వేద్దాం. కోడలూరి కెళ్లేలోగా మనం ఎటుతిరిగీ కొండకోసారి వెళ్లాలిగా!"

"పోనీ పిల్లాడికి మొక్కుబడి వుంటే నీ కోడల్నీ, పిల్లాణ్ణీ కూడా తీసుకు రారా," అన్నారు మా అత్తగారు.

"ఆ ఎందుకులే కక్కా. మీకు లేని పోని యిబ్బంది. పైగా అవ్వదగ్గిరుంటం బాగా అలవాటయింది వాడికి"

"పోనీ దాన్నికూడా రమ్మన్నా. అందరం కలిసే వెళ్లొద్దాం. మళ్లీ మళ్లీ వెళ్లడం ఎందుకూ? ఎటూ రేపొచ్చేస్తాంగా!"

"దానిష్టం కక్కా" అంటూ తప్పుకున్నారు మా బావగారు.

"మధ్య నాయిష్టం ఏమిటండోయ్! పోనీ వారంరోజుల తర్వాత వెళ్లేది యిప్పుడే వెడదాం పదండి," అన్నది మా తోడి కోడలు. 'బ్రతుకు జీవుడా' అనుకున్నాం అంతా ప్రయాణమయ్యాం.

కార్లో చోటుంటుందా వుండదా అన్న సందేహం అందరికీ కలిగిందిగాని ఎలాగో సర్దుకూర్చున్నాం. నేను మా అత్తగారికీ తోడికోడలికీ మధ్య కూర్చున్నాను. మా తోడికోడలిపక్కనే, పసిబిడ్డను ఒళ్లో పెట్టుకుని, కోడలు కూర్చుంది. ముందు సీట్లో మళయాళం పక్కన మా బావగారు కూర్చున్నారు. నిండుగావున్న సామానతోనూ, మనుషులతోనూ గర్భిణీస్త్రీలా బయల్దేరింది కారు.

"కక్కా! చుక్కలపర్వతం గాలిగోపురం చూశావా యిక్కణ్ణుంచి కనబడుతుంది. అదుగో ఎడంవైపు లోయలో."

"ఓయబ్బ, లక్షసార్లు చూశాను" అని మా అత్తగారు అంటూండగానే ఢాం అంటూ పేలింది మళ్లీ. "ఓయమ్మ" అంటూ వులిక్కిపడి నన్ను పట్టుకున్నారు మా అత్తగారు.

మా అత్తగారు కూర్చున్నవైపు టైరే మళ్ళీ పంచరయింది. నేను నవ్వాపుకోలేక సతమతమయ్యాను. మళ్ళీ ఏ ఇనపమేకో టైర్లో దిగుంటుంది. లేక టైరే "బరస్టయి" వుంటుంది. అయినా మాఅత్తగారుకూర్చున్న వైపే రెండుసార్లూ పంచరుగావాలా! మా తోడికోడలు మూతికి పమిటకొంగు అడ్డం పెట్టుకుని నవ్వుకుంది.

"మళ్ళీ ఏ మొచ్చిందే" అన్నారు మా అత్తగారు.

"ఏంరాలేదు. టైరు పంచరైంది" అన్నాను.

"అయ్యో నీటైరు దొంగల్దోలా. యిదేం టైరూ. యిదేం కారూ. మాట మాట్లాడితే ఢాం ఢాం అంటూ పేలిపోతుందేమిటే

# ★ అత్తా తోడికోడలీయం ★

విధవకారూ” అని విసుక్కుంటూ మాతో పాటు కారు దిగారు మా అత్తగారు.

“టైరు పంచరయితే కాలేం జేస్తుంది కక్కా! మరో స్పేర్ టైరు వేసుకోవోయ్” అన్నారు డ్రైవర్‌తో మా బావగారు. డ్రైవర్ భయపడుతూ నించున్నాడు. నా గుండె గతుక్కుమంది. అన్నట్లు వున్న స్పేర్ టైర్ కాస్తా మొదట పంచరయినప్పుడే వేసేశాడు. ఏంచేయడం!

“చూస్తూ నిలబడతావేం డ్రైవర్” అని గద్దించారు మాబావగారు. విధిలేక నేనే చెప్పాను. బయలుదేరిన వెంటనే ఒకటైరు పంచరైందనీ అప్పుడు వేసిన స్పేర్ టైరే యిప్పుడు పంచరైందనీ.

“అట్లాగా. సరే అయితే, ఏదైనా బస్సొస్తుందిగా ఇప్పుడు! అందులో మనం అంతా కొండకెళ్దాం. కారిక్కడేవుంచి, యీపని పిల్లాణ్ణి కాసేపు కారుకు, కాపలావుండమని డ్రైవర్ను దిగువ తిరుపతికి పంపించి టైర్లు రిపేరు చేసుకురమ్మంటే సరి” అంటూ కార్లోవున్న సామాన్లన్నీ కిందికి దించారు మాబావగారు.

“అక్కో, ఆపాతబస్సు ఎన్నడూ ఇట్లా పంచరూ గాలేదూ, పాడూగాలేదు” అన్నారు మా అత్తగారు రోడ్డుపక్కనున్న బండమీద కూర్చుంటూ.

“అందుకనేగా ఇప్పుడు మీ కోసం బస్సులో పోబోతున్నాం,” అన్నది మా తోడికోడలు నవ్వుతూ.

“ఆ–మా కాలంలో బస్సులు గాకపోతే ఈ కార్లన్నీ ఎక్కడున్నాయితే” అన్నారు మా అత్తగారు.

“మా పెదనాన్నకు కారుండేది. చిన్నప్పుడంతా నేనా కార్లోనే తిరిగేదాన్ని.”

“మాకు పెదనాన్నలూ లేరు, కార్లూ లేవు. మానాన్న హయాంలో గుర్రపుసార్టులోనే వెళ్లేవాళ్లం ఎక్కడికి వెళ్ళాలన్నా” అన్నారు మా అత్తగారు మళ్ళీ బిగుసుకుపోయి. మాబావగారికి ఖంగారు పట్టుకుంది.

“ఆ–ఆ–కక్కా వాళ్లనాన్నకు గుర్రబ్బండీ వుండేదట క్యాంపుల కెళ్లడానికి” అంటూ మా తోడికోడల్ని నోరు మూసుకోమని గుడ్లురిమి చూశారు బావగారు. మా తోడికోడలు నోరు “ఆటోమేటిక్ సిస్టమ్” లో పని చేస్తుంది. ఆవిడొద్దనుకున్నా ఆవిడనోరు ఆవిడ కంట్రోల్లో వుండదు.

“ఏమోనమ్మా. నేనెన్నడూ గుర్రబ్బండ్లూ ఎక్కలేదు, ఒంటెద్దుబండ్లూ ఎక్కలేదు” అన్నది తనూ రోడ్డుపక్కనున్న కొండరాళ్ల మీద కూర్చుంటూ. మా అత్తగారి ఒళ్లు భగ్గున మండింది.

“అదేమిటే! గుంటూరుజిల్లావాళ్లకు గుర్రబ్బండ్లూ, ఒంటెద్దుబండ్లూ గాకపోతే విమానాలెక్కడున్నాయే తిరగడానికి,” అన్నారు మా అత్తగారు.

“దానిముఖంలే కక్కా! ఒట్టి బడాయి కోరు,” అన్నారు మా బావగారు.

“నేనేం బడాయిలు చెప్పలేదండోయ్. మాక్కారుండేదిగనక చెప్పాను. గుర్రబ్బండీని గుర్రపుసార్టంటూ నేనేంగొప్పలు చెప్పుకోలేదు” అన్నది మా తోడికోడలు.

“అయ్యో శ్రీరామచంద్రా! చిన్నప్పుడంతా అట్లా అనేవాళ్లంగనక యిప్పుడూ పుసిక్కున ఆమాటే వచ్చింది.”

“పోన్లేకక్కా! తప్పేముంది.—నువ్వూరుకుంటావా లేదా!” అన్నారు మా బావగారు మా తోడికోడల్ని నమిలిమింగేట్టు చూస్తూ.

“అంటే అన్నదిలేరా! నేనిహ మాట్లాడన్లే. నోరు మూసుక్కూర్చుంటే పోయే” అన్నారు మా అత్తగారు కొడుకును తృప్తి పరచడానికి.

“నీమాటకేం కక్కా! నేనే దీన్నోటికి భయపడి నోరు మూసుక్కూర్చుంటా ఒక్కోసారి,” అన్నారు మాబావగారు నవ్వుతూ. మా తోడికోడలికి మళ్ళీ కోపం వచ్చేలోగానే, బస్సు వచ్చేసి, మమ్మల్ని బ్రతికించింది.

కొండమీద ట్రావెలర్సు బంగళాలోనే అంతా వుండే ఏర్పాటుచేశారు మా బావగారు.

వెళ్తూనే గుడికెళ్లి స్వామిదర్శనం చేసుకుని, ముడుపులూ, అపరాధ కానుకలు హుండీలో వేసి, పిల్లడి మొక్కుబడికూడా తీర్చుకుని, తిరిగిబంగళాకొచ్చాం. మేమంతా హోటల్నుంచి తెప్పించినభోజనమే చేశాం,

మా అత్తగారుమాత్రం గుడినుంచి అర్చకులు తెచ్చిచ్చిన పులిహోర, దద్ధోజనం, చక్కరపొంగలి, వడలూ వగైరా తీసుకొని భుక్తాయాసంతో క్రిష్ణా అంటూ కాసేపు నడుం వాల్చారు.

ఆమెపక్కనే మా తోడికోడలు కూడా నడుం వాల్చింది. నేను, మా తోడికోడలి కోడలూ పిల్లాణ్ణి నిద్రపుచ్చి ఏమీతోచక స్వామివారి రోజాతోట చూట్టానికి బయలుదేరాం. తోటంతా గులాబీపూలు విరబూశాయి. కాని కోయడానికి లేదుగా! కోసినా పెట్టుకోడానికి అంతకన్నా వీలేదు. మా యిద్దరి ఆడహృదయాలు ఆ పూలు చూసి అల్లాడిపోయాయి. అప్పటికీ పెద్దపెద్ద పూలన్నీ విడిచిపెట్టలేక కోశాం.

కాని భయంవేసింది—ఆ పూలన్నీ మాల కట్టి, మేంవుండే గదిలోవున్న వెంకటేశ్వర స్వామి పటానికే వేద్దామనుకున్నాం. పూలుకోసినందుకు ‘అపచారం’ అంటూ చెంపలేసుకుంటూ తిరిగి బంగళాకొచ్చాం. ఈలోపుగా మా అత్తగారూ, తోడికోడలూ ఏఘట్టంలో వున్నారోనని భయపడుతూనే వచ్చాం.

కాని తీరా బంగళాకొచ్చి, వాళ్లిద్దర్నీ చూసి, మా కండ్లని మేమే నమ్మలేకపోయాం, “కలయో! వైష్ణవమాయయో” అన్నట్లు. మా అత్తగారూ మాతోడికోడలూ పడీపడి నవ్వుతూ, “ఫోండత్తా” అంటే “ఛీ పోగాడిదా” అనుకుంటున్నారు. మమ్మల్నిద్దర్నీ చూసి “రాండే కోడళ్ళూ, మీకు తొందర్లో పప్పన్నం పెట్టే ఏర్పాట్లు చేస్తున్నాం,—” అన్నారు యిద్దరూ ఏకకంఠంతో—

అంటే మా తోడికోడలి అన్నకొడుక్కు మా అత్తగారి పెద్దక్క రెండవ మనవరాల్ని యిచ్చేట్టు, వాళ్లిద్దర్లో ఒప్పందాలు జరిగిపోయాయన్నమాట.

“మరి కట్నంమాటా ?” అన్నది మా అత్తగారు.

“ఆ కట్నమూ లేదు, కాకరకాయా లేదు. మీరుండండత్తా. మా అన్నను నేను ఒప్పిస్తాను. పరాయివాళ్ళం గనకనా! అంతా బీరకాయపీచేగా!” —అన్నది మా తోడికోడలు.

“అంతేలే. అయినా వున్న ఆస్తంతా మా అక్క యింకెవరికిస్తుంది? ఆ యిద్దరు మనవరాళ్లకేగా!— అయితే పెళ్ళి కొండమీదనేగా.”

“ఆహా—మా అన్నపిల్లల పెళ్లిళ్ళన్నీ కొండమీదనే—”

“ధన్యోస్మి. ఎవరా అదృష్టవంతులు!— ఏమి నాభాగ్యంబు!... మీరిరువురూ కలిసి ఒకానొక శుభకార్యంబు తలపెట్టుట అపూర్వం, అద్భుతం, ఆశ్చర్యం!

పరా: ఆలస్యం అమృతం విషం... ఆశుభకార్యం బేదో సత్వరంబు కానిండు,” అన్నారు మా వెనకనించి వచ్చిన బావగారు.

“అదేమిట్రో నరం...నాటకం భాష మాట్లాడుతున్నావ్!” అన్నారు మా అత్తగారు నవ్వుతూ.

“అవును కక్కా! నిజంగానే, నేను నాటకంలో ‘బుస్సీ’ వేసి ఒక్కో అరుపు అరుస్తుంటే, హాల్లోవుండే జనంఅంతా హడిలి

చచ్చేవాళ్లనుకో. పిల్లలు పాలుతాగడం మానేసి, గోలగా ఏడ్చేవాళ్లు కక్కా!" అని మా బావగారు చెబుతుంటే మేము నవ్వకుండా వుండలేకపోయాం.

"ఎట్లాగూ! అయితే మరి నీ పెళ్లాంచేత గూడా ఒక వేషం వేయించలేకపోయావుట్రా," అన్నారు మా అత్తగారు నవ్వుతూనే.

"ఆ-నా ముఖానికదొక్కటే తక్కువ," అంది మా తోడికోడలు, మూతి ముడుచుకుని.

"అబ్బే. నాటకాల్లో సొంత పెళ్ళాం పక్కనుంటే నటన రాణించదు కక్కా! అయినా నా పెళ్ళాం నిత్యజీవితంలో కాకలుతీరిన కథానాయకేగాని నాటకరంగానికి అనుఖం కొత్త." అంటూ మా బావగారు మా తోడికోడల్ని ఏడిపించడం మొదలెట్టారు.

"పోనెండి, మా ముఖాలవీ.వింజెస్తాం!"

"ఆ నీదంతా చోద్యమేమరీనూ, వాడేదో ఎగతాళికంటేనూ.."

"ఆయీ రోజు ఎగతాళికంటం గాదులే. ఎప్పుడూ వుండే. ఆయన అందానికీ, రంగుకూ నేను తగనని, తను అనేదిగాక, అందరిచేతా అనిపించాలా!"

"నువ్వే చెప్పు కక్కా! నా అందానికి, ఆ కాణానికీ యిది ఏమాత్రం తగదని నా పెళ్లప్పుడు అందరూ అన్నదేగా," అన్నారు మా బావగారు పెళ్ళాన్నేడిపించడంలో ఒళ్ళుమర్చిపోయి.

"ఆ-ఎవరిమాట దాకానో ఎందుకూ! యీ మీకక్కే అంది," అన్నది మా తోడికోడలు.

"నేనేమీ అన్లేదమ్మోయ్" అన్నారు మా అత్తగారు ఖంగారు పడుతూ.

"ఆ అనకేం లెండి. అన్నీ అన్నారు. మా చెల్లెలి పెళ్ళికొచ్చినప్పుడు మా పెరట్లో వున్న సపోటా చెట్టుకింద కూర్చుని మీరూ మీ తోడికోడలు మాట్లాడుకోలా! నేను మీ అబ్బాయికేమాత్రం తగననీ, మా వంశం అంతా అనాకారనీ."

"ఏమిటే మహా చూసినట్టు, వినినట్టూ మాట్లాడుతున్నావ్. అహా. తెలీకడుగుతా గానీ, నీ యింటికొచ్చి పట్టుమని ఓపూటైన వుండనీ నేను, మీ పెరట్లోవున్న సపోటా చెట్టుకింద తీరిగ్గా కూర్చో వచ్చానంట మరి అభాండాలు వేయడం నీ కలవాటుగాకపోతేనూ" మా బావగారు మెల్లిగా అక్కణ్ణుంచి జారుకున్నారు.

"నేనేం అభాండాలు వేయడం లేదమ్మోయ్ అని లేదంటం మా వంశంలో లేదు" అన్నది మా తోడికోడలు.

"ఆ. ఏం వంశమో మాయదారి వంశం పోనిద్దూ" అన్నారు మా అత్తగారు మూతి మూడు వంకలు తిప్పి మా తోడికోడలు తారాజువ్వలా లేచింది.

"మాది మాయదారి వంశం. సరే ఒప్పుకున్నాను. మళ్లీ ఆ మాయదారి వంశంలో పిల్లాడే ఎందుకొక్కవల్సి వచ్చాడూంట మీ అక్క మనవరాలికి" అంటూ నిలదీసింది మా తోడికోడలు.

"నాకెవ్వరూ కావలసిరాలేదు తల్లీ ప్రస్తాపనొచ్చింది గనక అన్నాను. నీకూ నీ వంశానికి ఒక్క నమస్కారం" అంటూ మా అత్తగారు శరీరాన్ని ఒక్క ప్రదక్షిణ చేయించి లేచి లోపలికెళ్లారు. మా తోడికోడలు కూడా లేచి నిలబడ్డది. "నా వంశానికేం నిక్షేపంలాంటి వంశం ఎటొచ్చీ ఖర్మం జాలక మీ రాక్షసివంశంలో వచ్చి పడ్డానే గాని..."

మా అత్తగారు లోపల్నుంచి అందుకున్నారు!

ఎవరిదే రాక్షసి వంశం! ఎవరిదంట. బలవంతంగా అత్తను బకెట్లో కూర్చోబెట్టి భావిలో దింపింది ఏ రాక్షసే!"

"హయ్యో హయ్యో, మీ అన్యాయం కూలం. యింత అన్యాయమా! తల్లి మాటలు విని నన్నన్యాయంగా బకెట్లో పడేసి భావిలో దించింది మీ అబ్బాయా! నేనా"

"వాణ్ణెందుకంటావే నోర్మూని ధర్మరాజూ"

"ఆ—మీ నోరుకాస్త అరువిస్తారని."

"నీనోటి ముందు నానోరేం పనికొస్తుందే. నా వంశాన్నంతా పాడలగొట్టిన నోరు నీదీ."

"మీ కౌరవవంశాన్ని పాడలగొట్టడం ఎవరి చేతవుతుందీ. పాడిలిచస్తారు. నేనొక్కత్తెనే మొండికెత్తాను."

"కౌరవవంశం మీదిగాని మాది గాదేవ్. మాది నోర్మూని పాండవ వంశం."

## ★ అత్తా తోడికోడలీయం ★

"మరి ఆ కౌరవవంశంలో వాడి మెడకే మీ పాండురోగప్పిల్ల నెందుకు అంటగట్టాలని చూస్తున్నారు."

"మా పిల్లకు పాండురోగమూ లేదు, మీ ఉబ్బసప్పిల్లాడి కివ్వనూ యివ్వం" అంటూ మా అత్తగారు మళ్ళీ లోపలికెళ్లారు.

"మీ పిల్లాడికి ఉబ్బసమూ లేదు. మీ దిక్కుమాలిన సమ్బంధం మా కొద్దనూ వద్దు" అంటు మా తోడికోడలు కూడా లోపలికెళ్లిపోయింది.

గాలివాన వెలిసింది! కాని అన్యాయంగా కుదిరిన సమ్బంధాన్నీ, కాబోయే పెళ్ళినీ వీళ్ళిద్దరూ పోట్లాడుకుని చెడగొట్టారే అని బాధపడ్డాను. మా బావగారు మెల్లిగా లోపలికొచ్చారు.

ఆయనకు టైమింగ్సు బాగా తెలుసు వనిపించింది. ఆ ప్రాంతాల్లోనే వుండి వుంటా రంత వరకూ. ఉన్నట్టుండి మా అత్తగారు సామానంతా తెచ్చి హాల్లో పడేస్తూ, "బయిల్దేరవే. ఇంక దీనిముఖంజూస్తూ యిక్కడొక్కక్షణం వుండను" అన్నది.

మరోవైపునుండి బట్టలసంచీ, పిల్లాడు ఆడుకునే బొమ్మలూ అన్నీ తీసుకుని వచ్చి హాల్లో పడేస్తూ. "బయల్దేరండి ఇంక యీమాటలు పడుతూ ఒక్క క్షణం వుకడలేను" అన్నది మా తోడికోడలు.

మా బావగారు తలబట్టుకుని కూర్చున్నారు.

నేను మా తోడికోడల్ని బ్రతిమాలి ప్రయాణం మాన్పించే సరికి తాతలు దిగొచ్చారు. మా తోడికోడలి కోడలు చిన్నపిల్లయినా ఎంతో యిదిగా మా అత్తగార్ని బ్రతిమాలి, తెల్లారగట్ల సుప్రభాతం చూసిపోదామని నచ్చచెప్పింది దగ్గర కూర్చొని.

ఆ రాత్రి నిద్రపోయేదాకా మా అత్తగార్ని, మా తోడికోడల్ని, ఒకచోట చేరకుండా నేనూ, మా తోడికోడలి కోడలూ చెరోకళ్ల దగ్గిరా కాపలావుండాల్సొచ్చింది.

సుప్రభాతానికి వెళ్లడానికి తెల్లారుగట్ల రెండింటికే లేచాం—

పిల్లాడిఏడుపూ, మా తోడికోడలి జోలపాటా, మా అత్తగారి గోవిందనామాలూ కలిసిన నేపథ్యసంగీతంతో స్నానాలు ముగించుకొని, అందరికంటే ముందే గుడి దగ్గిరికెళ్ళాం. తలుపులుతీయడానికి కాసేపూ; అర్చకులకోసం కాసేపూ కాచుకున్నాం "కౌసల్యా సుప్రజారామా" అని ఆరంభిస్తూనే మా అత్తగారు మైకంవచ్చి పడిపోయారు. అందరం ఖంగారుపడిపోయాం.. అంతకుముందునుంచీ కడుపులో వికారంగా వుందంటూన్న మా తోడికోడలుకూడా తల తిరుగుతోందని పడిపోయింది. ఇద్దరూ ఒక్కసారిగా అట్లాపడిపోవడంచూసి, అందరం నోటమాట లేకుండా కొయ్యబారిపొయ్యాం...

"ఏదో అపచారం జరిగివుంటుంది"... అని అక్కడున్న వాళ్లంతా అనుకోడం వినిపించింది.

"అసలే వాతశరీరాలూ, పైత్యతత్వాలూ. తెల్లవారుఝామున లేచేసరికి, నిద్రచాలక మరికాస్త పైత్యించాయి శరీరాలు" అంటూ కాసిని చన్నీళ్లు యిద్దరి ముఖంమీదా చల్లారు మా బావగారు.

కాసేపటికి యిద్దరూ మెల్లిగా లేచి కూర్చున్నారు. ఒకళ్ల ముఖాలు ఒకళ్లు చూసుకున్నారు. "అపచారం వెంకన్నా, అపచారం జరిగింది నాయనా" అంటూ రెండు చెంపలూ ఫెళ్లుఫెళ్లున కొట్టుకున్నారు మా అత్తగారు.

"అపచారం వెంకట్రమణా! అపచారం అయింది తండ్రీ!" అంటూ ఫెడేల్ ఫెడేల్ మని కొట్టుకుంది రెండు చెంపలూ మా తోడికోడలు. 'దీని భావమేమి తిరుమలేశ' అన్నట్లు మేమంతా వాళ్ళిద్దర్నీ చూస్తూ వుండిపోయాం.

"చూశావంటే, పదరవాకే, పదరవాకే అంటే వింటావా! మనం ఎన్నుకుంటే ఏం. మాటిచ్చాం వెంకన్నకు. ఆయనూరుకుంటాడా! కొండమీద పెళ్ళిచేద్దాం అనుకున్నామా, లేదా."

"అవును; అనుకున్నాం," అన్నది మా తోడికోడలు నీరసంగా తలూపుతూ.

"నీ యిష్టం వచ్చినట్లు వాగావు. యిప్పుడైనా తెలిసిందా! వెంకన్నకు కోపం వచ్చిందే" అన్నారు మా అత్తగారు.

"అదే; అదే; నేనూ ఆమాటే అనుకున్నా. లేకపోతే ఎన్నడూ లేంది నేనిట్లా తలతిరిగి పడిపోవడమేమిటే" అన్నది మా తోడికోడలు—

"పోనీలే, యిదీ ఒకందుకు మంచిదయింది. ఆ పెళ్ళేదో త్వరగా కానివ్వండి" అన్నారు మా బావగారు నవ్వుతూ.

"ఏమే ఏమంటావ్!" అన్నారు మా అత్తగారు.

"నేనంటానికేముందత్తా! అంతా అదుగో ఆ ఏడుకొండలవాడి దయ!—వెళ్తూనే మా అన్నకు జాబువ్రాసి, శుభలేఖలు వేయించమంటాను"—అంటూండగానే సుప్రభాతం అయిపోయింది. బంగారు వాకిలికి వేసిన తెర తొలగించారు.

"గోవిందా గోవింద" అంటూ అందరం శ్రీనివాసమూర్తి దర్శనం చేసుకున్నాం.

కొండదిగి వచ్చినంతసేపూ—కాబోయే పెండ్లికి దూరాభారంలో వుండే బంధువుల్ని ఎవరెవర్ని పిలవాలో, ఎవరొస్తారో, ఎవరురారో మొదలయిన విషయాలన్నీ మాట్లాడుతూనే వచ్చారు మా అత్తగారూ, తోడికోడలూనూ. ఆరోజువాళ్లింట్లో వుండిపొమ్మని ఎంతో బ్రతిమాలింది మా తోడికోడలు—మా అత్తగారు మెత్తబడ్డారు. బాబోయ్, నా గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. వాళ్ళిద్దరితోనూ దినగండం నూరేండ్లాయు షుసమాచారం. మళ్ళీ అగ్ని పర్వతాలు బ్రద్దలు గాకముందే, అక్కణ్ణుంచి బయటపడా లనిపించింది. మా బావగారికీ అదేభయంలా వుందపాపం! ఎందుకు లేవే. మళ్లీ పెళ్లికి వస్తారు గా" అన్నారు మమ్మల్ని సాగనంపుతూ. అన్నట్లు మేం గనక ఆరోజు అక్కడ ఆగితే ఆపెళ్ళికూడా మళ్ళీ ఆగిపోతుంది అని నాభయం. ఇంక జన్మలో మావారు లేకుండా తిరుపతి వెళ్ళడం ఆట్టే క్షేమంగాదనిపించింది.

ఇంటికొచ్చిన వారంరోజులకల్లా పెండ్లి పత్రికలొచ్చాయి. మా అత్తగారి ముఖం సంతోషంతో చాటంతయింది.

"ఏమైనా, ఎన్నన్నా, ఒక్క నోరుతప్ప విడిచి, దాని మనసు మంచిదే" అన్నారు మా అత్తగారు. ఈమాటే మా తోడికోడలి ఎదురుగాఅంటే ఆవిడెంత సంతోషించేది.

మొత్తానికి రెండుగ్రహాలు కలిసి శత్రుస్థానంలో చేరినట్లు, మాఘమాసంలో జరగబోయే పెండ్లికి మళ్ళీ మా అత్తగారూ, తోడికోడలూ ఒకచోట కలుస్తారు. ★

ఓం శ్శాంతి: శ్శాంతి: శ్శాంతిః!



# వనితా లోకం





శ్రీమతి ఇందిర

"రాజకీయాలలో స్త్రీలపాత్ర యెట్టిది?" అని నన్నీమధ్యనే బి. యే. చదువుతున్న ఒక సోదరి అడిగితే, నాకు నవ్వొచ్చింది. ఆమె నొచ్చుకుని, చిన్నబుచ్చుకుని, నా వంక ప్రశ్నార్థకంగా చూసింది.

"అదితరవాత చెప్తానుగాని, 'రాజకీయాలలో పురుషుంపాత్ర యెట్టిది?' అనే ప్రశ్న కలుగుతుందా?" అనడిగాను.

"రేపు మా కాలేజీలో యీ విషయంమీద డిబేటు జరుగుతుంది. అందుకనడిగాను" అన్నది. అప్పుడామె కేవో నాలుగుమాటలు సాయంచేశాను. మరునాడాసోదరి డిబేటులో అద్భుతంగా మాట్లాడినదని దరిమిలా ఒక లెక్చెరరు నాతో చెప్పింది. నాకు సంతోషమయింది. అసలు సంగతేమిటంటే, పురుషుల విషయంలో యీ సంశయం కలగదు. స్త్రీల విషయంలో కలిగిందంటే, కారణం?

రాజు=పరిపాలకుడు; రాజ్యము=పాలింపబడేది; రాజకీయము=పాలించే విధానము; (పూర్వం విశిష్ట రాజనీతి ననుసరించేవారు. ఇప్పుడంతా శుక్రనీతి; చాణక్యనీతి) కాబట్టి రాజకీయములు, రాజునకూ రాజ్యమునకూ మధ్య, అనుబంధాయకములుగా, పరస్పర ప్రయోజనకరములుగా వుంటాయి. రాజ్యమనగా ప్రజలు—అనగా సంఘం. కాబట్టి రాజకీయమనగా ప్రజాసేవ. అదియే సంఘసేవ. అంతే! అందులో ఒక వ్యక్తి యొక్క స్వార్థానికి తావులేదు. A=B; B=C; దేర్ ఫోర్, A=C అనే ఆల్జీబ్రా లాటిదానినే జీబ్రా అయినా చెప్పొచ్చు. అంచేత, రాజకీయాలు యీక్వల్ టు సంఘసేవ. ఇదొక గ్రామొఫోను రికార్డు. ఎవరు పెట్టినా తిరుగుతుంది. స్విచ్చి నెవరు నొక్కినా లైటు వెలుగుతుంది. సంఘసేవకు స్త్రీ పురుష భేదమేమిటి? ఇరువురూ సంఘసేవకులే!



ఈ అనంత సృష్టిలో మానవజన్మ మహోత్కృష్టమైనది. మానవునకు విశేష విజ్ఞానముండుటయే ముఖ్యకారణం. శక్తివంతుడు త్రికాలవేది కాగలడు. అలా విద్య, శాస్త్రపరిచయాదుల వల్ల వివేకవిజ్ఞానములు వృద్ధిఅయి, ఆత్మవికాసం కలుగుతుంది. ఆరూ ప్లస్ మూడు=తొమ్మిదీ అనే గణిత శాస్త్రానికిగానీ, హైడ్రొజన్ ప్లస్ ఆక్సిజన్=నీరు అని చెప్పే రసాయనికశాస్త్రానికిగానీ, మరే శాస్త్రాభ్యాసానికిగానీ, స్త్రీ పురుషవిభేదమేలాలేదో, రాజకీయాలకు అంతే!

కాని దురదృష్టమేమంటే, పురుషుడే ప్రధానమన్నట్లూ, స్త్రీకసలు ప్రాధాన్యతయే లేనట్లూ, ఆమధ్య బాగావ్యవహరింపబడింది. ఇప్పుడూ వుంది. అది తప్పు. పురుషున కెన్ని విధులున్నాయో, స్త్రీకీ అన్ని వున్నాయి. పూర్వమలా వర్తించారు. ఇప్పుడిద్దరికీ లేవు. అట్టి నాటి నేటి, ప్రాత క్రొత్తలమధ్య సంధిలో సాంఘిక మార్పులలోనే, స్త్రీ వెనకబడి యుండవచ్చు. లేదా వెనక్కి నెట్టబడి యుండవచ్చును. నేటికీ అలాగే వున్నది. మనం త్వరలోనే చంద్రలోకంలోకూడా కాలు పెట్టబోతున్నాము. ఇట్టిమహాయుగంలో — సవర్ణులూ, అవర్ణులూ అనే భేదాన్ని తొలగబెట్టే సువర్ణ యుగంలో, పురోగమించవలసిన మనమింకొతగిన మోతాదునుమించి, స్త్రీపురుష విభేదాన్ని పాటిస్తున్నాం కాబట్టే, 'రాజకీ

# శ్రీమతి ఇందిర

యాలలో స్త్రీలపాత్ర యెట్టిది?' అనే విషయ చర్చ జరగవలసి వచ్చింది. ఇదే, పురుషుల విషయంలో రాదుగదా!

స్త్రీలు, అభ్యుదయం సాధించలేరనే మూఢవిశ్వాసానికొక సవాలు! ఒక్క రాజకీయాలే యేం కర్మం? భర్తలకు బుద్ధి చెప్పి యుద్ధాలకుపంపిన స్త్రీలు లేరా? స్వయంగా కత్తిపట్టి, రణరంగంలోదూకి వీరవిహారం చేసిన వీరవనితలు లేరా?—— వీరమాతలనూ, వీరవనితలనూ కొల్లలుగా కన్నది పవిత్ర భారతమాత!

స్వాతంత్ర్య మొచ్చినతరవాత మాత్రం? మంత్రులుగానూ, గవర్నర్లుగానూ, రాయబారులుగానూ, మేయర్లుగానూ, శాసన సభ్యులుగానూ, యింకా అనేకపదవుల లోనూవుండి, యెందరుస్త్రీలు మహాప్రతిభతో, ఆదర్శవంతంగా రాజకీయాలను నెరపటంలేదూ? నెల్లూరుజిల్లా వవ్వేరుగ్రామం అందలి పంచాయితీబోర్డు మెంబర్లందరూ స్త్రీలే, దివ్యంగా నడుపుతున్నారు.

కాబట్టి అవకాశాలు కల్పిస్తే, అబలలు సబలలని, నిరూపించి మానవజాతికి మాణిక్యాలవుతారు. ఇప్పటికి జరిగిన స్త్రీజనాభ్యుదయం తొలిదశమాత్రమే! అన్నిరంగాల లోనూ యింకెన్నోరెట్లుగా కృషిజరగాలి. అట్టి అభ్యుదయాశయ లక్ష్యసిద్ధిని మనతరంలోనే చూస్తాం. అందుకిప్పుడు శ్రీమతి ఇందిరగాంధి, కాంగ్రెసుసంస్థ అధ్యక్షురాలు కావడంలాటి సంఘటనలు దోహదములూ-భవిష్యత్తుకు శుభసూచకములూ!

* * *

నిజంగా ఉత్తమశక్తులున్న వ్యక్తులు సంఘంలో, తగుసమయంలో, తగురీతిగా సత్కరింపబడుతూనేవున్నారు. అలా కాని వారుకూడా వున్నారు. అట్టిది కర్మసిద్ధాంతాలతోనూ, ప్రాప్తసూత్రాలతోనూ సరిపెట్టుకోవాలి. అది వేరేవిషయం. ప్రస్తుతం ఉత్తములై, సత్కరింపబడినవారినే యెంచుకుందాం. అట్టివారిలో నెహ్రూ కుటుంబాన్ని అనన్యసామాన్యంగా యెంచుకోవాలి! ఆ కుటుంబంలో ఒకరిద్దరు వ్యక్తులు కాదు-మొత్తం కుటుంబమే మానవసేవకు తమ జీవితాలను అంకితంచేయడం విశేషం! అందులో మహోన్నతంగా! కాన అతి విశేషం! ఆ కుటుంబంలో యే వ్యక్తిచేసిన్న దేశసేవఅయినా విలువకట్టరానిదే! దేశచరిత్రలో వారి త్యాగ సర్వస్వమూ స్వర్ణాక్షరాలతో లిఖింపబడి, కొన్ని పుటలు శాశ్వతంగా వుండిపోతాయంటే సత్యం.

శ్రీ మోతిలాల్ నెహ్రూ అఖిలభారత కాంగ్రెసున కధ్యక్షుడయ్యాడొకప్పుడు.

మళ్ళీ తనతరంలోనే, తన కుమారుడు జవహర్‌లాల్ అదే పదవి నలంకరించాడు. మళ్ళీ జవహర్ తరంలోనే ఆయన కుమార్తె అధ్యక్షురాలైంది. 1929 లో లాహోరు కాంగ్రెసు అధ్యక్షపీఠాన్నుండి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ యిలా అన్నాడు: "జయం మన అధీనం కాదు. కాని జయమనేది సామాన్యంగా వీరులకే దక్కుతుంది. భీరులకు జయం కలగడం బహు అరుదు" అని. అలాగే వారి త్యాగాలకు చిహ్నంగా యీ పదవి వారికయాచితంగా లభిస్తోంది. 'లోకో భిన్నరుచిః' అన్నట్లు వారిని విమర్శించేవారుండొచ్చు. అట్టివారుంటేనే, వీరి మహాశక్తి లోకానికి తెలియవస్తోందంటాను. శ్రీమతి ఇందిరగాంధి మొన్ననే అఖిలభారత కాంగ్రెసుసంస్థ కధ్యక్షురాలయింది. ఆ పదవి అనీబిసెంటుకూ, శ్రీమతి సరోజినీ నాయుడుకూ, నెల్లీ సేన్‌గుప్తకూ, నేడు నాలుగవ స్త్రీ వ్యక్తిగా ఇందిరకూ లభించింది. తొలి ముగ్గుర్ని గురించీ లోక మెరుగును. నేటి ఇందిరను గురించి ముందు ముందు నిర్ణయించుకోవాలి. రేపేం జరుగుతుందో చెప్పలేం. కాని జరిగినదాన్నిబట్టి, రేపేం జరగడానికవకాశ ముంటుందో చూచాయగా ఊహించుకోవచ్చు. నలుబది రెండేండ్ల ఇందిర కూడా, జరిగిన కాలంలో అకుంఠిత దేశసేవ చేసింది. కాన భవిష్యత్తిలకా ఉజ్వలంగా వుంటుందని ఊహిస్తే తప్పేముంది? ఉంటుంది. నేటివరకామె జీవిత విశేషాలను స్థూలంగా కొద్దిగా తెలుసుకుంటే, అందరమూ ఆ నిర్ణయానికే వస్తాం.

త్యాగమయజీవితంలో జరిగే సంఘటనలకు ఘన, మహాఘన, అనే విశేషణాలతో నిమిత్తమేముంటుంది? నిజంగా యెట్టి కార్యాలకీ తొలి బిరుదులుండాలి? స్వార్థరహితంగా, క్షణం వ్యర్థం చెయ్యకుండా చేసేదశ, సాంఘిక సేవలో, ప్రత్యేక సంఘటనలంటూ యేముంటాయి? అన్నీ ముఖ్యమే! ఇందిర జీవితం కూడా అట్టిదే. కాని ఆమె సేవలో ఒక ప్రత్యేక విశిష్టత వుంది. సాంఘికాభ్యుదయంలో ఆమె సేవ అద్వితీయము. ముఖ్యంగా అట్టి ఉచ్చస్థితీ, ఉన్నత పదవులూ కైవసమయిన కుటుంబవ్యక్తికి కిట్టిసాంఘికసేవ, అంత ఉన్నతంగా అందిరావడం చెప్పుకోదగ్గది.

ఆమెకు రాజకీయాలలో ప్రత్యేకమైన పెద్ద ప్రవేశమేమున్నదీ? అనేదొక ప్రశ్న వుంది కొందరిలో. అసలామె యెవరు? దేశ స్వాతంత్ర్య సముపార్జన శాంతి సమరంలో, సర్వస్వమూ త్యాగంచేసి, వీరవిహారంచేసిన నెహ్రూయోధుల యింటిబిడ్డ! మోతిలాల్ మనుమరాలు. జవహర్‌లాల్ కూతురూ! ఆ తాత తండ్రులవల్ల నామెకు, త్యాగపూరితమైన రాజకీయ సాంఘిక సేవానిరతితప్ప యేమబ్బి వుంటుంది? అదికాక ఆమె ఉనికి ఆనందభవనంలో. అది దశాబ్దాల తరబడి భారత రాజకీయాలకు కేంద్రం. యావద్భారత రాజకీయాలూ ఆ భవనంలోని గోడగోడకూ, దూలందూలానికీ పట్టినాయి. అందున్న వారి ఉచ్ఛ్వాసనిశ్వాసాలలో వున్నవి రాజకీయవాయువులే! పేరువడిన రాజకీయనాయకుడెవరైనా, ఆ భవనంలోనికొకసారయినా వెళ్ళకుండా వున్నాడా? ఇందిర వాని నెరుగకున్నదా? వారి రాజకీయాల నామె ఆకళింపుచేసుకో లేదా? అన్నిటినీమించి 1936 లో మాతృ వియోగానంతరంనుండి నేటివరకు ఆమె తన తండ్రికి సర్వవిధాలా చేదోడు వాదోడుగా వుంటూ, దేశంలోనూ యితర దేశాల్లోనూ, ఆయనతో పర్యటించి, ఆయనతో సమానంగా కాకున్నా, దాదాపుగానయినా, జాతీయాంతర్జాతీయ రాజకీయాల నర్థంచేసుకో లేదంటే అర్థమున్నదా?

1917 నవంబరులో జన్మించిన ఇందిర బహుబాల్యమునుండీ సంఘసేవిక. ఆరేళ్ళ పసిప్రాయమునందే, తన సమవయస్కులను కూడగట్టుకుని, చర్ఖాసంఘాన్ని నిర్మించి, రాజకీయాలలో ప్రవేశించింది. పదేళ్ళ వయసులో, యిరువదేళ్ళలోపు వయసుగల 6,000 మంది పిల్లలను వానరసేన అనే పేరుతో ఒక్క



"క్రొత్త సంవత్సర ఫలితాలకై దేవాలయానికి...."

—చిత్రకారుడు: వెల్లటూరి పూర్ణానందశర్మ.

# ★ శ్రీమతి ఇందిర ★

జట్టును తయారుచేసింది. కాంగ్రెసువర్కర్లు మకాములలో, వారికి భోజనాది సదుపాయ సహాయం చెయ్యడమే వారిపని కాంగ్రెసు జెండాలతో దేశసేవాప్రచారమే వారిపని. ఇది ఆమెలోని అసామాన్య నిర్మాణశక్తిని నిరూపించటం లేదా?

ఆరోజులలో ఆనందభవనంలో ఒక ప్రక్కభాగమంతా ఆస్పత్రిగా తయారయింది. అందులో దేశసేవాఫలంగా, పోలీసులవల్ల తుపాకీగుండు దెబ్బలవల్లగానీ, లాఠీచార్జీలవల్లగానీ, గాయపడినవారికి చికిత్స చెయ్యబడేది. అప్పుడు పన్నెండేళ్ళ ఇందిర చీఫ్‌నర్సుగా వుండి, వారి గాయాలనూ కడిగింది, రోగులకు సేవా చేసింది.

శాంతినికేతనంలోనూ, ఆక్స్‌ఫర్డ్‌సోమర్‌విల్లీ కాలేజీలో విద్య నభ్యసించింది. వెనక అలహాబాదులో మతకలహాలు చెలరేగితే, గాంధీగారు కొందరిని పంపారా మతకలహాల నాపటానికి. వారివల్ల కాకుండుటచే చివరికి ఇందిరను పంపారు. ఆమె సఫలంగా నిర్వర్తించగలిగింది. అప్పుడు గాంధీగారి కానందంకలిగి, "భేష్! నీ విద్యావిజ్ఞానములు వ్యర్థంకాలేదు" అని మెచ్చారు. ఆమె అఖిలభారత కాంగ్రెసులో స్త్రీలశాఖకు ప్రతినిధిగా, స్త్రీజనాభ్యుదయానికి చాలా కృషి చేసింది. రాష్ట్రాల్లోగానీ, కేంద్రంలోగానీ స్త్రీల ప్రాతినిధ్యం హెచ్చాలని పట్టుపటింది. స్త్రీలవిద్య హెచ్చాలన్నది. అందుకు స్త్రీ లెజిస్లేటర్ల సమావేశాలకు ఒక పథకాన్ని గూడా తయారుచేసింది.

కర్షకులు విద్యార్థులు యావద్భారత దేశమునూ తిరిగి అన్నీ ఆకళింపుచేసుకు నేందుకు వీలుగా భారత్ దర్శన్ అనే యాత్రాపథకమామె ప్రోత్సాహమే! కాంగ్రెసుపార్టీ బలపడాలని యువబృందాన్ని నిర్మించింది. అఖిలభారత శిశుసంక్షేమ సంఘానికధ్యక్షురాలుగా ఆమెసేవ గణనీయము. ఇండియా గేట్‌బోట్‌క్లబ్బన కామెయేమూలం. ఆమె కృషియైన బాలసహయోగ్‌లో అనాథ బాలబాలికలెందరో యీనాడు వడ్రంగమూ, కమ్మరపనీ, కుట్టుపనీ, పేముపనీ మొదలయిన చేతివృత్తుల నభ్యసిస్తూ, భావి గౌరవ జీవితాలకు పునాదులేర్పర్చుకుంటున్నారు. ఇప్పుడు విజయచౌకులో పిల్లలకొరకు, పిల్లలే పనిచేసి, పిల్లలే నడిపే రెస్టారెంటు నొకదానిని స్థాపించాలని ఆమె కృషిచేస్తోంది. కొన్నాళ్ళామె తారియింటిదగ్గరలోని కొందరు పిల్లలకు పాఠశాలను నడిపింది. పొదుపువుద్యమంలోనూ, కేంద్ర సాంఘిక సంక్షేమసంఘంలోనూ సభ్యురాలుగా వుండి, అసామాన్యంగా సేవచేసింది.

ఇన్ని వ్యాపకాలలో యిమిడియున్నా, తన గృహనిర్వహణ బాధ్యతలలో కొంచెం కూడా యేమరుపాటు లేదు. ఇంట్లో వంట వగైరా యేర్పాట్లన్నీ స్వయంగా పురమాయించి అజమాయిషీ చేసుకుంటుంది. సామాన్యవేషంతో, నిరాడంబర వ్యక్తి, ఇంట్లో ఇన్ని బాదరబందీలూ, బయట అన్ని రాజకీయాలూ ఉన్నా, ఆమె ముఖమెప్పుడూ మందహాసరేఖావిలసితమై వుంటుంది.

తల్లినుండి పోలికా, విసుగులేని ప్రశాంతతా, తండ్రినుండి సాంఘిక రాజకీయ వేత్తృత్వమూ, సేవానిరతీ పుణికిపుచ్చుకుంది. అట్టి సుకుమారి, భాగ్యశాలి, కష్టజీవి, 21 యేండ్ల వయసులో పదమూడు మాసాలూ, క్విట్ ఇండియా సందర్భంలో మళ్లీనూ జైలుకు పోయింది. రెండేళ్ళక్రితం కాంగ్రెస్ ఎలెక్షన్ కమిటీకి బాహాటంగా జరిగిన బాలెట్ ఎన్నికలలో, అందరికంటె ఇందిరకే ఎక్కువ ఓట్లు లభించాయి. తండ్రి జవహర్‌లాల్ కామెకంటె చాలా తక్కువ ఓట్లు వచ్చాయి. యువకులైన విద్యార్థి దళంతో వెళ్లి, హిమాచల్ ప్రదేశ్‌లో రెండుమాసాల పాటు శ్రమించి, నాలుగుమైళ్ళ రోడ్డు నిర్మాణంలో యీమె నాయకత్వం వహించి, యథాశక్తిని కష్టపడి పనిచేసింది. వెనుక యీమె తండ్రితో రష్యా వెళ్లి వచ్చిన తరువాత, అచ్చట అనేకమంది రష్యనులు తమ పిల్లల పేరులకు ఇందిర శబ్దాన్ని కలుపుకుని యీమెను స్మరిస్తున్నారు.

ఈ విధంగా కష్టం సుఖం, మంచి చెడ్డా, కుడి ఎడమ తెలుసుకొని సర్వసల్లక్షణలక్షిత అనిపించుకున్న ఇందిరాగాంధి అధ్యక్షత వహించడానికి తగు దక్షతగల మహిళ అని గుర్తించి పెద్దలు కాంగ్రెసు మహారథ సారథ్యాన్ని ఆమెకు ఒప్పగించారు. అందుకు తగినట్లు ఆమె ఈ బాధ్యతను ఆదర్శవంతముగా నిర్వహించి, ప్రత్యేకం స్త్రీలకు వన్నె తేగలదు. ప్రభుత్వాన్ని నిలిపి నడిపే పార్టీలో ఇది ముఖ్యపదవి. దీనికి నిరంతరం కృషిచేసినా తీరదు. ఎంత చేసినా, యెన్నాళ్లయినా, ఎప్పుడూ ఒక కార్యక్రమం ఉంటూనేవుంటుంది. అందులో ఇప్పుడు మరీను! అన్నిటికీ మాతృసంస్థయై, స్వాతంత్ర్య సముపార్జనకు సర్వస్వాన్నీ త్యాగంచేసిందొక్క కాంగ్రెసే అయినా, స్వాతంత్ర్యం వచ్చిన తరవాత స్వార్థప్రయోజనాలకోసం, ఆదర్శాలూ, ఆశయాలూ లేకపోయినా, కుక్కగొడుగుల్లాగా వెలసిన వివిధ గ్రూపులతోనూ, ఇతర క్లిష్ట సమస్యలతోనూ వ్యవహరించవలసిన యీ తరుణంలో, ఇందిర బహు నేర్పరితనాన్ని చూపవలసి వుంటుంది. చూపగలదు. ఈమె రాజకీయాలలో నివురుగప్పిన నిప్పు. భారత రాజకీయములామె కవగతములే. పైగా, పైన రాజకీయాలతో మూర్తీభవించిన, సర్వసమర్థుడు తండ్రి శ్రీ జవహార్‌లాల్ ఉండనే వున్నాడయ్యె. కాన ఎటు చూచినా, ఇందిర సారథ్యం దివ్యంగా వుండగలదు. ఉండాలని ఆకాంక్ష! ★

# వనితా వాణి



'సమిష్టి కుటుంబాలలో వ్యక్తుల బాధ్యతలు' అన్న వ్యాసం చాలా బాగుంది. అచ్యుతవల్లి గారు చాలా చక్కగా వ్రాశారు. తోటికోడళ్ళంటే ఒకే పుట్టలో రెండు నాగుపాములు అన్నది లోకరీతిమీద నీతి. ఇందులో ఎవరినీ తప్పట్టి లాభంలేదు. కలిస్తే మంచిదీ, కాకపోతే వేరవడం మంచిది. అది రిష్కారం మంచిదన్నారు.

టి.వి. భానుమతి

*  *  *

కె. వి. ఎస్. అచ్యుతవల్లిగారు వ్రాసిన సమిష్టి కుటుంబాలలో వ్యక్తుల బాధ్యతలు అను శీర్షిక చదివినాను. చాలా బాగున్నది. కాని వారి సూచనలతో నేను ఏకీభవించలేకపోతున్నాను.

కోపల్లె అన్నపూర్ణదేవి (దుర్వానీ నగర్)
(ఎస్. సుశీల మదనపల్లి)

*  *  *

"ఓయమ్మ నీకుమారుడు" అని శ్రీమతి వారణాసి సుబ్బలక్ష్మిగారు వ్రాసిన వ్యాసం కూడా బావుంది. నిజంగా యెవరి పిల్లల అల్లరి వారు భరించకలేకపోతే పరాయివారు యెల్లా భరిస్తారు. యెవరిపిల్లలను వారు అల్లరి చేయకుండా జాగ్రత్తగా పెంచుకోవటం ముందునుండే నేర్చుకోవాలి. వారికి నా అభివందనములు.

డి. లత. (అగిరిపల్లి)

*  *  *

కోమలగారు వ్రాసిన "అలరుల అమరిక" వ్యాసం చాల బాగుంది. ఉన్న తలో ఇంటిని చక్క దిద్దుకోవచ్చును.

వి. యం. లక్ష్మిగారు, "అద్దం మీద పిచ్చుకలు వ్రాలుచున్నవి. ఎట్లు తరుమవలెను" అని అడిగారు. మా ఇంట్లో గూడా ఇలాగే పిచ్చుకలు వచ్చి అద్దం చూసుకొని దానిమీద ముక్కు కొట్టి, రెట్టలువేసి పాడు చేసేవి. మొదట్లో సరదాగా వున్నా, రాను రాను చిరాకేసి మరో గదిలోకి అద్దం మార్చేము, అప్పటి నుంచి మరి వచ్చుటలేదు. లక్ష్మిగారు గూడ అట్లు చేసిన ఎడల "పిచ్చుకల బెడద" వదలగలదు.

సంధ్య (బందరు)

*  *  *

లక్ష్మిగారిక్కి వచ్చిన చిక్కే మాకూ ఒకసారి వచ్చింది.

అద్దానికి తెరకట్టడంవల్ల యీ పిచ్చుకల బాధ తప్పించుకోగలము. తెరకట్టేటప్పుడు పైనమాత్రమే తెరత్రాడు కట్టకుండా క్రింద గూడా కట్టాలి. త్రాడుకు బదులు "ఎలాస్టిక్" రిబ్బనే వాడితే మంచిది. కిటికీలకు తెరలు కడతాం చూడండి! అలా కట్టాలి. అద్దానికి సరిపడే అంత తెర కాకుండా కొద్దిగా తెరవెడల్పు ఎక్కువగా వుంటే కుచ్చులు కుచ్చులుగా వుండి అందంగానూ వుంటుంది. ఎలాస్టిక్ రిబ్బన్ బిగువుగా వుండి పిచ్చుకలు తొలగించుకొను వీలుగా వుండకుండా చేస్తుంది. అద్దం చూచుకొన్న తర్వాత తిరిగి పూర్తిగా అద్దాన్ని మూసెయ్యాలి.

"రొటేటింగ్ మిరర్" అయితే యిలా తెరకట్టాక అద్దాన్ని త్రిప్పేస్తే మంచిది.

ఇలా కట్టాక పిచ్చుకలకు అలవాటు తప్పించను కనీసం ఓ వారం రోజులపాటు (వీలైతేనే) తలుపులు మూసెయ్యాలి. అలా కుదరకపోతే తలుపులు మూసెయ్య నవసరం లేదులెండి.

అద్దాన్ని శుభ్రంగా వుంచాలంటే చిన్న గుడ్డమీద సోడాపొడి (బేకింగ్ సోడా) గాని బియ్యపు పిండిగాని వేసుకుని తడిలేకుండానే అద్దాన్ని రుద్దాలి. కొద్దిసేపు రుద్దితే అద్దం శుభ్రపడ్తుంది. (సోడాపొడితో పని త్వరగా అవుతుంది) ఇలా రుద్దినాక పొడి గుడ్డలోనే అద్దాన్ని తుడిచెసెయ్యాలి.

డి. కోమలాదేవి.
—కాకినాడ.

## ★ మహిళా సంఘాలు ★

కొవ్వూరులో మహిళామండలి స్థాపించి నాలుగేళ్ళు అవుతుంది. కొంత ప్రభుత్వం సహాయంతో, కొంత ప్రజల సహకారంతో యీ మండలి నడుస్తున్నది. కుట్లు, అంటే, చోళీలు, ఫ్రాక్స్, పేంట్లు మొదలైనవాటి గురించిన రకరకాల కత్తిరింపులు, నిట్టింగ్, ఎంబ్రాయిడరీ, క్రోషియా మొదలైనవి నేర్పుతారు. మొట్టమొదట సభ్యురాలుగా చేరేటప్పుడు, అయిదురూపాయలు చెల్లించాలి అంతే యిక మనకు, మనిష్ట మెచ్చిన కుట్టు, వచ్చేవరకూ నేర్పుతారు. ఇచ్చట మూడు ఉషామిషనలూ, ఒక సింగర్, ఉన్నవి. కొత్తగా మిషనుకుట్టడం నేర్చుకునేవారికి ఉషాతో నేర్పి, బాగా వచ్చిన వారికి సింగర్ యిస్తారు. అయితే సింగర్ చాలాబరువు. బాగా అలవాటు ఉంటేగాని త్రొక్కలేము. కుట్టు నేర్చుకునేవారే, బట్ట తీసికెళ్ళాలి. మొట్టమొదట్లో, పేపర్సు, తరువాత, పాతగుడ్డలు తీసికెళ్ళాలి. శ్రద్ధగా నేర్చుకుంటే అయిదారునెలల్లో కట్టింగ్స్, మిషనుపైకుట్టడం వచ్చేస్తుంది. గృహిణుల సౌకర్యం కోసం అని మధ్యాహ్నం పన్నెండుగంటలు మొదలు మూడుగంటల వరకు యీ మహిళామండలి పనిచేస్తుంటుంది. అప్పటినుండి ఓ అరగంట లైబ్రరీలో పుస్తకాలు అవీ చదువుకోవచ్చు. ఇందులోనే గ్రంథాలయంకూడా ఉన్నది. ఎక్కువగా పురాణానికి సంబంధించిన పుస్తకాలే ఉంటవి. ఈ లైబ్రరీకి, అదనపు ఫీజు రెండురూపాయలు కట్టాలి. ఇష్టం ఉంటే అచ్చట గ్రంథాలయంలోనే చదువుకొనవచ్చు. లేకపోతే యింటికూడా తెచ్చుకోవచ్చు. అయితే జాగ్రత్తగా నలపకుండా చదివి యిచ్చేస్తుండాలి.

ఇంకొకవిషయం చెప్పడం మరిచాను. కుట్లు నేర్చుకుని ఉద్యోగం చెయ్యాలనుకునేవారికి, ఎక్కువగా చేతికుట్లు నేర్పుతారు, కత్తిరింపులు, కుట్లు వచ్చినతరువాత పరీక్షకు పంపిస్తారు. పేసయితే, బ్లాక్ డవలప్‌మెంటు ఆఫీసువారు, వారికి తగిన, గ్రామసేవికవంటి ఉద్యోగాలిస్తూ ఉంటారు. అప్పుడప్పుడు పని సరిగా సాగుతున్నదీ లేనిదీ, ఈ ఆఫీసువాళ్ళు వచ్చి తనిఖీచేసి వెళుతుంటారు. శిక్షణపొందిన వారికి తప్పక ఉద్యోగాలు యిస్తారు. మా మండలిలో ఒకరేడియో సెట్టుకూడా ఉన్నది. సంగీతం కావాలంటే అది నేర్పే టీచరుకూడా వేరే ఉన్నారు. వయొలిన్, గాత్రం రెండూ నేర్పుతారు. అయితే దానికి ప్రత్యేకంగా డబ్బుకట్టాలి.

కొత్తపల్లి రాజ్యలక్ష్మి,
(కొవ్వూరు.)

# ★ రాష్ట్రపతి నివాస భవనాలు ★

(33-వ పేజీ తరువాయి)

రయ్యాయి. 28 ఎకరాల వైశాల్యంగల ఈ తోటల్లో ఎక్కడ చూసినా అందమైన పుష్పాలు, చక్కని వృక్షాలు, తీర్చిదిద్దిన పచ్చికపట్టులు, నీటిబుగ్గలు, కుల్యలు కళ్ళకి పండుగచేస్తూ కనిపిస్తాయి. ఈ తోటలు డిసెంబరునుంచి ఫిబ్రవరిదాకా చలికాలంలో ఎంతో మనోహరంగా ఉంటాయి. 1952 నుంచీ చలికాలంలో ప్రతిరోజూ కొన్నిగంటలసేపు ఈ తోటల్ని ప్రజలు స్వేచ్ఛగా చూడవచ్చునని రాష్ట్రపతి ఉత్తర్వుచేశారు.

బ్రిటిష్ దొరతనం రోజుల్లో భవనాన్ని, తోటల్ని ఎప్పటికప్పుడు సుస్నిగ్ధంగా ఉంచేందుకుగాను 7000 మంది సిబ్బంది ఉండేవారు. వీరిలో 350 మంది తోటమాలీలు. కాని స్వాతంత్ర్యం రావటంతో ఈ ఏర్పాట్లు కొన్నిమార్పులు చెందాయి.

రాజాజీ గవర్నరు జనరలుగా ఉండే కాలంలో ఆయన అంత మహాభవనంలోనూ ఒక "మూల"మాత్రమే నివసించేవారు. రాష్ట్రపతీ అంతే. అంతేకాక పొదుపుకోసమని భవనాన్ని మూడుభాగాలుగా చేశారు. రాష్ట్రపతి తాము ఉండటానికి, తమ అధికారిక కార్యకలాపాలకి కుడివైపు భాగాన్ని అట్టే పెట్టుకున్నారు. దర్బారుహాలుఉన్న ముఖ్యభాగాన్ని జాతీయ వస్తుప్రదర్శనశాలగా మార్చారు. ఎడమవైపు భాగాన్ని ప్లానింగ్ సంఘం, కొన్ని ఇతర కేంద్ర ప్రభుత్వశాఖలూ వాడుకుంటున్నాయి.

రాష్ట్రపతి భవనంక్రింద అయ్యేఖర్చులను గూర్చి భారత ప్రభుత్వమూ, రాష్ట్రపతి, ప్రధానమంత్రి ఎన్నో చర్చలు జరిపి, తర్జనభర్జనపడి చివరకు ఆ ఖర్చు తప్పదనే నిర్ణయానికి వచ్చారు. రాష్ట్రపతి నివాసాన్ని మరొక భవనానికిమార్చినా, రాష్ట్రపతి భవనాన్ని చెడకుండా అందంగా ఉంచటానికి ఎలాగూ ఖర్చుచేయకతప్పదు. దాదాపు 6000 మందిదాకా ఉన్న రాష్ట్రపతి సిబ్బందికి వేరే ఇళ్ళు చూపించాలంటే అదనపు ఖర్చుకూడా తగులుతుంది. అందుచేత రాష్ట్రపతి నివాసాన్ని ప్రస్తుత భవనంలోనే ఉంచటానికి ప్రభుత్వం నిశ్చయించింది.

## సిమ్లాలో భవనాలు

సిమ్లాలో ఇదివరకు 'వైస్‌రీగల్ లాడ్జ్' అనబడే భవనాన్ని ఇప్పుడు రాష్ట్రపతి నివాస్ అంటున్నారు. దీన్ని దూరంనుంచిచూస్తే పాతకాలపు కోటలాగా కనిపిస్తుంది. పూర్వం వైస్రాయీ, ఆయన పరివారము వేసంకాలం సిమ్లాలోగడపటం ఆచారంగా ఉండేది. ఆయనకోసం ఈ భవనాన్ని 1888 లో నిర్మించారు.

ఇందులో పెద్దవీ చిన్నవీ అన్నీ కలిపి మొత్తం 360 గదులున్నాయి. మూడంతస్తులున్నాయి. రాష్ట్రపతి నివాస్‌లోకి వెళ్ళగానే ఒకపెద్ద అందమైన హాలు కనిపిస్తుంది. ఇందులోంచి బాత్ రూములలోకి వెళ్ళవచ్చు. ఆహాలులోని గ్యాలరీ 50 అడుగుల ఎత్తు, 90 అడుగుల వెడల్పు ఉన్నది. బాత్ రూమునూ, గ్యాలరీని వేరుచేస్తూ బరువైన ముఖమల్ తెరలున్నాయి.

డ్రాయింగ్ రూము మధ్యలో రెండు వెండి సింహాసనాలున్నాయి. వీటిని 1911లో జరిగిన ఢిల్లీ దర్బారుకోసం చేయించారు.

భవనం చుట్టూ 331 ఎకరాల ఆవరణం ఉంది. అందులో రాష్ట్రపతి సిబ్బంది కోసంగాను 26 గృహాలున్నాయి. 1886 లో ఈ భవన నిర్మాణానికి 38 లక్షలైంది. ఈనాడు అది దానికి 6 రెట్లు విలువచేస్తుంది. బ్రిటిష్ పరిపాలన కాలంలో సిబ్బందిలో 40 మంది యూరోపియన్లు, 800 మంది భారతీయులు ఉండేవారు. కాని ఇప్పుడు ఖర్చు తగ్గించే నిమిత్తం సిబ్బందిని 105 కు తగ్గించారు.

సిమ్లాకు 7 మైళ్ళ దూరాన మషోబ్రావద్ద రాష్ట్రపతి భవనాలలో కల్లా చిన్నదైన వసతి గృహం ఉన్నది. 1840 లో కట్టిన ఈ గృహంలో 16 గదులున్నాయి. చుట్టూ మనోహరమైన ప్రకృతి ఉన్నది. ఆ ప్రదేశం సిమ్లా కంటె మరొకవెయ్యి అడుగుల ఎత్తున ఉన్నది. 1898 నుంచీ దీన్ని వైస్రాయి వాడుకునేవాడు. ఈ భవనం కోటీ రాజాకు చెందినది. భారత ప్రభుత్వానికి శాశ్వతంగా కౌలు కిచ్చివేశాడు.

వేసవిలో రాజధానిని సిమ్లాకు మార్చే ఆచారం ఇప్పుడు లేదు గనుక' రాష్ట్రపతి ప్రతి ఏడాది కొన్ని వారాలపాటు మాత్రం రాష్ట్రపతి నివాస్‌లో ఉంటారు. మషోబ్రాలోని చిన్న భవనానికి సాధారణంగా వెళ్లరు అందుచేత అక్కడ అట్టే సిబ్బంది లేదు.

## హైదరాబాదు భవనం

ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదులో రాష్ట్రపతి నిలయం ఉన్నది. ఇది దేశస్వాతంత్ర్య ఫలితంగా సిద్ధించిన భవనం. వైస్రాయిలు ఎక్కడో ఆరు వేల మైళ్ల దూరానున్న బ్రిటిష్‌రాజుచే నియమించబడిన ప్రతినిధులు. రాష్ట్రపతి అలాకాదు ప్రజలచే ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధి. అందుచేత ఆయన అన్నిప్రాంతాల భారతీయులతోనూ సన్నిహిత సంబంధం కలిగించుకోవలసిన అవసరం ఉన్నది.

విమానాల్లో వెళ్ళేవారికి 'ఢిల్లీ దూర్ నహీ' అని అనిపించవచ్చుగాని సామాన్య ప్రజలకు, ముఖ్యంగా దక్షిణాది ప్రజలకు 'ఢిల్లీ దూర్ అస్త్' అనే అనిపిస్తుంది. అందుచేత రాష్ట్రపతి ఎప్పుడూ ఉత్తరానే ఉంటారనీ, దక్షిణానికి రారనీ ఒకభావం కలగటానికి అవకాశం ఉంది. ఆ అవకాశం లేకుండా చేసేందుకుగాను రాష్ట్రపతి తనకు దక్షిణ భారతంలో ఒక శాశ్వం నివాసం ఉండాలని 1955 లో నిశ్చయించారు. ఈ నిశ్చయం సంగతి తెలియగానే చాలా దక్షిణనగరాలవారు రాష్ట్రపతి తమ ఊళ్ళో ఉండాలంటే తమ ఊళ్ళో ఉండాలని పోటీపడ్డారు. కాని రాష్ట్రపతి హైదరాబాదును ఎంచుకున్నారు. నగరానికి 11 మైళ్ళ దూరాన బొలారంవద్ద ఉన్న బ్రిటిష్ రెసిడెన్సీని తమ నివాసభవనంగా ఉపయోగించ నిశ్చయించారు, హైదరాబాదు సాంస్కృతికంగా, భాషావిషయికంగా, భౌగోళికంగా దేశానికి మధ్యస్థంగా ఉండటం కూడా ఈ నిర్ణయానికి ముఖ్య కారణం.

రాష్ట్రపతి ప్రతిఏడూ 6 నుంచి 8 వారాలదాకా దక్షిణాదిన గడుపుతారు. దక్షిణరాష్ట్రాల రాజధానుల్లో ఎక్కడో ఒకచోట స్వాతంత్ర్యదినోత్సవంగాని, రిపబ్లిక్ దినోత్సవంగాని జరుపుతారు. రాష్ట్రపతి ఢిల్లీనుంచి కదిలితే, సిబ్బందితో సహా కదలవలసిన ఇబ్బంది లేకుండా హైదరాబాదు భవనంలోని సిబ్బంది ఉన్నది.

రాష్ట్రపతి నిలయం 30 ఎకరాల స్థలంలో ఉన్నది. భవనంలో 24 పెద్దహాలులున్నాయి. రాష్ట్రపతి భవనం క్రింద అయ్యే వ్యయాన్ని తగ్గించే ఉద్దేశంతో ఖరీదైన బోలెడు తివాచీలను సిమ్లాలోని భవనంనుంచే తెప్పించారు. కుటీర పరిశ్రమలలో తయారైన వస్తువులతో భవనాన్ని అలంకరించారు. బిద్రీ, నిర్మల్, హిమ్రూలలో తయారైన వస్తువులతో అలంకరించారు. అంతా పూర్తయిన తరవాత రాష్ట్రపతి చాలా సంతోషించి అలంకరణపని చేసిన పనివారికి విందుచేశారు.

భారత జాతీయైక్యతను సుస్థిరం చేసేందుకు హైదరాబాదులోని రాష్ట్రపతి నిలయం ఒక ముఖ్యసాధనంగా ఉపయోగిస్తున్నది. ★

# ★ లౌక్యుడు ★

(28వ పేజీ తరువాయి)

మొగుడుచేత తెల్లవార్లూ దెబ్బలు తిన్న పేకాట రాయుడు నారాయణ పెళ్ళాం.

"అవునామరి. దాన్తో లేచి వచ్చేయడమే! ఇవ్వ! మొన్న మాకోడలు చూసిందిట... ఆ సూరయ్యాగారి సత్తెంతో ఏకగుసగుసల్ట అది—అబ్బ! ఈ నోటితో చెప్ప లేను బాబూ" అంది శేషమ్మ అంతా ఆనోటి తోనే చెప్పేసి.

ఆటలో కూచున్న నరసమ్మకి బల్లెం గుచ్చుకున్నట్టుగా వుంది.

సుభద్రమ్మని తనెరుగు. దానిమొగుడు తాగుతాడని అందరూ ఎరుగుదురు.

మొదట్లో ఈ వూళ్ళోవాళ్ళే 'మొగుడు తాగి కొట్టాట్ట' అని విడ్డూరంగా చెప్పకుని, సుభద్రమ్మమీద చాలా సానుభూతి వొలకబోశారు.

సుభద్రమ్మ మొగుడు తాగుడుకి పెళ్ళాం వస్తువులన్నీ అమ్మేశాడు.

పెళ్ళాం వంటిమీద వస్తువులయిపోడంతో తాగివచ్చి కొట్టే మొగుడు, తాగడానికి డబ్బులేక వస్తువుల్లేని 'అర్థాంగి' వంటిమీద పట్టించాడు. 'వస్తువులు చేయించుకు మరీ రమ్మని' పుట్టింటికి తోలేశాడు.

అతర్వాత రెండు రోజులకి చెరువు గట్టున నరసమ్మతోచాటుగా చెప్పకొని ఏడ్చింది సుభద్రమ్మ: 'కొడుక్కి కాస్త పారం చెప్పమని ఆ 'సత్తా'న్ని అడిగిందట. ఆయనా రెండురోజులొచ్చి తర్వాత మానేసాట్ట. ఇదీ జరుగుత. ఇంతకుమించి ఏం జరి..నా మళ్ళీ జన్మలో పురుగుల్లో పుడ్తా' అని.

ఈ జన్మలో 'ఇంత' సుఖపడ్తున్న సుభద్రమ్మ ఏడుపులోకూడ పునర్జన్మ కోరుకుంది. భారత స్త్రీ మరి! ... వాసన పోదుగా!

'సుభద్రమ్మ నిప్పులాటి మనిషి. ఎవరి క్కావాలి నిజానిజాలు,' అనుకొంది నరసమ్మ.

'కొన్నాళ్లుపోతే నన్నూ...' ఆలోచన సాగలేదు నరసమ్మకి. వొళ్ళంతా జెర్రులు పాకినట్టయింది.

"అమ్మా! సాయంత్రం బండికే ప్రయాణమేవ్ !" అరిచింది నరసమ్మ.

ఎంత సడెన్‌గా వచ్చిందో అంత ఇదిగానూ వెళ్ళిపోయింది.

'కాస్త చలిమిడీ, మిఠాయీ చేసిస్తానుండవే, రేపటిదాకా,' అన్న తల్లిమాటలు కూడా వినలేదామె.

"అంతా కులాసా...?" అన్నాడు కిష్టమూర్తి భార్యని చూసి.

"ఆ..."

"నరుసూ!..." అంటూ రాత్రి దగ్గర జేరినభర్తని ఇట్టే క్షమించగలిగింది నరసమ్మ. ఏదో కాలుజారాడని సర్దుకొంది.

కాని వచ్చిన రెండురోజుల్లోనే పరిస్థితి చాలా దూరంవెళ్ళిందని గ్రహించింది.

ఈసారి కిష్టమూర్తి విషయంకాదు.

కూతురు సంగతి అర్థం కాలేదు. కూతురి ఏ పుస్తకంలో చూసినా వుత్తరాల కట్టలూ, కింద సుందర్రావు సంతకాలూనూ.

'ఎవడీ సుందర్రావూ?' అనుకొంది.

"ఏవిటే ఈ ఉత్తరాలు?" అంది కూతురితో.

"సుందర్రావు రాశాడు లేవే..." అంది యాదాలాపంగా సరోజ.

"సుందర్రావెవడే? ఎందుకు రాయాలి?"

కిటికీలో కూచుని సుందర్రావు గురించి మధురస్వప్నాలు కంటూన్న సరోజ ప్రపంచంలో పడింది. "ఆ... మరే ...అబ్బే, సుందర్రావేనా..." ఎలా పూర్తి చేయాలో తెలీలేదామెకు.

అసలు తల్లి ఇంట్లో లేకపోడంతో సరోజ, సుందర్రావూ అసలైన, సిసలైన 'ప్రేమ'లో మునిగిపోయారు.

ముద్దుగా ఉత్తరాలూ, తియ్యగా కబుర్లూ ......

'నా జీవితచక్రానివి నువ్వు' అనేవాడు సుందర్రావు.

జీవితానికి 'చక్ర వేవిట'న్న అనుమానం తట్టినా వూరుకునేది సరోజ.

'మన ప్రేమకి అడ్డులే,' దన్నాడు సుందర్రావు.

సరోజచూసిన సినీమాల్లో ఈమాట చాలా సార్లు వింది. కాబట్టి అర్థం కాకపోలేదు.

కొంత ప్రేమకవిత్వం చదివి వినిపించాడు. తనూ అల్లబోయాడు.

ఆరోజు రాత్రి నరసమ్మ "ఆ సుందర్రావెవడండీ? ఆ వుత్తరాలేవిటి?—ఏవిటో, 'నా జీవిత చక్రమా, పూల రథమా, గులాబీలన్నీ పోగుచేస్తే నువ్వు మొలిచావు', అంటూ వేవిటి ఉత్తరాల్లో?" అంది.

"అదంతా కవిత్వం లేవే! అతను మన ఎదురింటి నరసింహంగారి అబ్బాయి," అని నవ్వాడు కిష్టమూర్తి.

"నవ్వుతా రేవిటండీ? దాన్ని కాస్త అదుపులో పెట్టండి. అంత పట్టించుకోకుండా కళ్ళుమూసుకూర్చుంటే ఎలా?"

నిజానికి కిష్టమూర్తి కళ్లు మూసుకు కూర్చోనూ లేదూ—పట్టించుకోకుండానూ లేదు.

భార్య పుట్టింటికి వెళ్ళినప్పటినుండి వాళ్ళిద్దరి సంగతీ పూర్తిగా తెలుసు అతనికి.

కిష్టమూర్తిది చాలా 'కాలుక్యులేటింగ్ బ్రెయిన్.'

మొదట్లోనే 'ఊష్' అంటే సుందర్రావులాటి బంగారు పిచ్చుక ఎగిరిపోతుంది.

ఐతే—అది సుతరామూ కిష్టమూర్తికి ఇష్టంలేదు.

కూతురి పెళ్ళికి ఓ మోస్తరు సంబంధానికైనా ఐదారువేలు గుమ్మరించాలి.

అలా వేలు గుమ్మరించాలనీలేదు కిష్టమూర్తికి.

ఇదంతా సత్తెకాలం మనిషి నరసమ్మకేం తెలుసు?

ఓ రోజు కూతురు చెవిలో ఏదోవూదాడు కిష్టమూర్తి.

కూతురు ఊహు సిగ్గుపడిపోయింది-కథానాయకిలా.

అర్థరాత్రి ఎదురింటి నరసింహంగార్ని-సుందర్రావు తండ్రిని-కిష్టమూర్తి లేపాడు.

"ఏవండీ?"అంటూ వచ్చారు నరసింహంగారు.

"మీతో ఓ విషయం మాట్లాడాలి..."

(64-వ పేజీ చూడండి)



# సినిమా

## చార్లీచాప్లిన్ ఉత్తమ కళాసృష్టి

# 'లైమ్ లైట్'

కరుణాకరమైన ప్రపంచలన చిత్రం 'లైమ్‌లైట్'ను కనీ వినీ ఆనందించే మహదవకాశం, ఏడు సంవత్సరాల తరువాత మద్రాసుపౌరులకు తొలిసారిగా గత వారం లభ్యమైంది.

రాజకీయపు రంగు హంగు టద్దాలలోంచి, కరుణాకరుడు చాప్లిన్‌ను 'అరుణా' కరుడుగా చూడబోయిన మెకార్థీలు అతడిని (అన్ అమెరికన్ కమిటీ) రాజకీయ సంబంధిగా బంధించబోయారు. ఈ విధంగా స్వదేశంలో రాజకీయ ప్రచారాహుగ్రస్తమైన చిత్రం 'లైమ్‌లైట్'లోనే చాప్లిన్‌లో కళాకారుడు విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. దేశదేశాలా విజయ యాత్రచేసిన 'లైమ్‌లైట్' సార్వజనీన సార్వకాలిక చిత్రంగా, కరుణరసోద్దీపక కళాఖండంగా, స్నేహానికి భాష్యంగా జోహారులందుకొంది. పూర్వం చాప్లిన్ చిత్రాలు విడుదల చేస్తూవచ్చిన కంపెనీద్వారా (దీనికి ఆయన ముఖ్యవ్యవస్థాపకుడు) ఈ చిత్రం విడుదలచేసే సదుపాయం లేనందువల్ల ఇది మనదేశం రావడం ఆలస్యంఅయింది. (ఇప్పుడు స్వానీ కార్పొరేషను వారు, దక్షిణాదిన ఫ్లోరాఫిలింస్‌వారు దీనిని ప్రదర్శిస్తున్నారు.) 'లైమ్‌లైట్' తరువాత చాప్లిన్‌తీసినచిత్రం, 'ఎ కింగ్ ఇన్ న్యూయార్క్' ఈసారి త్వరగానే రాగలదని ఆశించవచ్చును.

* * *

'లైమ్‌లైట్'సృష్టిలో చాప్లిన్ ప్రజ్ఞ పరాకాష్టను అందుకొంది. దీనికి కథ మాటలూ పాటలూ, సంగీతం మామూలు ప్రకారం ఆయనే వ్రాసుకున్నాడు. ఈసారి విశేషం 'బాలే' (నృత్యనాటికల) కల్పన దర్శకత్వంకూడా నిర్వహించడం. కథ, కథనం, చాప్లిన్ చిత్రావళిని గుర్తుకుతెచ్చుకుంటే కొత్తగా కనిపిస్తాయి.



పాతచిత్రాలలా ఇందులో పొట్టచెక్కలయేట్టు నవ్వరాదు. స్లాప్‌స్టిక్ పుష్కలంగా లేదు. ఇందులో గోచరించే హాస్యం తరహా వేరు. ఇది కరుణరసప్రధానమైన, 'హాస్యరాగ' రంజితమైనకథ. ఈ రెండింటికీ సరిహద్దుమీద గీవిగా నడుస్తుంది. ప్రపంచప్రసిద్ధుడైన చిన్నమనిషి 'చార్లీ', అతనిని కన్నతండ్రి చాప్లిన్‌లు కూడ బలుక్కని, కష్టసుఖాలూ, సన్మానావమానాలూ, వెలుగునీడలూ చూచిన ఒక విదూషకుడి జీవితాన్ని మథించి స్నేహభావాన్ని తీసి పంచిపెట్టారు. ఆరిపోతున్న అతని జీవితంతో ఇంకో జీవితాన్ని వెలిగించి జీవనరాగాన్ని సర్వజన సమ్మోహనకరంగా ప్రస్తరించారు.

జీవితాన్ని పూర్తిగా, నిండుగా, ఎత్తుగా, ఉత్సాహంగా జీవించాలనీ, అందుకు వ్యక్తిలో ప్రగాఢమైన వాంఛ, ఆశాభావం, ఆత్మవిశ్వాసం ఉండాలనీ, జీవితంపట్ల అనురాగమను రాగప్రస్తారమే దానికి ఇతివృత్తమనీ చాప్లిన్ ఈ చిత్రంలో—నిస్పృహలో మునిగిన విదూషకుడిచేత—తెచ్చిపెట్టుకొన్న ఉత్సాహంతో చెప్పించి ప్రేక్షకులకు ఉత్తేజం కలిగించగలిగాడు. ఇది చెప్పడానికే ఆయన ఇందులో కొత్తపద్ధతికూడా అవలంబించాడు.

మామూలుగా షేక్స్‌పియర్ నాటకానికి గుడ్డివాడు వెళ్లినా అతను అంతా తెలుసుకుని ఆనందిస్తాడనీ చాప్లిన్, ఐసెన్‌స్టీన్ చిత్రాలకు చెవిటివాడు వెళ్లినా అంతా పూర్తిగా బోధపడుతుందనీ అంటారు. అందరూ శబ్దంతో చెప్పేదాన్ని నిశ్శబ్దంతో అంతకన్నా గొప్పగా బలంగా చెప్పగలగడం ఈ దృశ్యకావ్యకారుల ప్రత్యేకత. సినిమాలోకి శబ్దం వచ్చినపుడు చాప్లిన్‌కూడా భయపడ్డాడు—దుర్వినియోగం



ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్‌వారి 'ఇల్లరికం'లో జమున.

అయితే చలనచిత్ర కళకు ఇది అరిష్టం తెచ్చిపెడుతుందని.

'ముష్యూర్ వెర్డో'లో ఆయన సంభాషణలను వాడినా బహు పొదుపుగా వాడాడు. అప్పుడు కొంత నొచ్చుకున్న కొందరు అభిమానులు ఈసారి 'లైమ్‌లైట్'లో ధారాళమైన ఉపన్యాసాలే వినబడడంతో చాప్లిన్ అంతటివాడు శబ్దంమీద ఇంతగా ఆధారపడడం తగదని భావించారు. అయితే ఒకసారి బాగా రాణించిన ఒక శిల్పాన్ని ఒక సంప్రదాయంగా, ఆచారంగా, వరవడిగా పరిగణించి, ప్రతిసారి అదే అవధులలో తిరగాలన్న అభిప్రాయం సృజనాత్మకమైన ఏ కళకూ, రోజురోజుకూ పెరిగే ఏ కళాకారుడికీ సరిపడనిది. కాగా, ఈ చిత్రంలో చాప్లిన్ ఇంతగా మాటలాడడం అనేది ఇందులో కథ తత్వాన్ని బట్టి తప్పనిసరి అని ఈ చిత్రం చూచే ఏ ప్రేక్షకుడికైనా తోస్తుంది. పోతే ఈ సుదీర్ఘ సంభాషణలనే పరిహసించి పరిహరించిన పద్ధతి, వాటిమీద పడే ఉద్వేగపు నీడలమీద తెల్లటి యుక్తుల కాంతులు ప్రసరించి అదృశ్యం చేసిన శిల్పం, ఎవరికి ఏ దురభిప్రాయాలున్నా తొలగించివేస్తాయి. ఆయన తూచిచూచి మరీ అంటున్న ప్రతిమాటా మన మనసులో నాటుకొంటుంది...విలువగలమాటకీ, కేవలం వలువగల మాటకీ తేడా కూడా తెలుస్తుంది.

* * *

బేస్ వయొలిన్ క్రింది షడ్జమంలో ఆగుతున్నపుడు టాప్ వయొలిన్ పైపంచమంలో ఆరంభించి సాగిపోవడం—పిందె పుట్టడంతో పువ్వు వాడిపోయి రాలిపోవడం ఈ చిత్రంలో ముఖ్య సన్నివేశం.

నృత్య నాటికా మందిరాలలో హాస్యం చేసి పేరుతెచ్చుకొన్న కాల్వెరో అనే విదూషకుడు ఉచ్చదశకు పెరిగి, ఎక్కడో తన వృత్తిమీద పట్టుతప్పి విరిగిపోతాడు, అతడు ఏమి చేసినా హాస్యం రాణించదు. ప్రేక్షకులకు క్రమంగా దూరమై వెనకబడిపోతాడు. యదాలాపంగా, ఎందుకో తెలియకుండా జీవిస్తూ ఉంటాడు. ఆస్థితిలో అతనికి టెరిస్సా అనే అమ్మాయి జీవనరేఖ యాదృచ్ఛికంగా దగ్గరపడి సమానాంతరం అవుతుంది. తేడా: ఆమె ఆత్మహత్యకు పాల్పడుతుంది. సకాలంలో కాల్వెరో అడ్డుపడి ఆపుచేస్తాడు. "ఏమిటా హడావుడి?" అని మందలిస్తాడు. పోయే ప్రాణాన్ని ఆపగలిగానన్న ఉత్సాహంలో జీవితం ఎంత అద్భుతమైన వరమో, బతకాలన్న కోరిక, బాగా బతకాలన్న ఆశ ఎంత ముఖ్యమో ఆమెకు నూరిపోసి బోలెడు వేదాంతం మాట్లాడి ఆమెను పునరుజ్జీవింపచేస్తాడు. అతని హితబోధవల్ల, ఉపచారంవల్ల టెరిస్సా కోలుకొని తిరిగి రంగస్థలం మీదకు వెళ్తుంది. అచిరకాలంలోనే గొప్ప నర్తకిగా పేరూ, డబ్బూ కూడా గడిస్తుంది. ఆమెను బ్రతికించడానికి తను తెచ్చుకొన్న ఆవేశాన్ని, ఉత్సాహంగా అనువదించుకొని, "వెనకబడ్డ విదూషకుడు" కాల్వెరో కూడా తిరిగి పైకి రావడానికి ఒక ప్రయత్నం చేస్తాడుగాని, అతని 'పాతకాలపు హాస్యం' ప్రేక్షకులకు నచ్చదు. దెబ్బతిని అవమానంతో తిరిగివస్తాడు. టెరిస్సావెంట ఉండడానికి అభిమానం అడ్డువస్తుంది. ఆమె అతన్ని పెళ్లి చేసుకుంటానంటుంది. అందుకు అంగీకరించడు. ఆమెను వదలిపోయి ఎక్కడో పాటలుపాడి జీవనం సాగిస్తూ ఉంటాడు. చివరకు టెరిస్సా, అదృష్టం' మంచిరోజు, నాటకం ప్రొడ్యూసరూ అతన్ని వెతుక్కువచ్చి తిరిగి వేషం కట్టడానికి ప్రోత్సహించి అవకాశం ఇవ్వడం జరుగుతుంది. ఈసారి వెనకబడ్డవాడి పాతకాలపు హాస్యం-ఈతరం ప్రేక్షకులకు కొత్తగా హుషారుగా కనిపిస్తుంది. దానితో పాటు విదూషకుడు కొత్తగా తయారు చేసుకున్న హాస్యసన్నివేశం కూడా (ఇందులో ఒకపుడు ఉజ్వలంగా వెలిగి వెనకపడిన హాస్యనటుడు బస్టర్ కీటన్ పాల్గొన్నాడు.) జనానికి పడుతుంది. హర్షధ్వానాలు మిన్నంటుతాయి. కాల్వెరో ఒక్కసారిగా గొప్పవాడు అవుతాడు. ఆసమయంలోనే, చివరి అంకంలో ప్రమాదంజరిగి అతడు స్టేజిమీదనించి జారి, ఆర్కెస్ట్రాలో ఉన్న ఒక డ్రమ్ మీదపడి అందులో ఇరుక్కుపోతాడు. వెన్నెముక విరుగుతుంది. గుండెపోటు వస్తుంది. మృత్యుఘడియలు సమీపించాయని కాల్వెరో గ్రహిస్తాడు. ఆడ్రమ్‌లో వుండగానే, తనను ఒకసారి స్టేజిమీదకు

# ప్రసాద్ ప్రొడక్షన్స్ వారి రెండవ హిందీ చిత్రం

## ఛోటీ బెహన్

సినీ మోదఖేదాలు రెండూ సమంగా మేళవించుకొన్న కౌటుంబిక చిత్రం 'ఛోటీ బెహన్' (ప్రసాద్ ప్రొడక్షన్స్) గతవారం బొంబాయిలిబర్టీ సినిమాలో విడుదలయింది. ఈ చిత్రంలో కథ, అనేక సన్నివేశాలూ, కాకతాళీయాలూ సినిమా బాటలో కొంత నలిగినవే అయినా, దర్శకుడు ఎల్. వి. ప్రసాద్, రచయిత ఇందర్ జీత్ ఆనంద్, ముఖ్యనటులు బల్ రాజ్ సాహ్ని, శ్యామ, నంద, మహమూద్, రెహమాన్, రాధాకిషన్‌లు దీనిని హృదయంగమమైన రీతిన తెరమీద చిత్రించారు. ముఖ్యంగా దర్శకుడి స్థైర్యం, దీనికి పుష్టినిచ్చింది.



కష్టసుఖాలు రెండూ వంతులు వేసుకున్నట్టు వచ్చే ఈ టాకీలో కథ టూకీగా ఇది: దేవుడంటి ఒకానొక అన్నగారు, తన చెల్లెలు మీనాను, తమ్ముడు శేఖర్‌నూ కళ్ళలో వత్తులు వేసుకు పెంచుతూ ఉండగా, చెల్లెలు మీనా కారు ప్రమాదంలో కళ్ళు పోగొట్టుకుంటుంది. అందువల్ల ఆమె పెళ్ళి చివరిరీలుకు వాయిదా పడుతుంది. అందువల్ల తొలి రీళ్ళలోనే మీనా చిన్నన్నగారు శేఖర్ ఒక కలవారింటి ఆడపడుచు శ్యామను పెళ్ళిచేసుకుంటాడు. జీవితం రెండు రీళ్ళు తిరిగేవరకూ భాభీ శ్యామకు బుర్ర తిరుగుతుంది. భర్త, బావగారూ తన ఆడపడుచు మీనాను మరీ అంత గారాబంగా అపురూపంగా చూసుకోవడం సరిపడదు. తలచింది తావలచిందే కాబట్టి శేఖర్, అన్నను చెల్లెల్ని వదలి ఆ యిల్లు కదలిపోతాడు; కొత్త అటూ ఇటూగా అప్పులవాళ్ళ ధాకకి ఆగలేక పెద్దన్న రాజేంద్ర, చెల్లెలు మీనా కూడా వీధిన పడతారు; దరిమిలా ఒక ప్రమాదంలో పడతారు. వారూ వేరైపోతారు. ఈసారి ఎడబాటు మటుకు కలయికకు నాంది అవుతుంది. మీనా, తనకు కావలసిన డాక్టర్ భర్త చేతిలోనే పడుతుంది. మెల్లిగా కొద్దిపాటి సినీకష్టాల తరువాత అంతా కలుసుకుంటారు. గుష్టులు నాలిక్కరచుకుంటారు. ఈ విధంగా సుపరి

---

## 'లైమ్ లైట్'

తీసుకువెళ్ళమంటాడు అక్కడివారిని. హర్షధ్వానాలు చేస్తున్న ప్రేక్షకులను చూసి తృప్తిపడి, నవ్వి, "ఇది ఇంకా ఇలా సాగిద్దామనే ఉంది.. కాని, నేనిక్కడ చిక్కడిపోయాను" అని తన ప్రత్యక్షావస్థమీద నుంచే, ఆసన్న మృత్యువును కూడా స్పృశిస్తూ గుండెలో నాటుకుపోయేలాటి ఈ మాటతో శ్లేష వేస్తాడు. (You see I would like to continue, but I am STUCK అని.)

తరవాత అంతే అవుతుంది. టెరిస్సా నృత్యం చేస్తూఉండగా రంగస్థలంమీద వింగ్స్ చాటున శయనించి, తాను వెలిగించిన టెరిస్సా రంగస్థలంమీద మూర్తీభవించిన చైతన్యంలా వర్తిస్తూ ఉజ్వలంగా ప్రకాశిస్తూ ఉండగా చూస్తూ, తను ఆరిపోతాడు. జీవనస్రవంతి యథాప్రకారం కొనసాగుతునే ఉంటుంది. "ఇంక ఆట్టే టైము లేదు. వెళ్ళిపోయేలోగా సత్యాన్ని దర్శించాలి" అనుకున్న కాల్వెరో యాత్ర ఆగిపోయి, అక్కడినించి టెరిస్సా జీవనయాత్ర కొనసాగుతుంది.

ఈ జీవిత నాటకంలో చాప్లిన్ నిర్వహించినది ఒక్క కాల్వెరోవే కాదు; మిగతా నటీనటులు ధరించిన భూమికలన్నీను. కాల్వెరో కేవలం విదూషకుడే కాదు హాస్యరసజ్ఞుడికి ఉండగలపరిపక్వతగలనిండుమనిషి. జయం అపజయంకూడా అనుభవించినవాడు. నవ్వడం నవ్వించడం, నవ్వులపాలుకావడంతోపాటు నవ్వుకోవడంకూడా నేర్చుకున్నవాడు. దర్శకుడు నటుడు అయిన చాప్లిన్ ఈ పాత్రలోని ఛాయాభేదాలన్నిటినీ దేనికదిగా, ఎక్కడికక్కడగా మాటల తీరులో భ్రుకుటి ముడవడంలో, నవ్వడంలో, నవ్వకపోవడంలో చిత్రించాడు. మాటలలోనూ మనసులోనూ ఉండే అంతస్సులను చూపించాడు. మనిషిలో ఆశ అంకురించడాన్ని చూపించాడు. నిస్పృహ కమ్ముకురావడం చిత్రించాడు. వెనకబడిన హాస్యగాడి హాస్యాస్పదమైన హాస్యాన్ని అత్యంత హాస్యరసభరితంగా చూపించి ఏకకాలంలో రెండు లక్ష్యాలను సాధించాడు. 'ఫెర్ఫార్మింగ్ ఫ్లీ' పేరిట తీసిన దృశ్యాలు, వాటిలో చాప్లిన్ నటన చూసినవారు ఎన్నటికీ మరువరు. మేకప్ తీసివేసి రంగస్థలం మీదనుంచి జీవిత రంగస్థలంమీదకు వచ్చిన చాప్లిన్‌ను అంతకన్న మరువలేరు. అక్కడ లైమ్‌లైట్‌లో ఉంటే ఇక్కడ సబ్లైమ్ లైట్‌లో కనిపిస్తాడు ఆ చాప్లిన్‌కు ఈ చాప్లిన్‌కు దూరపు చుట్టరికంకూడా కనిపించదు. క్షణంలో సగంలో చాప్లిన్ హాస్యగాడిని వేదాంతిలా చూపిస్తాడు. అద్దెబెదలేకుండా లావుపాటి ఇంటావిడతో మోటు సరసాలు ఆడిన పోకిరీ పెద్దమనిషిని అరక్షణం తరువాత గౌరవభాజనుడిగా చూపిస్తాడు. నిత్య జీవన వ్యాసంగరంలో ఆ వెకిలిచేష్ట వెనకాలఉన్న విషాదస్థితిని స్ఫురింపచేస్తాడు. క్షణంలో పసివాడిని పరిణతుడిస్థాయికెత్తి దింపివేస్తాడు. ఒక ఫోటోజెనిక్ కొటేషన్ లాటి మాటతో మనని అట్టే నిలబెట్టి, దాని క్షణార్థంలో అపహసించి నవ్వించివేస్తాడు. నవ్వు ఆయేసరికి అతడు గమ్మత్తుగా అన్న మాటలో లోతు మనకి స్ఫురింపచేస్తాడు. ఆవేళకి అతని ముఖభంగిమ, విగ్రహం, చుట్టూరా వెలుగునీడలూ, దూరంగా సంగీత వ్యాఖ్య అన్నీ అభావానికి గాంభీర్యాన్నీ, రీవినీ సమకూర్చుతాయి.

ఈ చిత్రంలో దర్శకుడుగా చాప్లిన్ పనివాడితనంకూడా చిరకాలం నిలచి ప్రశంసలు అందుకోగలది. టెరిస్సా చిన్ననాటి ప్రేమకథ చిత్రణ ఒకటి, ప్రేమకథలన్నిటి రామణీయకాన్నీ, మాధుర్యాన్నీ పమీకరించి రూపొందించినట్లుంది. ఆయా ఘట్టాలలో ఫ్రేంకాంపోజిషన్‌లు, ఫ్రేములు లేకుండా ప్రేక్షకహృదయాలలో చిరకాలం నిలిచే చిత్రాలు. అనురాగోదయాన్ని అంతఅందంగా చూపిఆపినవిఅరుదు. అలాగే చివరి సన్నివేశాలలో కాల్వెరో మరణశయ్యమీద ఉండగా టెరిస్సా అతని పక్కన కూర్చొని దుఃఖించే దృశ్యం-ఓల్డ్ మాస్టర్స్ వేసిన త్రివర్ణ చిత్రాలను వివర్ణం చేసేదిగా ఉంది. ఆ గదిలో నాటకాల సామగ్రి, పాతకాలపు సరంజామా అన్నీ ఆ సన్నివేశానికి తగినట్లు అమరాయి. చిత్రం పొడుగునా, కథావస్తువును ఉద్ఘోషించే నేపథ్యసంగీతం ఆ ఘట్టాలలో వినవస్తున్నపుడు ఉత్తమ కళాకారుడు, కరుణాకరుడు చార్లీచాప్లిన్‌కు జోహార్లుచేస్తాము. ★

చితం అనిపించే సన్నివేశాలతోనే ఈ కథను ఇంత రక్తికట్టించగలగడం, చెయి తిరిగిన వాళ్ళకే చెల్లుతుంది. దాక్షిణాత్య దర్శకుడు ప్రసాద్ పనివాడితనం ఈ తరహాదే. ఇంకోళ్ళు తీస్తే వచ్చి మెలోడ్రామా అనిపించే ఘట్టాలను, ఈయన ఆ సరిహద్దుదగ్గర ఆపి హృదయాన్ని కదిలించగలడు. సృజనాత్మక శిల్పప్రయో లు చేయకపోయినా, ఉన్నదాన్ని చెప్పదగినంత నిండుగా, కొత్త గాయకుడి పాటలా స్థాయిలా కిందూమీదూ కాకుండా చెప్పకు వచ్చినందుకు దర్శకుడు అభినందనీయుడు. ఈ శిల్పం ఈయన తొలిచిత్రం 'శారద'లో కనిపించినా, ఇందులో అది మరింత పరిపక్వమై శోభించింది.

ముఖ్యనటుల కృషి అన్నివిధాలా ఇందుకు దోహదం చేసింది. బల్ రాజ్ సాహ్నీ చిన్న చిన్న సున్నితమైన హావభావవిన్యాసాలతో తనపాత్రను మనోహరంగా పోషించాడు. భాభీలోకన్న బాగా నటించాడు. రెహమాన్ (రాజ్ రాణి) కూడా సమర్థుడి స్థయిర్యముతో, సౌలభ్యంతో నటించాడు. శ్యామా చాలా అందంగా వుంది. 'ఆదర్శ భాభీ' హఠాత్తుగా ప్లేటుమార్చి ఆడపడుచును బాధించే రకం కావడం కొంత ఎబ్బెట్టుగా ఉన్నా, ఈమె నటన చాలవరకూ కప్పుకొచ్చింది. నందా ధరించినపాత్ర, స్వభావాన్ని బట్టి అయాచితంగానే సానుభూతి లభిస్తుంది. కాబట్టి ఆమెపని తేలికే అనిపించినా, చూడముచ్చటగా నటించింది. మహమూద్ ఈచిత్రంలో దాదాపు ఆడుకున్నాడు అనిపించేటంత హాయిగా నటించాడు. వీళ్ళందరిదీ ఒకఎత్తుకాగా, రాధాకిషన్ హాస్యం ఒక్కటి ఒకెత్తుగా తూగుతుంది. హుషారైనమాటలూ, కాకుకంఠం అతడు తెరమీదకు వచ్చినప్పుడల్లా ప్రేక్షకులను అలరించాయి.

శంకర్ జైకిషన్ల సంగీతం ఒకటే ఉండదగినంత నిండుగా ఉందనిపించలేదు. కొన్ని వరసలు వారి కృతులఛాయలోనే పునరావృతాలు అయ్యాయి. రెండుపాటలుమటుకు (సుబీర్, లతాపాడిన యుగళగీతిసహా) చాలా బాగున్నాయి. మిగతావి హిట్ లుఅయితే– అందుకు కారణం 'ఛోటీబహెన్' చిత్రం అనేకవిధాల బాగుండి ప్రజాదరణ పొందడమే అవుతుంది. –'టచ్ స్టోన్'] ★


'మధురగాయిని' లతా మంగేష్కర్


"ఢిల్లీ కా ఠగ్" చిత్రంలో కిశోర్ కుమార్, పేకాటపికులూ

# సంగీత వార్తలు

ప్రసాద్ గారి కొత్త హిందీ చిత్రం 'ఛోటీ బహెన్'తో ఒక కొత్త గాయకుడు పైకివచ్చాడు. పేరు సుబీర్ సెన్. ఈ చిత్రంలో ఇతను లతామంగేష్కర్ తో కలిసి 'మైం రంగీలా ప్యార్ రహీ' అనే పాట చాలాహాయిగా పాడాడు. ఈ చిత్రం సంగీత దర్శకులు శంకర్ జైకిషన్లు ఇంతకుముందు 'కట్ పుత్లి' చిత్రంతో ఇతనిని పరిచయంచేసినా, ఈ పాటలో అతనికి మంచి పేరూ, ఇపుడు నాలుగైదు కొత్త అవకాశాలూ లభించాయి. 'అర్థాంగి' అనే చిత్రంలో వసంత్ దేశాయ్ ఇతనిపాట ఒకటి మొన్న రికార్డు చేశారు. బర్మన్, సలీల్ చౌదరికూడా ఇతన్ని తీసుకొంటారట.

* * *

తెలుగు చిత్రాలలో త్వరలోనే ఇద్దరు కొత్తగాయకులు పరిచయం కాగలరు. మొదటిది విశ్వరూపా ప్రొడక్షన్స్ వారి తొలి

# చిత్రసమీక్ష: శారదా వారి

# జయభేరి

తెలుగు చలనచిత్రాల కథలో నాలుగు కాలాలు నిలువబోయే కొత్తపేరు, శారదావారి 'జయభేరి'. ఈ దశాబ్దంలో వచ్చిన చిత్రాలలో ఇది అనేకవిధాల ముఖ్యమైనది.

సంగీతం, సాహిత్యం, నటన, కథ కథనం, ఛాయాగ్రహణం మొదలైన వివిధ శాఖలలోనూ ప్రశంసనీయమైన, పరస్పర సమన్వయంగల కృషిఫలితంగా సర్వాంగ సుందరరూపం ధరించిన ఈచిత్రాన్ని సంగీత ప్రియులు సంగీత చిత్రం అనవచ్చు. సాహిత్యాభిమానులు దీని ఘనత మల్లాదిశాస్త్రి గారిదీ, ఆత్రేయదీ అనవచ్చు. చలనచిత్రాభిమానులు పి. పుల్లయ్యగారు తీసిన ఉత్తమోత్తమ చిత్రం అని పొగడవచ్చు. నటనమీద గురిగలవారు ఇది పూర్తిగా నాగేశ్వరరావు చిత్రం అనవచ్చు; గుమ్మడిని, ఐదు నిముషాలసేపు అతిథిగా కనిపించిన రంగారావునూ, అంజలీదేవినీ, శాంతకుమారినీ సగర్వంగా చూపించవచ్చు. టూకీగా చెప్పకోవాలంటే, తెలుగు చలనచిత్రాలలో ఎన్నతగ్గ ప్రమాణాలన్నిటినీ ప్రతిబింబించే చిత్రం అని అంతా అంగీకరిస్తారు. దాదాపుగా 'పరిణతమైన' అన్న విశేషణానికి అర్హతగల చిత్రం.

ఇందులో సమకాలికమనతగ్గ సమస్య లేదు. కాని, దానిఛాయలు లేకపోలేదు. దర్శక రచయితలచిత్రణావైఖరే ఇందుకొక నిదర్శనం. కులతత్వాలను, మత దురభిమానాన్ని ఖండించబోవడంలో ఆయాపాత్రలను చిన్నసైజు భూతద్దంకిందపెట్టి చూపెట్టారు. బహుశా 'బాక్సాఫీసుభూతా'ద్దం కావచ్చు ... ఈ ఒక చిన్న అపశ్రుతివినా మిగతా కథను కళాత్మకంగా శ్రద్ధాభక్తులతో చిత్రించారు. సన్నివేశాలను హృదయంగమంగా కట్టారు. సంగీతం ఎక్కువఉన్న చిత్రంలో కథ అష్టకష్టాలూ పడడం పరిపాటి అయినా, 14 పాటలుగల ఈ చిత్రంలో కథా, సంగీతం అద్భుతంగా సహవాసం చేశాయి. వెలుగునీడలలా ఒకదానినొకటి మెచ్చుకుంటూ ఒకటినొకటి ప్రస్ఫుటం చేశాయి.

కథ ప్రధానంగా ఒకానొక సంగీత వరప్రసాదివ్యథ. కాశీనాథ్ అనే ఆ యువకుడు అన్నావదినెల చాటున అపురూపంగా పెరుగుతూ శాస్త్రీయసంగీతం అభ్యసిస్తూ ఉంటాడు. శాస్త్రీయ సంగీతాన్ని సామాన్య ప్రజలకు దగ్గరగా తీసుకువెళ్లాలన్న స్వతంత్ర భావాలు గలవాడు అయినందువల్ల, గురువు విశ్వంభరుడు కల్యాణిరాగం సాధన చెయ్యండిబాబూ అంటే రాగప్రస్తారం ప్రేక్షకులకు అట్టే నయించదని, సరాసరి కీర్తన మొదలుపెట్టిన ధైర్యశాలి. గుర్వాజ్ఞను కొద్దిగా దాటేస్తే వేశాడుగాని, అతసాపని చేసినందువల్ల, "మది శారదాదేవి మందిరమే" అనే మధురమైన ఉత్తేజకరమైన కీర్తనను విని మహదానందం పొందగలుగుతాము. ఘంటసాల, శ్రీనివాస్, సత్యం, పాణిగ్రాహి పాడిన ఆ పాట, అందులో స్వరకల్పన, ఘంటసాల విన్యాసాలూ, గాత్రధారులకు, తెరమీద పాత్రధారులూ, దర్శకుడు చేసిన రూపకల్పనాశోభించి, ప్రేక్షకులను జరుగబోయే కథకు ఆయత్తం చేస్తాయి.

మొత్తానికి శిష్యుడు కాశీనాథ్ తిన్నగా ఉండడు. ఊళ్లో బత్తెనవాళ్లు భాగోతం ఆడుతుంటే చూడబోయి 'నన్నోడించినవాడేడీ' అంటూ అక్కడ జనాన్ని సవాలుచేస్తున్న చిన్నదాన్ని చూసి ఎదురు సవాలుచేసి పాడి ఓడిస్తాడు. కర్ణాటక బాణీలో ఆరంభమైనపాట క్రమంగా ఫిల్మీ గీత్ స్థాయికివచ్చి పూర్తి అయేసరికి ప్రజానీకాన్ని ఆనందింపచేయడమే తన కర్తవ్యం అని నిర్ణయించుకొంటాడు.

బాహ్మలపిల్లడు బత్తెనాళ్లతో కలిసిపోవడం కలవరం కలిగిస్తుంది. గురువుగారూ, ఇంట్లో అన్నగారూ మండిపడతారు కాశీనాథ్ మీద. కన్నతల్లిలా పెంచిన కమలమ్మ ఏడ్చి మొత్తుకుంటుంది కూడనిపనులు చేయవద్దని. కాని, కాశీ బత్తెన చిన్నది మంజులకు ఇచ్చినమాట నిలబెట్టుకోవడానికి మళ్లీ చాటుగావెళ్లి గంగంమీద కెక్కడంతో పరిస్థితులు విషమించి అతడు ఇల్లు వదలిపోవడం జరుగుతుంది. కులంవాళ్లు వెలివేస్తారని, కాశీ అన్నగారు విశ్వనాథ్ శాస్త్రి తమ్ముడిని పొమ్మంటాడు. ఇంక చలేమిటని కాశీ మంజులతో మధురమైన యుగళగీతం ఒకటి పాడి (ఘంటసాల, సుశీల) ఆమెను దైవసాక్షిగా వివాహం చేసుకుంటాడు. భర్తకి తెలియకుండా వచ్చిన వదినెగారు దంపతులను దీవిస్తుంది....

అక్కడితో కాశీనాథ్ జీవితంలో పతాక సన్నివేశం, అందులో నాగేశ్వరరావు నటన ఆరంభమై మోహనరాగ స్వరారోహణలా అతివేగంతో తారస్థాయిని అందుకుంటాయి. కాశీనాథ్, మంజులతా దేశాలవెంట తిరుగుతూ, "జాను తెనుగేనేను, జాతి ఘనతే నేను" అని సగర్వంగా శ్రుతిమధురంగా చాటుతూ అఖండ ప్రజాభిమానాన్ని సంపాదిస్తారు. విజయనగర చక్రవర్తి విజయానంద గజపతి కాశీనాథ్‌ను నిండుసభలో గౌరవించి, కాశీగురువుచేతనే సన్మానం చేయిస్తాడు. ఆ సభలో సంగీతరసరాజు కాశీచేత, రసికరాజు ఐన చక్రవర్తిని ఉద్దేశించి [illegible] దర్శకుడు పెండ్యాల, గాత్రధారి ఘంటసాల పాడించిన "రసికరాజ తగువారము కామా" అనేకీర్తన, రాజసన్మానానికి అర్హమైనస్థాయిలో రసభరితంగా, ఆ పాత మధురంగా ఆలోచనామృతంగా భాసిం

## 'జయభేరి'

నటులు : నాగేశ్వరరావు, గుమ్మడి, నాగయ్య, రంగారావు, ముక్కామల, రేలంగి, రమణారెడ్డి, చదలవాడ కుటుంబరావు, పేకేటి, బొడ్డపాటి కృష్ణారావు, వల్లమాని విశ్వనాథం, కాశీనాథ్, అంజలీదేవి, రాజసులోచన, శాంతకుమారి, సూర్యకాంతం.

మాటలు ఆత్రేయ. పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, ఆరుద్ర, కోసరాజు.

సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు. నేపథ్యగానం ఘంటసాల, సుశీల, ఎం. ఎల్. వసంతకుమారి, పి. బి. శ్రీనివాస్, మాధవపెద్ది సత్యం, పిఠాపురం నాగేశ్వరరావు, సౌందరరాజన్, రఘునాథపాణిగ్రాహి.

ఛాయాగ్రహణం పి. ఎల్. రాయ్. కళ కృష్ణారావు. నృత్యాలు వెంపటి సత్యం. దర్శకత్వం పి. పుల్లయ్య.

నిర్మాతలు వాసిరెడ్డి నారాయణరావు, టి. వి. ఎస్. (ప్రతిభా) శాస్త్రి.

## సంగీత వార్తలు

సాంఘిక చిత్రం 'కూతురు కాపరం' ఈ చిత్రానికి సంగీతదర్శకుడు రమేష్‌నాయుడు, సినిమా పత్రిక 'కినిమా' కలసి లోగడ ఒక పోటీ జరిపాయి. అందులో ఎన్నిక అయిన కుమారి ఉమకు ఈ చిత్రంలో తొలి అవకాశం ఇచ్చారు. తెరమీద ఈ పాటను రాజసులోచన పాడినట్లు చిత్రిస్తారు.

* * *

మరొక చిత్రం - 'సిపాయికూతురు' లో సంగీతదర్శకుడు సుబ్రహ్మణ్యంరాజు రామారావు అనే గాయకుడిని పరిచయం చేస్తున్నారు.

చింది. కాల్పనిక స్వర విన్యాసాలను అంత మధురంగా కట్టుదిట్టంచేసి ఆ క్షణంలోనే పాడినదిగా తోచేలా పాడించడం ప్రశంసనీయమైన సాధన. 'మధురమణి' స్వరగణిత శిల్పంలో మంద్రస్థాయిన రెండు స్వరాల మీద ఘంటసాల పోయిన పోకడలు మరపురానివి.

సంగీతరాజోచితమైన రాజమర్యాదతో గిరిశృంగాన్ని అధిరోహించిన మధురగాయకుడు కాశీనాథ్ మదిరలాలసుడై ఆ పైనుంచి జారిపడిపోతాడు. రాజనర్తకి అమృతం, మఠాధిపతి (ముక్కామల) కూడబలుక్కు చేసిన కుట్రఫలితంగా ఖైదీగా చక్రవర్తి సముఖాన నిలుస్తాడు. చక్రవర్తి రసహృదయుడు; సరసహృదయుడు. నైతికంగా పతనంచెందినా కళాకారుడు ఎన్నటికీ పూజనీయుడేనని, అతని కళావిభవం చెన్నుతరగదనీ చెప్పి కాశీని పంపివేస్తాడు. ఈ సంఘటనకు పూర్వం నర్తకిఇంట్లో కాశీ తాగి మైమరచినస్థితిలో పాడిన మధుమధురగీతి 'నీ దాననన్నదిరా నిన్నే నమ్మిన చిన్నదిరా'ను చక్రవర్తి వినిఉంటే, అతన్ని అసలు దేశంవదలి వెళ్లనిచ్చేవాడే కాదు. వాగ్గేయ కారకుడుగాకూడా తిరిగి సమ్మానించేవాడనిపిస్తుంది. కాశీకి ఇంత ఊహాలు లేవు. 'మదిరోహా'లోనే ఉండి ఇల్లు గుల్లచేసి అన్నీ తెగనమ్మి, భార్యను సాధించి బాధించి అహిరిరాగంలో గాంధారంలా అందరి హృదయాలనూ—ప్రేక్షకులు సహా—విషాద భరితం చేసివేస్తాడు. అది భరించలేని గురువు విశ్వంభరుడు, "అమ్మా శారదా! నీ బిడ్డలు లక్ష్మీకటాక్షం కూడా పొంది సుఖించడం సహించలేవా?" అని తరతరాలుగా కళాకారులు పడిన దారిద్ర్యపు, క్షోభలన్నిటినీ సమీక్షించి ఒక గాథలో పలుకుతాడు సరస్వతి ఎదుట.

కాశీనాథ్ నైతికంగా పతనం చెందుతున్నకొద్దీ కళారాధకుడుగా తారస్థాయికి పెరుగుతూ ఉంటాడు...బహుశా అందువల్లనే పైనున్నవాడికి వినపడవలసి ఉన్న చివరి పాటను ప్రసిద్ధ తమిళ గాయకుడు సౌందరరాజన్ పాడి ఉండాలి. ఈ పాటలాగే ఈ సన్నివేశం దీనికి దోహదంచేసిన పూర్వఘట్టాలూ కూడా ఉద్వేగభరితాలుగా తీవిగా కట్టుకువచ్చారు. పతితుడు కాశీనాథ్ లో పరివర్తన తేవడానికై వదినగారు కమలమ్మ భర్త ఆజ్ఞను ధిక్కరించి ఇల్లువదలి వెళ్తుంది. బ్రాహ్మణ్యానికి భయ[illegible]డిన విశ్వనాథుడు భార్యని కూడా వదులు[illegible]టాడు. చివరకు కాశీ భార్య మంజులతను బ్రాహ్మణ్యం కొట్టి గాయపరడంతో అతనిలో పరివర్తన కలుగుతుంది. దురభిప్రాయం పారచిరిగి పోతుంది 'ఏది బ్రాహ్మణ్యం' అన్న ప్రశ్నకు సమాధానం



దర్శకుడు పి. పుల్లయ్య.



'జయభేరి' సంగీత రచయిత పెండ్యాల.



ముఖ్యగాయకుడు ఘంటసాల.

తెలుస్తుంది. తను సభ్యుడైన బ్రాహ్మణ్యాన్ని ధిక్కరించి, తమ్ముడికోసం, తన భార్యకోసం పరుగు పెడతాడు. ఆ వేళకు తాగి పడిఉన్న కాశీనాథ్ మీద, పాతికేళ్ళ పెంపకంలో తొలిసారిగా చేయి చేసుకుని అతని మేల్కొల్పిన వదినగారు తనకింక పని లేదని ఆత్మహత్యకు పాల్పడుతుంది.

తెలుగు సినిమాలో చాలాకాలంగా మనం చూచి ఉండని తరహాలో నిండైన మనుష్యుల మనసులను, హృదయ పరివర్తనాన్ని సమగ్రంగా సమర్థంగా ఉదాత్తంగా చిత్రించే సన్నివేశాలను ఈ చిత్రంలో చివరి ఘట్టాలలో చూస్తాం. వీటిని ఇంతగొప్పగా చూపిన చలనచిత్రకారుడు పి. పుల్లయ్యగారు అభినందనీయులు. ప్రతిసన్నివేశంలో దృశ్యాలరూపకల్పనశిల్పం ప్రత్యేకం చెప్పుకోతగ్గది. ఆయన తీసిన చిత్రాలలో, ఇతరులు తీసిన అనేకచిత్రాలలోనుకూడా 'జయభేరి' అగ్రతాంబూలం అందుకొంటుంది. అదే శ్రేణిలో ఇందులో పాల్గొన్న కళాకారులు నాగేశ్వరరావు, అంజలీదేవి, గుమ్మడి, శాంతకుమారి సన్మానార్హులు అనిపించుకున్నారు. కాశీనాథ్ గా నాగేశ్వరరావు, విశ్వనాథ గా గుమ్మడి చిరస్మరణీయమైన నటన ప్రదర్శించారు. హాస్యాన్ని ఈకథలో విడిగా చూడలేము. ఉన్నదాన్ని, కథలో నేర్పుగా అందంగా కలిపి కథకు అడ్డురాకుండా నడిపారు. రేలంగి, రమణారెడ్డి, నల్లరామమూర్తి సురభికమల, సూర్యకాంతం అంతా ఆహ్లాదకరంగా ఉన్నారు. అందరికన్నా మిన్నగా ఆహ్లాదాన్ని ఇచ్చిన నటుడు ఐదునిముషాలసేపు చక్రవర్తిగా కనిపించిన అతిథి రంగారావు. నిర్మాతలూ, నటుడూ ఈ పాత్రకు 'అతిథి' ముద్రవేసినా, గొప్ప నటనతో కూడిన మంచి పాత్రల శ్రేణిలో నిలబడుతుంది.

సంగీతదర్శకుడుగా పెండ్యాల నాగేశ్వరరావు ఈచిత్రంలో నిర్వహించినపాత్ర ఎంత ప్రముఖమైనదో అంత విజయమూ సాధించింది. కర్ణాటకబాణీల దగ్గరనుండి ఉస్తాద్ కరీంఖాం తుమ్రీఖాయలదాకా జావళీలదగ్గరనుండి సినీవాలీ జానపదాలదాకా, శ్రుతిమధురమైన నవరసస్వరాలన్నీ మనోహర హారాలుగా కూర్చి గొప్పగా చెప్పుకోదగ్గ ఫలితాలను సాధించారు. శాస్త్రిగారి జాను తెలుగు పలుకుబడులు, ఆరుద్ర అంత్యప్రాసక్రీడలుగల నృత్యనాటికా గేయాలు, శ్రీశ్రీ నందనారుగాథ ఇతివృత్తానికి శోభను కూర్చేరీతిన భాసించాయి. నృత్యనాటికలలో రాధాకృష్ణ, మత్స్యగంధి పెళ్లి చాలా బాగున్నాయి. నృత్యాలలో చిత్రం ఆరంభంలో అంజలీదేవి చేసిన నృత్యం ఒకటి చైతన్యవంతంగా వుంది. అన్నివిధాలా సంతృప్తి కలిగించే ఈ చిత్రాన్ని ఉగాదికానుకగా రేపు విడుదల చేస్తున్నారు. 

# అసాధారణ చలనచిత్రం

## ఓల్డ్ మాన్ అండ్ ది సీ

"ఆ గల్ఫ్‌నదిలో ఒక చిన్న నావమీద ఒక్కడే వల్లి చేపలు పట్టుకుంటూ ఉంటాడా ముసలాతను. ఎనభయి నాలుగు రోజులుగా ఒక్క చేపకూడా పడలేదు."

ఎర్నెస్ట్ హెమింగ్వేకి పులిట్జర్ బహుమానం సంపాదించి పెట్టిన "ది ఓల్డ్ మాన్ అండ్ ది సీ" (ముసలాతనూ సముద్రమూ) అనే నవల ఈ వాక్యాలతో ప్రారంభమవుతుంది. హాలీవుడ్‌లో ఈ హెమింగ్వే నవల ఆధారంగా నిర్మాణమైన చిత్రం కూడా ఈ వాక్యాలతోనే మొదలవుతుంది. పలురకాల విమర్శలకు గురైన చిత్రాలలో ఇది ఒకటి.

అసలు ఈ నవలను చిత్రం తీయకుండా ఉంటే బాగుండేదన్నారు కొందరు. కాగా కొందరు, 'ఫరవా లేదు తీయ్యొచ్చు' అన్నారు. తరవాత ఈ నిర్మాతలు చిత్రీకరించిన తీరును బాగుండలేదని కొందరు. ఉందని మరికొందరూ అన్నారు. దానిపై తీవ్రమైన వివాదం ఏర్పడింది. ఇది ఇట్లా ఉండగా మరికొందరు దీనిని చలనచిత్రాలకు తలమానికం వంటిదని ప్రశంసించారు. మరికొందరేమో ఈ చిత్రం మూలంలో ఔచిత్యాన్ని ఏ మాత్రం చూపజాలకపోయిందని తెగనాడినారు. ఇట్లా ఈ విమర్శలు ఒకటి ఉత్తర ధ్రువం మరొకటి దక్షిణధ్రువంగా ఒకదానికొకటి అంతనా పొంతనా లేకుండా జరిగినవి.

అయితే అసలు వాస్తవం ఈ రెండింటికి మధ్యస్థంగా ఉన్నదని నా కనిపిస్తున్నది. ఎందుకంటే లక్ష్య సాధనలో జయాపజయాలకంటే అసలు దాని నిర్మాణం ముఖ్యమైనది.

అసలు ఈ కథఅంతా ఒక వ్యక్తి చుట్టూ తిరిగేది. ఒక్క వ్యక్తితో నడిచేది. ఇటువంటి కథను చిత్రంగా తీయటానికి హాలీవుడ్ లో ఎవరైనా పూనుకోవటమే ఆశ్చర్యం కలిగించే విషయం. (ఈ నవలను వార్నర్ బ్రదర్స్ సంస్థ చిత్రంగా తీసింది.) కాగా సినేరియో రచయిత పీటర్ వర్టెల్ గాని, నిర్మాత లీలెండ్ హేవార్డ్ గాని, డైరక్టరు జాన్ స్టర్జెస్ గాని అసలు కథకు అవీ ఇవీ కల్పి ఉన్న కథనుమార్చి సుఖాంతం చేయటం వంటి సొంత ట్రిక్కులు ప్రయోగించకపోవటం నిజంగా ప్రశంసనీయమైన సంగతి. మొదటినుంచి చివరిదాకా అసలు కథను ఉన్నదున్నట్టుగా చిత్రించాలన్న ప్రయత్నం జరిగింది. అందువల్లనే మిగతా చిత్రాల విషయం లాగా ఈ చిత్రంలో కృత్రిమ విశేషాలేమీ లేవు.

ఈ కథ చిత్రీకరణ చాల కష్టమైనదనే విషయం అంగీకరించవలసినదే. కథలో మూడింట రెండు వంతులు ఒక చిన్న నావ మీద ఏకాంతంగా ఉండే ఒక ముసలాతనితో జరుగుతుంది. నవల చదివినవారికి ఈ సంగతి చెప్పనక్కర్లేదు.

ఎనభై నాలుగు రోజులపాటు ఒక్కటంటే ఒక్క చేపకూడా ఒక్కరోజు కూడా పడలేదు. అయితే ఎనభయి అయిదోరోజున అతనిపంట పండింది. తన నావకంటే పొడుగైన పెద్ద మార్లిన్ చేప పడింది. మూడు రోజులపాటు ఆ ముసలాతను చేపతో సతమతమవుతాడు. అది నావను నీళ్లలోకి లాగుతుంటే దానినీ, నావను ఒడ్డుకు ఈడ్వటానికి ఆ ముసలిజాలరి తన శక్తియుక్తులన్నీ ఉపయోగించి పెనుగులాడతాడు.

చివరికి అతనిదే విజయం. ఒక గంట తరువాత నావను ఇంటిముఖం పట్టిస్తాడు. అతడు నావను, మార్లిన్‌ను రేవుకు నడుపుకుంటూ వస్తాడు. అంతలో షార్కు చేపలు ఈ మార్లిన్ చేపను తినటానికి దాని మీద దండయాత్ర చేస్తుంటవి. అతను నావ నడుపుకోవాలి. షార్కులనుంచి మార్లిన్‌ను కాపాడుకోవాలి. అప్పటికి మూడు రోజులుగా మార్లిన్‌తో పోరాడి అలిసి ఉన్నాడు. అయినా, ఎదురుతిరిగిన శక్తులను ఎదిరించి ఎన్నో షార్కులను చంపాడు.

ఎంత హైరాణపడినా చివరకు రేవు చేరేటప్పటికి అతని ఇంతశ్రమకూ మిగిలిన ఫలితం ఆ మార్లిన్ అస్థిపంజరం మాత్రమే. మిగతా ముఖ్య ఆహారమంతా షార్కులే దొంగిలించి వేసినవి.

ఇదీ కథ. కొలది దృశ్యాలు మాత్రమే కథలో ఉన్నవి. ఆవృద్ధుకి ఒకేఒక తోడు ఒక కుర్రడుమాత్రమే ఉన్నాడు. వాడు తాతకోసం ఎదురుచూస్తూ గుటకలు మింగుతూ రేవుఒడ్డున కూర్చొని ఉంటాడు. ఇకొక దృశ్యం. ఆఫ్రికా తీరాలలో చిన్ననాడు అతను తిలకించిన బాల కిశోరాల ఆటలు, కాసబ్లాంకాలో కుస్తీపోటీలు గురించి అతని జ్ఞాపకాల దృశ్యాలు వంటివి మొత్తంమీద కొద్దిగానే ఉంటవి.

ఈకథ మానవుడు జీవితంతో జరిపే పోరాటానికి ఒక చిహ్నం వంటిది. చిత్రంలో కథకుడు చెప్పినట్లు "మానవుణ్ణి నాశనం చేయవచ్చునేమో కాని అతణ్ణి జయించటం దుర్లభం" అన్న సందేశం వినిపిస్తుంది.

మానవుడి అజేయశక్తిని వర్ణించటంలో ఈ నవలలో రచయిత పరికొత్త పక్కా. అవలంబించాడు. చిత్రంలో కొంతసేపు ఆముసలాతను తనలోతాను సణుగుకొనే స్వగతాలు, చేపలను ఉద్దేశించి అంటుండే మాటలు ఒకసారి, కథకుని వ్యాఖ్యాను ఒకసారి ఒకదాని తరువాత ఒకటి వినిపిస్తుంటవి. ఈరెండూకూడా కథానాయక పాత్రధారి స్పెన్సర్ ట్రేసీ నిర్వహించాడు. ట్రేసీ హుందాగా ఉద్రేకరహితం, త్వరితంగా హెమింగ్వే గద్యాన్ని చక్క- చెప్పారు. ముసలాతని పాత్రలో డైలాగ్సు ఎక్కడెట్లా చెప్పాలో అక్కడట్లా చెప్పి ఒప్పించాడు.

ట్రేసీ నిర్వహించిన ఈవృద్ధుడి పాత్ర వంటిది ఏ చలనచిత్రంలో ఎవరూ ఇంత వరకూ నిర్వహించి ఉండరు. మరపురాని నిరాడంబరత, హుందాతనం ఉట్టిపడేలాగ ఈపాత్రను ట్రేసీ పోషించాడు. ట్రేసీ కథలోని వృద్ధుడంత ముసలివాడుగా కనపడకపోవటం, ఆజాలరి బలహీనతలను ట్రేసీ పూర్తిగా చూపలేకపోవడం కొంత బాధ కలిగించవచ్చునేమో కాని దారుణం మాత్రం గాదు. ట్రేసీ ఈ పాత్ర పోషణలో దాని ఔచిత్యాన్నీ, మానవుని అజేయశక్తినీ ప్రతిబింబింపజేశాడు.

పోతే మరికొన్ని చిన్న లోపాలు — వీటిలో ఎక్కువ భాగం సాంకేతిక సంబంధమైనవి—లేకపోతే లేదు. సముద్రం మీద దృశ్యాలను, స్టూడియోలో తీసిన వాటితో కలపటంతో కొన్ని పొరపాట్లు జరిగినవి. ఫోటోగ్రాఫీ కూడా లోపభూయిష్ఠంగా ఉన్నది. అయితే రెండు సంవత్సరాల పొడుగునా షూటింగులు, చిక్కులమారి ప్రదేశాలలో జరగటం వల్ల ఇది కొంతవరకు ఇట్లా ఉంటుందని ముందే ఊహించవచ్చును.

అయితే ఫోటోగ్రాఫర్ జేమ్సు వాంగ్ హో, నైపుణ్యాన్ని నిరూపించే అందమైన ఘట్టాలు కూడా కొన్ని ఉన్నవి. సముద్రాన్ని మథించినట్లు చూపటంలోను ఉదయ సంజె చీకటులలో మిణుకుమిణుకుమంటూ కదిలాడే పల్లెకార్ల లాంతర్ల దృశ్యం, ఎగిరే చేపల రెక్కలమీది పొలుసుల తళతళలు చూపటంలోనూ విద్యుల్లతాభాసితాకాశంలో విహరించే వందలాది పక్షిగణాల తెల్లని రెక్కల సమూహపు సోయగం చూపటంలోనూ ఫొటోగ్రఫీ అద్భుతంగా ఉన్నది. ఆ వృద్ధుడు తన నావ తెరచాప స్తంభానికి అనుకొని నావను నడి చూడ ముచ్చటగా తీశారు.

లోటుపాట్లు కొన్ని ఉన్నప్పటికీ "ది ఓల్డు మ్యాన్ అండ్ ది సీ" అసాధారణ చిత్రరాజం. ఇది చలనచిత్ర కవిత అనవచ్చును. భావయుక్తమైన చిత్ర మిది. ఇటువంటి చిత్రాలు బహుకొద్దిగా ఉంటవి.

—నార్మన్ స్మిత్

## అడవికి రాజు



పొద్దున్నే నిద్రలేచి బద్ధకంగా ఆవులించి వొళ్లువిరుచుకుంది సింహం. కాసేపు అడవిలో అలా షికారు తిరిగిరావాలని బయలుదేరింది. దోవలో ఒక నక్క ఎదురుపడింది. సింహం దాన్ని ఆపి "ఈ అడవికి రాజెవరు ?" అని గద్దించి అడిగింది.

నక్క వణికిపోతూ "వేరే అడగాలా మహాప్రభో ! తమరేనని ఈ అడవిలో ఎవర్నడిగినా చెబుతారు?" అంది.

సింహం తృప్తిగా ముందుకు సాగింది. కొంతదూరం పోయాక ఒక దుప్పి ఎదురైంది. దాన్నికూడా నిలేసి "ఈ అడవికి రాజెవరు ? "అని గర్జించి అడిగింది.

దుప్పి హడలిపోతూ "త...త... తమరేనండి" అంది. తరువాత సింహానికి ఒక ఏనుగు ఎదురైంది. "ఈ అడవికి రాజెవరు ?" అని సింహం గర్వించి అడిగింది.

ఏనుగు మాట్లాడకుండా, ఆగకుండా వెళ్లిపోతోంది.

సింహం కోపంగా "ఏయ్ నిన్నే ! వినపట్టంలా అడిగేది ? ఈ అడవికి రాజెవరు ?" అంది.

ఏనుగు ఆగింది. తొండంతో సింహాన్నిచుట్టి అవలీలగా పాతిక గజాల దూరానికి విసిరేసింది.

ముళ్లపొదలలో పడిన సింహం, చీరుకుపోయిన వళ్లుదులుపుకుంటూ లేచి "జవాబు తెలియనంతమాత్రాన అంతకోపం తెచ్చుకోవాలా ఏమిటి?" అని వెళ్లిపోయింది. ★

## ★ రాజధాని కబుర్లు

( 4-వ పేజీ తరువాయి)

ఏ కొండల్లోంచో వస్తూన్నట్టు. క్రమంగా స్థాయి పెరుగుతుంది. హఠాత్తుగా ఆగిపోయి, మరెక్కడనుంచో వినబడ్డట్టు వినపడుతుంది. ఆ సంగీతంలో సొగసును అనుభవించడానికే గాని వర్ణించడానికి నా కలానికి కొనిపనిగా కనిపిస్తూంది. రెండు మాటల్లో చెబుతాను: ఆ కంఠం టంగుటూరి సూర్యకుమారిది. అలా చెబితే, పాఠకులకు అర్థం ఔతుంది.

గత శనివారం రాత్రి గాంధీభవన్ ఆడిటోరియంలో రవెన్యూబోర్డు ఉద్యోగుల సాంస్కృతిక సంఘం పక్షాన ఒక కార్యక్రమం ఏర్పాటు చేయబడింది. ఆ కార్యక్రమంలో ప్రధానాంశం కుమారి సూర్యకుమారి సంగీతం. కార్యక్రమానికి అధ్యక్షత వహించింది ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి. నేషనల్ సేవింగ్సు సర్టిఫికేట్స్ కొని ప్రవేశించారు ప్రేక్షకులు ఆడిటోరియంలోకి. ఇది ఈ కార్యక్రమంలోని ప్రత్యేకతల్లో ఒకటి.

*    *    *    *

తండ్రి తాతలు సాధించిన విజయాలను గర్వంగా చెప్పుకొంటూ తాము చేయవలసిందేమీ లేదన్న భావం వ్యక్తంచేస్తూ తిరిగే వ్యక్తుల్ని చాలమందిని చూశాను నేను. "భళిభళీ! మా తాత గుఱ్ఱంబు చేబూని......" ఏవేవో సాధించాడని చెప్పుకొంటూ, కొ[illegible] విరుచుకు తిరిగే వ్యక్తులు వీరు. తాతగారి గొప్పతనాన్ని కంఠతా పెట్టుకు అప్పచెప్పే మనవణ్ణి గౌరవించడం కష్టం. ఫలానా గొప్పవాడు మా మేనమామ అని చెప్పుకు తిరిగే మేనల్లుడు మన గౌరవానికి అర్హుడు కాడు.

నాలుగు దశాబ్దాలుగా ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారు తెలుగు రాజకీయ జీవితంపై 'ప్రసరించారు.' ఆయన ప్రకాశం సూర్య ప్రకాశం. ప్రకాశంగారి తమ్ముని కుమార్తె సూర్యకుమారి. కళారంగంలో ఆమె వహించినపాత్ర తెలుగువారి హృదయాల్లో ప్రత్యేక స్థానం గడించుకొంది. లేకుంటే, ఆమె సూర్యకుమారిగా కాక 'ప్రకాశకుమారి' గా ప్రజలకు జ్ఞాపకం ఉండేది.

ఒకసారి శ్రీ ఫిరోజ్ గాంధీ మొఱపెట్టుకొన్నాడు. మొదట అతన్ని నెహ్రూ అల్లుడన్నారట. తరువాత ఇందిర భర్త అన్నారట. తరువాత తరువాత రాజీవ్ గాంధీ తండ్రిగా ప్రస్తావించ ప్రారంభించారట. ముంధ్రా వ్యవహారాన్ని బయటకిలాగినతర్వాత శ్రీ ఫిరోజ్ గాంధీ కీర్తికి హక్కు సంపాదించుకున్నాడు.

*    *    *

ఆదివారం ఉదయం సూర్యకుమారిని కలుసుకున్నాను. ఆమె నవ్వుతూ ఉంటుంది. పాడుతూఉన్నప్పుడు నవ్వుతూ ఉంటుంది; మాటాడుతూ ఉన్నప్పుడు నవ్వుతూంటుంది. ఆమె గానం ప్రేక్షకుల, శ్రోతల హృదయాలను హరిస్తుంది. ఆమె అదృష్టవంతురాలు !

కాదు. ఆమె అదృష్టవంతురాలు కాదు. అదృష్టం ఆమెను తరుముకువస్తే, ఆమె కళానైపుణ్యానికి, ఆమె సంగీతానికి, ఆమెకి లోకం అంతా ఎన్నడో జోహార్లర్పించేది. అచిరకాలంలో ఈ తెలుగుపడుచుకు ఆ అదృష్టం లభిస్తుందని ఆశిద్దాం.

*    *    *

ఈ వాక్యాలు వారపత్రికలో చదివేసరికి ఆమె ఈ దేశంలో ఉండదు. న్యూయార్కులో మూడునెలలు టెలివిజన్, రంగస్థల నాటకాల శిక్షణ పొందడానికి ఆమె అమెరికా వెడుతూంది. మార్చి 29 వ తేదీ బయలుదేరి బొంబాయినుండి, విమానంపై అమెరికా వెడుతూంది. ఆమెకి సచిత్రవారపత్రిక శుభాకాంక్షలు. ★

## ★ లౌక్యుడు ★

(55-వ పేజీతరువాయి)

కిష్టమూర్తి శాంపిల్‌గా ఓ అరడజను ఉత్తరాలు ఓపిగ్గా చదివ్వినిపించాడు.

నరసింహంగారు ఓ విషయానికి చాలా ఆశ్చర్యపడ్డారు: 'తెలుగులో సరిగ్గా మాట్లాడ్డమైనా రాని మా వాడికి ఇంత కవిత్వ మెలా అబ్బిందా?' అని. పైగా ఆ ఉత్తరాలు చూశాకే ఆయనికి ఓ పిల్లని అన్నిరకాలుగా ముద్దుగా పిలవొచ్చన్న విషయం మొదటిసారిగా తెలిసొచ్చింది.

"ఇంతకీ ఏమంటారూ?" కొంచెం చిరాగ్గా అన్నారు నరసింహంగారు.

"నేనేమీ అనను. మీవాడనేదే వినండి." అని కిష్టమూర్తి ఊరి బయట దేవాలయం ప్రక్కనున్న గంగరావిచెట్టుదగ్గరకి తీసుకెళ్ళాడు.

అక్కడ చాలా సౌఖ్యంగా కూచున్నారు సుందర్రావూ, సరోజ.

"వెధవ్వేషాలు! వెధవ!" అంటూ ముందుకురకబోయారు నరసింహంగారు.

సుందర్రావు చాలా ధీమాగా అంటున్నాడు "నిన్నుతప్ప ఇంకోళ్ళని చేసుకోను. నువ్వు కావాలి నాకు..."

"మీ వాళ్లు ఒప్పుకోకపోతే..." మధ్యలో మృదువుగా అడిగింది సరోజ.

"ఎదిరిస్తాను. అప్పటికీ ఒప్పుకోకపోతే, ఇదిగో ఈ సీసాలో ఏం వుంది-విషం! ఇది తాగి ఇద్దరం-వీరస్వర్గం...కాదు కాదు... ప్రేమస్వర్గం చేరగొందాం. అక్కడ కలుసుకొందాం. అక్కడ మనల్ని అడ్డే చట్టా లుండవు..."

గుండె బాదుకున్నారు నరసింహంగారు. "పిణ్ణితల్లి పోయినప్పటినించీ కంటికి రెప్పలా చూసుకుంటున్నాను. అందరూ పోయి వీడొక్కడూ మిగిలాడు...వీడిమీదే నా ప్రాణాలు. ఇప్పుడు వీడు విషం, స్వర్గం, చట్టాలూ అంటాడేవిటీ?"

ఆయనకి మతిపోయినంత పనైంది.

"నేనేం కాదన్నానండీ కిష్టమూర్తి గారూ! వాడిష్టం. వెధవ-విషమంటాడేవిటీ?...అది ముందు లాక్కుందురూ వాడిదగ్గర్నించి" అని ఇంకా చాలాకంగారు పడ్డాడాయన.

కిష్టమూర్తి సన్నగా నవ్వుతూ "కంగారెందుకండీ. ముంగు అతనిష్టం కనుక్కుంటే..." అంటున్నాడు.

"ఇంకా కనుక్కోడ మెందుకండీ... కనపడుతూవుంటే. వాడిష్ట ప్రకారమే కానిద్దాం."

* * ,

కిష్టమూర్తి కూతురిపెళ్ళి సుందర్రావుతో 'ఘళ్ళుమని' చేసేశాడు-కానీ కట్నం లేకుండా.

పెళ్ళయిపోయాక సరోజ, సుందర్రావుతో "నాన్న భలే ప్లాటువేశాడు. మీ నాన్నగారు మీ చేతిలోది నిజంగా విషమేమోనని...ఇంక చూసుకో ఆకంగారూ... నాన్న చెప్పాల్సిందే" అని విరగబడి నవ్వింది.

కూతురి పెళ్ళయాక కిష్టమూర్తి స్వవిషయాల్లో చాలా జాగ్రత్తగా వుంటున్నాడు.

గమ్మత్తేమిటంటే నలభై ఏళ్ల కిష్టమూర్తి మళ్ళా ఏడు ఒక్కసారి తండ్రీ, తాత కూడా ఐపూరుకున్నాడు.

అతను లౌక్యుడు...సంసారి మరి. ★

## సమర్పణ

(23-వ పేజీ తరువాయి)

సీతమ్మని చూడాలని ఒకటే పట్టు పట్టేసింది" అని విపులీకరించేడు.

అంతా కలిసే వెళ్ళేరు.

ఆశ్చర్యాలు, అనురాగాలు కట్టలు తెగిన్నీ పోయేయి. రహస్యాలు అంతు తెగనూ లేదు. కాలం తక్కువే అయిపోయింది వాళ్ళ కలయికలో.

"ఓ వారం రోజులు వుండండి మా దగ్గర" అంది సీతమ్మ.

అవధాని మాత్రం "రావడానికి మాకేం అభ్యంతరం లేదు. కాని అది మీకు మాత్రం..." అని సగంలో ఒదిలివేసేడు.

గుర్తించినట్లుగా చలపతి "మనం రాజకీయాలు మాట్లాడుకోవటం లేదుగా" అన్నాడు.

అర్థంకాక తికమకపడింది సీతమ్మ. రమణమ్మ గ్రహించేసింది.

"విభిన్నదృక్పథాల్తో, స్వాతంత్ర్య సాధన చేసే వర్గాలు మనం. ఒకరికి, హింస, మరొకరికి అహింస పరమావధి. ఇందులో ఎవరిది విజయం అన్నది కాలం చెప్పాలి.

భావికాలు వేరయినప్పుడు ఆత్మలు ఎంతగా ఏకజనితమైనా కలియడం కష్టం. అది, అసాధ్యం కూడాను.

పైగా లోకం హర్షించదు." అనీ సమిధ వేసేడు వెంకట్రామయ్య.

చలపతి నవ్వుతూనే "చుట్టాల ఇంట్లో కూడా వకాల్తా పుచ్చుకున్నట్లు వాదించేస్తున్నారే" అనీ అనేసేడు లోపల మండుతున్నా. ఈ అప్రసంగానికి అందరూ ఓ సారి నవ్వుకున్నారు.

అంతే!

## తమాషా లెక్కలకు జవాబులు

ఒకటో లెక్క: పైవరుసలో పావురాలు

కిందివరుసలో పావురాలు

రెండో లెక్క: మొత్తము 11 ముత్యాలు

సంవత్సరం తిరక్కుండా రమణమ్మ, అవధాని, వెంకట్రామయ్య కూడా హాడావిడిగానే ఉద్యమంలో ప్రవేశించేరు.

ఈసారి చలపతే తెల్లబోయేడు. కాంగ్రెస్‌వారి 'ఇండియానుండి వైదొలగండి" అన్న ఉదుటుకు.

కాని

దాంతో ఏవో ఏవో అభాండాలు చలపతి నెత్తిమీద పడ్డాయి. 'పార్టీ ద్రోహి' అని వినమూ విన్నాడు. తనమీద తనవాళ్ళ తిరుగుబాటు.

(ఇంకావుంది)

## సత్కార్యం

(43 వ పేజీ తరువాయి)

లక్ష్మయ్య మాటలను సగంలోనే అందుకుని "విశ్వదాభిరామ వినుర వేమ!" అంటూ చిన్న కూని రాగంలో సాగదీసి పూర్తిచేశాడు చెంచయ్య సుందరానికి తన మనవరాలి నిచ్చి పెళ్లి చేసెయ్యడానికి కూడా నిశ్చయం చేసుకున్నాడు చెంచయ్య.

సభంతా హర్షధ్వానాలు చేసింది, "ఈ ఉంగరం ధరించడానికి సుందరం ఎక్కువ అర్హుడు," అన్నాడు లక్ష్మయ్య. అధ్యక్షుడు ఉంగరం పుచ్చుకుని సుందరం ప్రేలికి పెట్టాడు.

సత్యం, శివం, ఒకళ్ల మొహాం ఒకళ్లు చూసుకున్నారు. సుందరం వినయంగా అందరికీ నమస్కరించాడు. అతని ప్రేలిపై వజ్రపుటుంగరం ధగధగా మెరిసిపోయింది. ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.



చిటపట చినుకులు

చిత్రకారుడు: పి. వి. వెంకటేశగుప్త—మద్రాసు.

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.